త్రులను జూచి మేము మరణింతుముగాక" అని చెప్పి, తల్లిదండ్రులు సారమ్మను బంపుచు ముద్దు పెట్టుకొని యిట్లని బుద్ధులు కఱపిరి. "అమ్మా! నీయత్తమామలను బూజ్యులను గాఁ జూచుకొనుచుఁ బతిభక్తి గలిగి యుండుము; ఇంటిలోని కార్యములు నీవనుకూలముగఁ బరామర్శించికొనుము; అందఱిని లెస్సగా నడపించుకొనుము; అపవాదములకుఁ గారణము లేకుండ, సందులేకుండ, సంచరింపుము" అని బోధించి పంపిన పిమ్మటఁ బ్రయాణము చేసిరి. పదునొకండు దినములకు సగము మార్గము నడచిరి. అప్పుడు సన్మనస్కుఁడు తోభ్యునితో "అన్నా! మీ యయ్యను విడచి చాల నాళ్లయినది; మత్స్యముయొక్క పిచ్చు తీసికొని మనము ముందుగాఁ బోవుదము; వెనుక నీ భార్యను దీసికొని పరివారము జనులు నిదానముగా వచ్చెదరు" అని చెప్పినఁ దోభ్యుఁడు సంతసముతో సమ్మతించి యా ప్రకారమే చేయఁగాఁ గొంతకాలమునకు స్వగ్రామము చేరిరి.

అక్కడ అన్నమ్మ నిత్యమును దారిలో నున్న పర్వతశిఖరమునఁ గూర్చుండి దూరముగా నున్న మార్గమును జూచుచుండెను, కావున నెదురుగా వచ్చుచున్న పుత్రుని గుర్తుపట్టి, యింటికిఁ బరుగెత్తికొని వచ్చి, పెనిమిటితో "నీ కుమారుఁడు వచ్చుచున్నాఁ" డనియెను. చిన్న తోభ్యునితో సన్మనస్కుఁడు, "నీవు గృహప్రవేశము చేయఁగనే స్వామికారాధన స్తోత్రములు చేసి తండ్రి నాలింగనము చేసికొని చేఁపపిచ్చు నతని కన్నులకుఁ బట్టించుము; అపుడు కన్నుల దృష్టి కనఁబడి నీ తండ్రి నిన్ను జూచి సంతోషపడును" అని యుపదేశించెను. ఆ వేళకుఁ బెద్దతోభ్యుఁడు పుత్రున కెదురు పోవలయునని, దాసుని చేయి పట్టుకొని, తడఁబడుచు నడచుకొని వెళ్లుచుండెను. సంతోషమలర తల్లి, దండ్రి, కుమారుని గలసికొనగా, నొకరినొకరు కౌఁగలించుకొనిరి. కన్నీరు వెట్టుకొనుచు నందఱును స్వామిని స్తుతించిరి. కూర్చుండి తండ్రి కన్నులకుఁ బుత్రుఁడు పిచ్చు పూసెను. ఒక్క గడియకుఁ గన్నులనుండి తెల్లపొడిపొరలు రాలి దృష్టి వచ్చెను. అందఱును వింతపడి దైవమును స్తుతి చేసిరి. పెద్దతోభ్యుఁడు, "ఓ మా యేలినవారా! నన్ను సృష్టించినారు, నా పుత్రుని జూచుటకుఁ గన్నులు దయచేసినారు, ఇదిగో నా తనయుని గనుఁగొంటిని" అని స్వామికి స్తోత్రము చేసెను. మఱి యేడు దినములకు సారమ్మ సపరివారముగా నిర్భయముగ నిరాటంకముగ వచ్చి చేరెను. అపుడు బంధువులందఱును, సంతోషముప్పొంగఁగా, స్వామి వారికిఁ బ్రసాదించిన భాగ్యములకై స్తుతించిరి. ఏడు దినములు సంభ్రమముతో భోజనములు చేసిరి. ఎల్లవారును సుఖపడిరి. సన్మనస్కునిద్వారా స్వామి చేసిన యుపకారములను గుమారుఁడు చెప్పఁగా పెద్దతోభ్యుఁడు తెలిసికొని యతనితో నిట్లనియెను. "నాయనా నీకుఁ దోడుగా వచ్చిన మహాత్మునకు మనమేమి యుపకారము చేయఁగలము, ఏమి యిచ్చెదము" అనినఁ బుత్రుఁడు తండ్రితో "నాయనగారు! ఆయన యుపకారమునకు మనమేమి ప్రత్యుపకారము చేయఁగలము; మనమెంత యిచ్చినను ఆయన చేసిన ఫలమునకు సమానము గాఁజాలదు; పోవునపుడు తిరిగి వచ్చునపుడు నా కేమియు మోసగాండ్రవలన హాని కలుగకుండ కాపాడినాఁడు; గబేలుని పైకము తెచ్చెను. నాకుఁ బెండ్లి చేయించెను. నా సతిని బాధించునట్టి పిశాచమును నిగ్రహిం

చెను; ఆ కన్య తల్లిదండ్రులకు సంతోషమును గలిగించెను; నీకుఁ గన్నులకు దృష్టిప్రకాశము గలుగఁ జేసెను; సకల భోగములయందు మనలను దృప్తిచేసినాఁడు; అంతటి పనికి సరియైన బహుమాన మేమి కలదు? ఎట్లయినను నేను దెచ్చిన పదార్థములలో సగము పాలు తీసి వీరి కీయవలయును; నీ వాయనతో మన కానుకను సమ్మతించి పుచ్చుకొనునట్లు మనవి చేయవలయును" అని నంతఁ దోభ్యుఁడు సన్మనస్కుని ప్రార్థించి "నాకు మారుఁడు సంపాదించికొన్న సమస్త వస్తువులలోనుండి సగపాలు మీరు స్వీకరించి మా పిల్లవాని నాశీర్వదింపవలయు ననెను.

సన్మనస్కుఁడు ప్రజలెల్లరు వినుచుండ "ఓ పుణ్యాత్ములారా! మిమ్ముఁ గృపా కటాక్షముతోఁ జూచి రక్షించిన దైవమును మీరు స్తుతింపుఁడు; రాజ్యమును గోప్యముగా నుంచుట మంచిది గాని దైవమహిమలను బ్రఖ్యాతి చేయుటయే యుత్తమము; పూడ్చిపెట్టిన కనక నిక్షేపములకంటె, చేసిన యుపవాసములు, జపము, బిచ్చమిచ్చుట యెక్కువ యవి; భిక్షము మరణమునుండి రక్షించును; పాతకముల విమోచనము చేయును; బిచ్చము మోక్షద్వారమే, కాఁబట్టి మీకు గుప్తవచనములు చెప్పుచున్నాఁడను; నీ వన్నము విడిచి చచ్చిన వారలను స్థాపించినపుడును, నీవు దుఃఖముతో జపము చేయునపుడును, నీ జపధర్మములను నేనే దేవునకు సమర్పించితిని. నీవు దేవునికిఁ బ్రియుఁడవై యున్నందున నీకుఁ శోధన రావలసివచ్చెను, నీ కనులు గుణపడునట్లుగాను, సారమ్మకు దయ్యపుబాధ హరించునట్లుగాను, ఏలినవారు నన్నంపించినారు. యెందుకనగా దేవుని సముఖములో నిలుచు నేడుగురిలో నేను ఒక్కఁడను, నేను రఫయేలు అనునట్టి సన్మనస్కుఁడను" అనిన వాక్యములు వారి శ్రోత్రములలోఁ బడినంతనే, యందఱును దల్లడపడిరి. గడగడ నడఁకి నేలమీఁద ముఖము క్రిందుగాఁ బడి నమస్కరించిరి. "మీ కందఱకు సమాధానమగుఁగాక! వెఱవకుండుఁడు, నన్నుఁ బంపిన వారి దగ్గఱకుఁ బోవుచున్నాఁడను, మీరు స్వామిమీఁద భక్తిగలిగి స్తుతించి, వారు చూపిన కృపను ప్రజలెల్లరకు వివరించి తెలియఁ జెప్పుఁడు" అని వచించి యా మహానుభావుఁ డదృశ్యుఁడై పోయెను. తరువాత నొక్క జాముపఱకు సాష్టాంగపడి తండ్రియుఁ దనయుఁడును దైవస్తోత్రము చేసిరి. పెద్ద తోభ్యుఁడు, "స్థిరమహిమతో నున్న యేలినవారా! శాశ్వత రాజ్యముమీఁద మీకు నధికారము, పాపాత్ములను దండించి రక్షించువాఁడవు, మీ హస్తదండనమును దప్పించువారెవ్వరు? ఇస్రాయేలు వాసులారా! శాశ్వతముగా జనులెల్లరు వినునట్లుగా స్వామికిఁ దగినస్తోత్రములు చేయుఁడు, ఆయన నెఱుఁగని వారలకు బోధించి, ఆయనగాక యన్య దైవము లేదని, వారి మహిమ యాద్యంతమును జెప్పుఁడు; స్వామి, పాపాత్ములను రక్షించు నీతిపరులు, నన్ను రక్షించినారు," అని కృపగల యా తోభ్యుఁడు వచియించి లేచి జనులెల్ల వినునట్లు తన వృత్తాంతమును జెప్పి నూటరెండేండ్లు సుఖముగాను జనులకు నిష్టుఁడుగాను జీవించెను. మృతికాలము దగ్గఱింపఁగా, నొక్కనాఁడు తన సుతునితోను ఏడుగురు మనుమలతోను, దన కడపటి వాక్యము లిట్లు చెప్పెను. "నా బిడ్డలార! వినుండు, కపటము లేకుండ స్వామిని గొలుచు

చుండి, యాయనకు సమ్మతియైన నడత గలిగి యుండుఁడు; మీ వలెనే మీ బిడ్డలును నడచుకొనునట్లు జేయుఁడు; భిక్షము పెట్టి దీనులను గాపాడునట్లు, ఎల్లవేళల దైవస్మరణ చేయుచుండునట్లు, దృఢమనస్కులై స్వామిని నమ్మునట్లు, మీ పుత్రులకుఁ గట్టడ చేయుఁడు; ఈ నినివే పట్టణములో దుష్కృత్యము లెక్కువనై పోవుచున్నవి. కావున స్వల్ప కాలములో నీ పట్టణము క్షయము కాఁగలదు; కాఁబట్టి నన్ను సమాధిలో స్థాపించి, మీఁదట మీ తల్లి మరణించినపుడు నా సమాధిలోఁ జేర్చి యీ పట్టణము విడిచి పోవలయును'' అని తోభ్యుఁడు బోధించి దేవుని సన్నిధికిఁ బోయెను. అప్పుడు సత్యవేదశాస్త్రి ప్రకారము సంస్కారవిధులు బహు విధముల నార్భాటముగాఁ బుత్రుఁడు తండ్రికిఁ దీర్చెను. అటుపిమ్మటఁ గాలమైన తల్లికిని ఆ ప్రకారమే చేసి, పితృవచనముల నేమఱక, చిన్న తోభ్యుఁడు నినివే పట్టణము నెడఁబాసి తన మామగారి యూరి కరిగెను. అక్కడఁ దన వంశాభివృద్ధి పొందునట్లుగా, జనులును దైవమును మెచ్చునట్లుగా సకల ధర్మములు నాచరించి యథేష్ట సుఖముల ననుభవించుచుండెను.

ఈ తోభ్య చరిత్రము వ్రాసినట్టియు జదివినట్టియు నెల్లమానవులకు, నాయురారోగ్యైశ్వర్యములను బరలోక భాగ్యములను బరమేశ్వరుఁడు మిక్కిలి దయతో నొసఁగునుగాక.

సత్యవేదమునకు సమముగానున్న ధర్మతోభ్య చరిత్రము.

స మా ప్త ము .



శ్రీ సర్వేశ్వరాయ నమః.

# సత్యవేదమహాత్మ్యము

## అను

## శ్రీ భవ్యచరిత్ర.

అవతారిక.

శా॥ శ్రీచైతన్యకళానిరూఢి ఘనతన్ జెన్నై జగత్పూర్ణమై
ప్రాచీనార్య ప్రవీణులెల్లఁ గనఁగా భాసిల్లు సర్వేశ్వరుం
డీ చందంబున శిష్యరక్షణకునై యేతెంచె నౌ నా మఱీ
యాచార్యుం డగు జేసునాథు మది నత్యంతంబు నేఁ గొల్చెదన్. 1

శా॥ వేదాతర్క్య్య మనాద్య మవ్యయమునై విశ్వప్రపంచంబు ను
త్పాదింప న్మనుపన్ హరింపను మహాకర్తృత్వ విస్ఫూర్తిమై
సాదృశ్యాదికవర్జ్యమై వెలయు నా సర్వేశ్వరా నీవ యా
హ్లాదం బొప్పఁగ నిమ్మహాకృతికి దీర్ఘాయుష్యముం జేయుతన్. 2

ఉ॥ ఒక్క నభంబ నేక కలశోదకబింబితమైన రీతిఁ బెం
పెక్కఁ జరాచరంబుల వహించుచుఁ గొంచెముకంటెఁ గొంచెమై
యెక్కువకంటె నెక్కువగు జేసువు నే శరణంబు వేఁడుచున్
మ్రొక్కెద మాటిమాటికిని మోద మెలర్ప నభీష్టసిద్ధికిన్. 3

---

1. శ్రీ చైతన్య కళా నిరూఢి ఘనతన్=శోభనమైన జ్ఞానముయొక్క కాంతిచే ప్రసిద్ధికెక్కిన గొప్పతనమువలన; చెన్నై=సుందరమై; జగత్పూర్ణమై=ప్రపంచమునం దంతటను నిండినదై; ప్రాచీన ఆర్య ప్రవీణులెల్ల గనగా=పూర్వకాలపు పూజితులగు మహాఘనులందఱు ఎఱుగగా; భాసిల్లు=ప్రకాశించుచున్న సర్వేశ్వరుడు; ఈ చందంబునన్=ఈ (నా గురువు) రీతిగా; శిష్యరక్షణకునై=శిష్యులను రక్షించునిమిత్తము; ఏతెంచెన్=వచ్చెను; ఔన్=నిశ్చయము; నాన్=అనునట్లు; మఱియు ఆచార్యుండు=నాయొక్క గురువుగానైన జేసునాథుని కొల్చెదను.

2. వేద అతర్క్యము=వేదములుకూడ ఊహింపలేనిది; అనాద్యము=మొదలు లేనిది; అవ్యయమై=నాశములేనిదియై; విశ్వప్రపంచంబున్ ఉత్పాదింపన్ మనుపన్ హరింపను=సమస్త లోకములను పుట్టింప పెంప నశింప జేయుటకు; మహా కర్తృత్వ విస్ఫూర్తిమై=గొప్ప యధికార ప్రకటనచే; సాదృశ్య ఆదిక వర్జ్యమై=సాటి మొదలైనవి లేకుండ వెలయు; సర్వేశ్వరా, ఆహ్లాదం బొప్పగన్=సంతోషముతో; ఈ మహాకృతికి=ఈ గ్రంథమునకు; దీర్ఘాయుష్యమున్=చిరకాలము జీవితమును; చేయుతన్=కరుణించువుగాక.
తా॥ మొదలు తుదలేనివాడును, సృష్టి స్థితి లయములు చేయుటకు శక్తిగలవాడునైన, సర్వేశ్వరుడా నీవు నా గ్రంథము నాశనము లేకుండ చిరకాలముండునట్లు చేయుదువుగాక.

3. ఒక్క నభంబు=ఒక్క యాకాశమే; అనేక కలశ ఉదక బింబితమైనరీతిన్=పెక్కు కుండలలోని నీటిలో కనబడిన విధమున; పెంపు ఎక్కన్=అతిశయింపగా; చర అచరములను=కదలునట్టి కదలని యట్టి వస్తువులను; వహించుచున్=కాపాడుచు; కొంచెముకంటె గొంచెమై యెక్కువకంటె నెక్కువగు జేసువు యొక్క శరణంబు వేడుచున్; అభి ఇష్ట సిద్ధికిన్=కోరినకోరిక నెఱవేఱుటకు (ఈ గ్రంథము సంపూర్ణమగుటయే కవి కోరిక) మోద మెలర్ప=సంతోషము అతిశయింపగా మ్రొక్కెదను. (జేసునాథుడు అవతారము నెత్తగా తన్ను అందరికన్న తక్కువగా చేసికొని పిమ్మట అందరికన్న అధికము పొందెను.)

సీ॥ భక్తిమై రేణుకప్రమథోత్తము నుతించి - మాయదేవాహ్వాయు మహిమఁ బొగడి
చెలఁగి యథావాక్యముల యన్నమయగారి - భజియించి మ్రొక్కిడి పాలకురికి
సోమన్నగారిఁ బ్రస్తుతిచేసి ప్రియమాడి - శివదేవ నవముఖకవుల నెంచి
గణపతి దేవుని ఘనత సన్నుతిచేసి - వేమనఁ గీర్తించి విమలమతిని,
తే॥ వ్యాసవాల్మీకి కాళిదాసాది ఘనుల - నన్నపార్యునిఁ దిక్కనయజ్వ నెఱ్ఱ
ప్రెగడ ధూర్జటిఁ బోతన భీమకవినిఁ - జెలఁగి శ్రీనాథముఖకవిశ్రేణిఁ దలఁచి. 4

తే॥ కలిత గుణగణ కల్పనా గౌరవముల - వృత్తి దెలియక తప్పులే వెదకుచుందు
రవని రత్నాకరముల లోహాశనముల - పగిదిఁ గుకవులు గెలువరు పండితులను. 5

వ॥ అని దైవప్రార్థనంబును సుకవి స్తోత్రంబును గుకవి నిరాకరణంబునుం గావించుచు నెద్దియేనియు నొక్క పుణ్యేతిహాసం బాంధ్రభాష రచియింపు తలంపున నుండు నవసరంబున. 6

చ॥ తనర విదర్భసీమ కవతంస మనం దగు కొండవీటి కిం
ద్రునిదెస రాజ్యలక్ష్మికి నిగూఢ నివాస మనంగ భక్తవా
డను పుర మొప్పు నుర్వరకు హారమణి స్థితిఁ బొల్చి సజ్జనుల్
ధనకనకాంబరాదుల సదా విభవోన్నతిఁ జెంది వర్ధిలన్.

4. రేణుకప్రమథ ఉత్తముని=రేణుకుడను గణశ్రేష్ఠుని నుతిచేసి; మాయదేవ అహ్వాయు మహిమన్=మాయదేవుడను పేరుగలవాని గొప్పతనమును పొగడి; యథావాక్యముల అన్నమయ్యగారిని=సర్వేశ్వర శతకము చెప్పిన కవిని; పాలకురికి సోమన్నగారిని=పండితారాధ్య చరిత్రము రచించిన కవిని; శివదేవయ్య=ఒక కవి; మొదలైన శ్రోత్రికవులను నెంచి, గణపతి దేవుడు అను కవిని స్తుతించి, వేమన కీర్తించి, వ్యాసుడు, వాల్మీకి, కాళిదాసు ఆది ఘనులైన వారిని (వ్యాసుడు=భారత కర్త, వాల్మీకి=రామాయణ కర్త, కాళిదాసు=ఒక్క గొప్ప కవి; వీరు సంస్కృత కవులు) నన్నపార్యుడు=నన్నయభట్టు; తిక్కనయజ్వ=తిక్కన సోమయాజి; ఎఱ్ఱప్రెగడన్=ఎఱ్ఱప్రెగడను (వీరు ముగ్గురును తెనుగు భారతము రచించిన కవులు) ధూర్జటి=కాళహస్తి మహాత్మ్యమును రచించిన కవి; పోతన=బమ్మెర పోతరాజు (భాగవత కవి) భీమన=వేములవాడ భీమ కవి (కవి జనాశ్రయ కవి) శ్రీనాథ=శ్రీనాథుడు (కాశీఖండము శృంగార నైషధమును రచించిన కవి;) ముఖకవిశ్రేణి=గొప్ప కవుల సమూహము తలచి.

5. కలిత గుణ గణ కల్పనా గౌరవ వృత్తిన్=కూడియుండిన మంచి గుణముల సమూహమును కల్పించుటయందు గొప్పదియగు వ్యాపారమును దెలియక అల్ప కవులు తప్పులనే వెదకుచుందురు; ఎట్లనగా: రత్న ఆకరములన్=రత్నములు పుట్టునట్టి గనులలో; లోహ అశనము పగిదిన్=ఇనుమును పట్టుకొను సూదంటు రాయివలె. తా॥ ఏలాగు రత్నములు పుట్టిన గనిలో సూదంటురాయి రత్నములను బట్టుకొనలేక యినుమును మాత్రమే పట్టుకొనునో, ఆలాగున మంచి కల్పనలుగల పుస్తకములోని గొప్పతనమును గ్రహింపలేక తక్కువ చదివిన కవులు తప్పులను మాత్రమే పట్టుకొనుదురు. వీరు మంచి కవులను జయింపరని కవి హాస్యము చేయుచున్నాడు.

7. తనరన్=ఒప్పునట్లు; విదర్భసీమకున్=విదర్భ యను పేరుగల దేశమునకు; అవతంసము=అలంకారము అనదగిన కొండవీడునకు; ఇంద్రునిదెసన్=తూర్పుదిక్కున; రాజ్యలక్ష్మికి=రాజ్యసంపదలకు; నిగూఢ నివాసము=స్థిరమైన కాపురముండు చోటు అనగ భక్తవాడ అను పురము; ఉర్వరకున్=భూమికి; హార మణిస్థితిన్=ముత్యాలహారములోని నాయకమణివలె; పొల్చి=ఉండి; మంచి జనులు ధన కనక అంబర ఆదులన్=ధనము బంగారు వస్త్రములు మొదలైనవానియొక్క; విభవోన్నతిన్=ఎక్కువయైన వైభవమును జెంది వర్ధిల్లగా; ఒప్పును.

వ॥ అప్పట్టణంబున కధీశ్వరుండు. 8

సీ॥ తన కీర్తి కామినుల్ దశదిశాభాగరం - గస్థలంబుల నాట్యగతులు సలుపఁ
దన శౌర్యవహ్ని దుర్దమ భయంకర శత్రు - ధరణీశ్వరాటవుల్ దరికొనంగఁ
దన దాన సెలయేఱు ఘనయాచకాబ్ధినే - గడు వేగ లంఘించి కలియఁ జనఁగ
దన కరుణారస ఘనతరౌషధ మఖి - లార్థి దారిద్ర్యామయంబు లణఁప
తే॥ ఘనతఁ జెన్నొందె జగనొబ్బగండ బిరుద
భూషణుఁడు తుమ్మవంశాబ్ధి పూర్ణచంద్రుఁ
డలఘుచరితుఁ డనంతాధిపాత్మజుండు
రమ్యరుచిహేళి గాయపరడ్డి మాళి. 9

వ॥ ఒక్కనాఁ డమాత్య విద్వత్కవీంద్ర తార్కిక వందిమాగధ సుహృద్బంధు సేనాధీశ్వరసహితంబుగా నాస్థానమండపంబున గీత వాద్య నృత్య వినోదలీలా కౌతూహలమానసుండై యుచితాసనంబున సుఖాసీనుండై. 10

తే॥ అనుఁగుఁ దమ్ముఁడు పాపన్న వినయచరితుఁ
డాత్మ ధర్మప్రవర్తన ననుకరింపఁ
బరఁగఁ దన మంత్రి పొత్తూరి పాపనార్యుఁ
డెలమి విద్యాప్రసంగముల్ సలిపినపుడు. 11

9. తన కీర్తికామినుల్=యశస్సు అనెడు స్త్రీలు; దశ దిశాభాగ రంగస్థలంబులన్=పది దిక్కులనెడు నాటక స్థలములలో; నాట్యగతులు సలుపన్=నృత్యముయొక్క రీతులను; చేయుచుండగా

తన శౌర్యవహ్ని=పరాక్రమమనెడు అగ్ని; దుర్దమ భయంకర శత్రుధరణీశ్వర అటవుల్=అణచుటకు శక్యముగాని భయమును కల్గించు విరోధిరాజులనెడు అడవులను; దరికొనంగన్=కాల్చుచుండగా;

తన దాన సెలయేఱు=తన దానమనెడు కొండ ప్రవాహమువంటిది; ఘనయాచక అబ్ధినే=గొప్ప యాచకులనెడు సముద్రమును; గడు వేగ లంఘించి కలియ చనగా=మిక్కిలి వేగముగా దాటి కలిసికొన పోగా;

తన కరుణారస ఘనతర ఔషధము=కరుణ యనెడు రసముగల గొప్పమందు; అఖిల అర్థి దారిద్ర్య ఆమయంబులు=సమస్త యాచకుల బీదతనమనెడు రోగమును అణపగా;

జగనొబ్బగండ (ఇది కన్నడపదము) "జగత్తునకు ఒక్కడే నాయకుడు" అనెడు బిరుదుచే అలంకరింపబడినవాడును; తుమ్మ వంశాబ్ధి పూర్ణచంద్రుడు=తుమ్మవారల కులమనెడు సముద్రముపై నుండు నిండు పున్నమనాటి చంద్రుడును; అలఘు చరితుడు=ఘనమైన చరితము గలవాడును; అనంత అధిప ఆత్మజుడు=అనంతయ్య అను నధికారియొక్క కొడుకును; రమ్యరుచి హేళి=సుందరమైన కాంతిచేత సూర్యునివంటి వాడునైన; గాయపరడ్డి మాళి=రెడ్డి శ్రేష్ఠుడు ఘనతతో చెన్ను పొందెను.

10. అమాత్య=మంత్రి; విద్వత్=పండితులు; కవీంద్ర=మంచి కవులు; తార్కిక=తర్కశాస్త్రము చదివినవారు; వంది=బట్టురాజులు; మాగధ=ఒకరి వంశపు పూర్వుల చరిత్రము దెలిసి పొగడుచుండువారు; సుహృత్=స్నేహితులు; బంధు=చుట్టములు; సేనాధీశ్వర=సేనలకు పెద్ద నాయకులు; సహితంబుగా ఆస్థానమండపంబున=వీరితోగూడ కొలువుకూటములో; గీత వాద్య నృత్య వినోదలీలా—సంగీతము మద్దెలం మొదలైనవాని ధ్వనులయొక్క; ఆనంద విలాసములచేత; కౌతూహలమానసుండై=సంతోష మనస్సుకలవాడై; ఉచిత ఆసనంబునన్ సుఖ ఆసీనుడై=తనకు దగిన పీఠముపై సుఖముగా గూర్చుండి,

11. అనుగు=ముద్దు తమ్ముడగు పాపన్న; వినయ చరితుడు=మర్యాదగల నడత గలిగినవాడు; ఆత్మ ధర్మ ప్రవర్తనము అనుకరింపన్=తనకు తగిన నడవడికతో ప్రవర్తించుచుండగా; పొత్తూరి పాపన్న యను బ్రాహ్మణమంత్రి ఎలమితో విద్యాప్రసంగముల్=విద్యనుగూర్చి సంభాషణము చేయగా.

మ॥ నను శ్రీ మద్గురు చిత్కళేక్షణ మహానందాను సంధాన పా
వన కారుణ్య కటాక్షలబ్ధ వరగీర్వాణాంధ్రభాషా కవి
త్వ నిరోష్ఠ్యక్రమ చిత్రలక్షణ చమత్కార ప్రబంధాశుక
ల్పనునిం బింగళి యెల్లనార్యమణిఁ బిల్వం బంచి సత్కృపన్. 12

ఉ॥ ప్రణుతయశో విశాలుఁడవు భాసురశబ్దనిగుంభనార్థల
క్షణములఁ జిత్రవైఖరులఁ సర్వనృపాల సభాంతరంబులన్
గణుతికి నెక్కె నీ కవిత కర్ణరసాయన మాచు నిప్పురిన్
గణక వితానమందు నతి గౌరవ మందితి వెంచి చూడఁగన్. 13

ఉ॥ పనివడి నేఁడు నీవొక ప్రబంధముఁ గూర్పఁగఁ బూనవయ్యెడిన్
జనులు నుతింపఁ జిన్నపుడె ఛందము చందముఁ దప్పనీక యీ
వనుపమలీలఁ జెప్పితివి యావనభాషను గద్యపద్యమున్
ఘన మనఁగూడునే తెనుఁగు కబ్బము నీదు కుశాగ్రబుద్ధికిన్. 14

శా॥ కొండారెడ్డి ఘనుండు శౌర్యపటిమం గొప్పైన మునాటి యు
ద్దండుం డన్న యతండు మాకు సుకవీంద్రశ్రేణిఁ బ్రోచున్ సిరుల్

12. శ్రీమత్ గురు చిత్కళ ఈక్షణ మహానంద అను సంధాన పావన కారుణ్య కటాక్షలబ్ధ=శుభమైన గురువుయొక్క జ్ఞానకళతో గూడిన చూపుచేత మిక్కిలి యానందమును గూర్చుకొనిన పవిత్రమైన కరుణకటాక్షముచే బొరకిన; వరగీర్వాణ ఆంధ్రభాషా కవిత్వ=శ్రేష్ఠమైన సంస్కృతమున దెనుగున గవిత్వములు చెప్పుటలో; నిరోష్ఠ్యక్రమ చిత్రలక్షణ చమత్కార ప్రబంధ ఆశుకల్పనునిన్=పెదవులు తగులకుండు నక్షరములతో చిత్రముగ చమత్కారమైన గ్రంథములను శీఘ్రముగా జెప్పెడు కవిత్వ కల్పనము గలవానిని; పింగళి యెల్లన్న యను బ్రాహ్మణ శ్రేష్ఠుడగు నన్ను బిలిపించి.

13. ప్రణుత యశః విశాలుడవు=స్తుతి చేయబడిన కీర్తిచేత ప్రసిద్ధి చెందినవాడవు; భాసుర శబ్ద నిగుంభన అర్థలక్షణములు=తప్పులు లేని పదములతో కూర్పబడిన యర్థమును వాని లక్షణములును గలిగిన; చిత్రవైఖరులన్=చిత్రమైన రీతులచేత; సర్వనృపాల సభాంతరంబులన్=సమస్తమైన రాజులయొక్క సభలలో నీ కవిత్వము గణుతికి నెక్కెను; కర్ణరసాయనమాచున్=చెవునకు ఇంపు కలిగించుచు; ఈ పురి యందు; గణక వితానమందు=కరణముల సమూహములో; అతి గౌరవమందితివి=నీవు మిక్కిలి మర్యాదను పొందియుంటివి.

14. పనివడి=ప్రారంభించి; ఒక ప్రబంధము; కూర్పగ బూనవయ్యెడిన్=రచించుటకు యత్నము చేయవలయును. నిన్ను చిన్నపుడె జనులు నుతింప; ఛందము చందము=పద్యమునందలి గణ యతి ప్రాస మొదలగువాని విధములు; తప్పనీక=తప్పుల చేయక; యావనభాషన్=యవనులభాషలో (తురకలను యవనులందురు. వీరి భాష, పారసీ అరబ్బీ, యివి యవనభాషలు) అనుపమలీలన్=సాటి లేని విధముగా చెప్పితివి. (కాబట్టి ఇతర భాషలో జక్కగా గ్రంథములు వ్రాసినందుచేత) నీదు కుశాగ్రబుద్ధికిన్=నీ సూక్ష్మబుద్ధికి (కుశ=ఒక విధమైన దర్భగడ్డి. దీని చివర మిక్కిలి సూక్ష్మముగా నుండును. కాబట్టి బుద్ధిమంతులను కుశయొక్క చివర యెంత సన్నముగా నుండునో అంతటి సన్నని సూక్ష్మమైన బుద్ధిగలవాడని చెప్పుదురు) తెనుగు కబ్బము=నీ స్వభాషయైన తెనుగు గ్రంథము; ఘన మనగూడునే=నీకొక కఠినకార్య మనవచ్చునా-కఠినము గాదు, తేలికయే యనుట.

15. శౌర్యపటిమన్=పరాక్రమముయొక్క నేర్పుచేత; [illegible]; ఆ యుద్దండుడు=ఆ శౌర్యుడగు నా యన్న (పెద్ద తండ్రికొడుకు) సుకవీంద్రశ్రేణిన్=మంచి కవులను బ్రోచును; సిరుల్ నిండన్=సంపదలు ఒప్పినట్లు; దామెర వేంకట ప్రభువుగారు మన్నింపగ=సమ్మానింప

నిండఁగ దామెర వేంకటాధిపుఁడు మన్నింపంగఁ బామూరిలో
నుండుఁగ మిమ్ము బహూకరింపఁగలఁ డీయుద్యత్కృతి శ్రేష్ఠతన్. 15

వ॥ అని సబహుమానంబుగా సుగంధద్రవ్యంబులు మదీయాంగంబున కనులేపనంబు సేయుచు హేమాంబరాభరణాలంకృతులు గావించి కర్పూరయుక్తంబగు తాంబూలంబొసంగి, "మున్న మజ్జనకాగ్రజుండును గొండారెడ్డికి జనకుండును నగు నోబళరెడ్డి భూకాంతునకుం దదీయాచార్యుండగు సంజీవనాథస్వామి పరాత్పర విజ్ఞానమార్గోపదేశ ప్రసంగవశంబున నిత్యంబైన సత్యాధ్యయన విధానప్రవర్తకుండై కృతార్థుండైన తోభ్యుండను నొక్క మహాపురుషుని చరిత్రంబుగల సర్వేశ్వరమహాత్మ్యంబను వాక్యగ్రంథం బొసంగె: దీనిం బరిశీలించి సర్వేశ్వరున కంకితంబుగాఁ దెనుంగున మృదువచనరచనా గౌరవం బేర్పడఁ బ్రబంధంబు నిర్మింపవలయు" నని వినయంబు నయంబుఁ బ్రియంబునుఁ దేటపడ నానతిచ్చిన నొక్కింతసేపు సత్కథాలాపంబులం బ్రొద్దుపుచ్చి తదనుజ్ఞాతుండనై నిజనివాసంబున కరుగుదెంచి యేతత్ప్రబంధ రచనానిమగ్నాంతరంగుండనై యాత్మగతంబున. 16

ఉ॥ నశ్వరులైన వారె కద నాయకు లెల్లఁ దలంచి చూడ నీ
విశ్వములోనఁ గన్యలకు వేడుక మత్కృతకావ్యకన్యకున్
శాశ్వతుఁడో యనంతుఁ డవిచారుఁడు నంతట వ్యాపియైన స
ర్వేశ్వరుఁ డెల్లభంగుల నధీశ్వరుఁ డౌటకు నింపు పుట్టదే. 17

గా నతడు పామూరను గ్రామములో నున్నాడు. ఉద్యత్ కృతిశ్రేష్ఠతన్=నీ గొప్పదైన మంచి గ్రంథమునకు ఆయన బహుమతు లొసంగును. (దామెరవారు కాళహస్తిరాజ్యమునకు రాజులు.)

16. సబహుమానంబుగా=బహుమతులతో గూడ; సుగంధ ద్రవ్యములు=పరిమళించు అత్తరును, మదీయ అంగంబునకు=నా శరీరమునకు; అనులేపనంబు సేయుచు; హేమాంబర ఆభరణ అలంకృతులు=సరిగెబట్టలు నగలు మొదలైన అలంకారముల గావించి; కర్పూర యుక్తంబగు=కర్పూరముతో గూడిన; మజ్జనక అగ్రజుండు=నా తండ్రికి అన్నగారును; జనకుండు=కొండారెడ్డిగారి తండ్రియునైన ఓబళరెడ్డి అనెడు భూకాంతునకు; తదీయ ఆచార్యుండు=అతని గురువైన సంజీవనాథస్వాములవారు; పరాత్పర విజ్ఞాన మార్గ ఉపదేశ ప్రసంగవశంబున=సర్వేశ్వరుని తెలిసికొను దారి బోధించు మాటల వెంబడిని; నిత్యంబైన సత్యాధ్యయన విధాన ప్రవర్తకుడై=నిత్యవేదము చదువుటయొక్క ఏర్పాటునందు ప్రవర్తించుచున్నవాడైన; కృతార్థుండైన=ముక్తిపొందిన తోభ్యుండను మహాపురుషుని చరిత్రంబుగల సర్వేశ్వర మహాత్త్వము అనెడు వాక్యగ్రంథము=వచన పుస్తకము నొసంగెను. దీనిని నీవు పరిశీలించి=చదివి; అంకితముగా=సర్వేశ్వరుని పేరుపెట్టి; తెనుగున మృదువచన రచన=మెత్తని వాక్యముల కూర్పుయొక్క గౌరవము ఏర్పడగా ప్రబంధము రచియింపవలెను అని చెప్పగా; నేను ఒక్కింతసేపు సత్ కథ ఆలాపంబులన్ ప్రొద్దుపుచ్చి=కొంతసేపు మంచి కథలు చెప్పుటలో గడిపి; తత్ అనుజ్ఞాతుండనై=వానిచేత సెలవును పొంది; నిజ నివాసంబునకు=నా యింటికి పోయి; ఏతత్ ప్రబంధరచనానిమగ్న అంతరంగుండనై=ఈ ప్రబంధము రచియించు విషయమునందు మునిగిన మనసుగలవాడనై.

17. నశ్వరులైన వారె నాయకులెల్ల కన్యలకు=కన్యల భర్తలు నశించువారలే; మత్ కృతకావ్యకన్యకున్=నా చేత రచియింపబడిన గ్రంథమనెడు కన్యకు; శాశ్వతుడు అనంతుడు అవిచారుడు=ఎల్లకాలమునుండువాడును నాశనములేనివాడును దుఃఖాదులులేనివాడునైన సర్వేశ్వరుడు; ఎల్లభంగులన్=అన్ని విధములను; అధీశ్వరుడు=భర్త అగుటకు; ఇంపు పుట్టదే=సంతోషము కలుగదా?

## షష్ఠ్యంతములు.

క॥ అని సకల భువనకర్తకు - ఘనునకు నిర్జరునకును సకల సుగుణాధా
రున కద్వితీయునకు స - జ్జన హృదయ నివాసునకును సర్వేశునకున్. 18

క॥ నిత్యానంద స్వరూపికి - నత్యంత కృపానియుక్త హర్షాత్మునకున్
భృత్యాత్మ పోషకునకును - సత్యాగమ వేద్యునకును సర్వేశునకున్. 19

క॥ ఆదివిహీన స్వరూపికి - నాదరభావునకు సజ్జనారాధ్యునకున్
వేదాంతగోచరునకును - సాదృశ్య వివర్జితునకు సర్వేశునకున్. 20

క॥ ప్రాకట శుభచారిత్రున - కేక పరాత్పరున కఖిలమేళ్ల స్వరూపికిన్
వైకల్యదూరునకు ని - చ్ఛాకృత్యపరాయణునకు సర్వేశునకున్. 21

క॥ ఖ్యాతిగుణగణాన్వితునకు - సాతాను పరాక్రమగుణ సంహర్తకు దు
ర్నీతి జనవిమోచనునకుఁ - జాతుర్యోపేతచరితు సర్వేశునకున్. 22

క॥ శ్రితజన సంరక్షకునకు - నతి కళ్యాణగుణ ధీరునకును సదా సే
వితక్షాంతి స్వభావునకున్ - నతి దోషాపహారుణకును సర్వేశునకున్ 23

వ॥ అంకితంబుగా నాయొనర్పం బూనిన సర్వేశ్వర మహాత్మ్యంబను మహా ప్రబంధంబు
నకుఁ గథాక్రమం బెట్టిదనిన.

---

**18.** సకల భువనకర్తకు=సమస్త ప్రపంచమును సృజించినవానికి; ఘనునకు=గొప్పవానికి; నిర్జరునకు=ప్రాయము లేనివానికి; సకల సుగుణాధారునకు=సుగుణములు గలవానికి; అద్వితీయునకు=అసమానమైనవానికి; సజ్జనహృదయ నివాసునకు=మంచివారల హృదయములో నివసించువానికి.

**19.** నిత్య ఆనంద స్వరూపికిన్=సకల ఆనందముగలవానికి; అత్యంత కృపా నియుక్త హర్ష ఆత్మునకున్=విస్తారమైన దయతో కూడిన సంతోషముగల హృదయము గలవానికి; భృత్య ఆత్మ పోషకునకు=భృత్యుల ఆత్మలను సహాయము నిచ్చువానికి; సత్యాగమ వేద్యునకు=సత్యవేదమువలన తెలిసికొనదగినవానికి.

**20.** ఆదివిహీన స్వరూపికిన్=ఆది లేనివానికి; ఆదరభావునకు=కరుణగల హృదయము గలవానికి; సజ్జన ఆరాధ్యునకున్=మంచివారిచేత పూజింపబడువానికి; వేదాంత గోచరునకున్=జ్ఞానమార్గమున తెలియబడువానికి; సాదృశ్య వివర్జితునకున్=సాటి (పోలిక) లేనివానికి; (ఆ సర్వేశ్వరునివలె నింకొక రెవ్వరు నట్లుండరని భావము.)

**21.** ప్రాకట శుభ చారిత్రునకున్=ప్రచురమైన మంగళప్రదమైన వర్తనము గలవానికి; వైకల్య దూరునకున్=ఎడబాటు లేనివానికి; ఇచ్ఛా కృత్య పరాయణునకు=తనకు తోచిన పనులను చేయ గలవానికి.

**22.** ఖ్యాతి గుణగణాన్వితునకు=ప్రసిద్ధికెక్కిన లక్షణ సముదాయముతో కూడుకొనినవానికి; సాతాను పరాక్రమగుణ సంహర్తకు=పిశాచి పరాక్రమ గుణములను నశింప జేయువానికి; దుర్నీతి జన విమోచనునకు=దుష్టులను పాపమునుండి విడుదల చేయువానికి; చాతుర్యోపేతచరితు సర్వేశునకున్=సామర్థ్యముతో కూడిన చరిత్రముగల సర్వేశునకు.

**23.** శ్రితజన సంరక్షకునకు=ఆశ్రయించినవాని రక్షించువానికి; అతి కళ్యాణగుణ ధీరునకు=మిక్కిలి శుభ లక్షణములుగల ధైర్యశాలునకు; సదా సేవితక్షాంతి స్వభావునకున్=ఎల్లప్పుడు సేవింపదగిన భావముగలవానికి; అతి దోష అపహారుణకున్=మిక్కిలి దోషములను పోగొట్టువానికి.

# [illegible] మాహాత్మ్యము.

## ప్రథమాశ్వాసము

క. దౌర్గత్యహేతు దుర్గుణ - వర్గామయ వైద్య సుజనవందిత చరణా
సర్గస్థితిలయ కారణ - నిర్గుణ సత్యాభిమాన నిరుపమ కరుణా. 1

శా. సారాచారనియుక్త సర్వజనమై సౌవర్ణరత్నాంకితా
గారద్వార కవాటగోపుర పతాకావ్రాత సంకీర్ణమై
శ్రీ రంజిల్లగ జేరుసల్మ పురమున్ జెన్నొందు సేద్రోను నదీ
తీరక్షోణిం దనర్చు నొక్కపుర మర్థిక ధీజనస్తుత్యమై. 2

సీ. అచటి లీలాద్రి సౌధాగ్రభాగములు తు - ల్యోన్నత మణి వితానోజ్జ్వలములు
అచటి వనారామనిచయముల్ సాధార - ణామోద కల్పలతాన్వితములు
అచటి సస్యఫల స్థలాపణంబులు సమా - నద్రవ్యవిబుధ సంతర్పణములు
అచటి సరోదీర్ఘికావళుల్ సదృశబ - హూదక స్వర్ణ పద్మోత్కరములు
తే. నగుచుం దనలోన గల్గు సత్యప్రవర్త - నైకజనముల భంగి బాహ్యాంతరముల
నంతరం బేమియును లేక యతిశయిల్లె - జేరుసల్యేమను పురము చెన్నుమీఱ. 3

---

1. దౌర్గత్య హేతు=నరకమునకు కారణమైన; దుర్గుణ వర్గ ఆమయ వైద్య=చెడు గుణముల సమూహమను రోగమునకు వైద్యుడా; సుజన వందిత చరణా=మంచివారిచే నమస్కరింపబడిన పాదములు గలవాడా; సర్గ స్థితి లయ కారణ=పుట్టించుటకు పెంచుటకు చంపుటకు హేతువైనవాడా; నిర్గుణ=గుణములు లేనివాడా; సత్యాభిమాన=సత్యమునందు ఇష్టముగలవాడా; నిరుపమ కరుణా=సాటిలేని దయగలవాడా.

2. సార ఆచార నియుక్త సర్వజనమై=దృఢమైన మంచి నడవడికతో గూడిన సమస్త జనులు గలదియై; సౌవర్ణ రత్న అంకిత ఆగార ద్వార కవాట గోపుర పతాకా వ్రాత సంకీర్ణమై=బంగారును రత్నములును గూర్చిన ఇండ్లు గుమ్మములు తలుపులు పురద్వారములు జెండాలు వీనిచేత గూడియున్నదియై; శ్రీ రంజిల్లగ=సంపద ప్రకాశింపగా; సేద్రోను నదీతీరక్షోణిన్=సేద్రోను నదియొక్క యొడ్డున; అర్థిక ధీజన స్తుత్యమై=కోరికగల బుద్ధిమంతులచేత పొగడదగినదై జేరుసల్యేము అనెడు పురము తనరచుండును. (సేద్రోను అను నది ప్రక్కన జేరుసల్యేము ఉన్నది.)

3. జేరుసల్యేము లోపల నెంత యందముగా నున్నదో వెలుపలను నంతే యందముగా నున్నదని కవి భావము. కాబట్టి లోపల నుండువానిని వెలుపల నుండువానితో పోల్చి వివరించును.-లీలాద్రి=ఆడుకొనుటకై మిట్టలును; సౌధ అగ్ర భాగములు=మేడలయొక్క చివరి భాగములును; తుల్య ఉన్నత మణి వితాన ఉజ్జ్వలములు=సమానమైన పొడుగుగల రత్నముల సమూహముచే కాంతిగలవి. ఆ మిట్టలు పట్టణము వెలుపలివి, మేడలు పట్టణము లోపలివి.-వన ఆరామ నిచయముల్=వెలుపలనుండు తోటలయొక్క ఇండ్లవెనుక పూలతోటలయొక్క సమూహము; సాధారణ ఆమోద కల్పలతాన్వితములు=సమానమైన పరిమళముగల కల్పవృక్షములతో నిండినవి.-సస్యఫల స్థల ఆపణములు=పొలములును పండ్ల అంగళ్లును; సమాన ద్రవ్య=సమానమైన ధనముచేత; వి=పక్షులను; బుధ=మనుష్యులను; సంతర్పణములు=సంతోషపరచునవి.-సరః దీర్ఘిక ఆవళుల్=కోనేరుల దిగుడు బావుల సమూహము; సదృశ బహు ఉదక=సమానమైన ఎక్కువ నీళ్లను; స్వర్ణ పద్మ ఉత్కరములు=బంగారు రంగుగల తామర పొదలను గలవి, (కోనేరులు పట్టణము వెలుపలివి, దిగుడు బావులు లోపలివి.)-తనలో గల్గు సత్యప్రవర్తన ఏక జనముల భంగి=తనలో నివసించి సత్యమార్గమున సంచరించెడు ఏక జనులవలె; బాహ్య అంతరములన్=ఈ పురము వెలుపలను లోపలను; అనంతరము=భేదమేమి లేకుండ; భూరి విభవంబు=విస్తారమైన వైభవముగలదియై అతిశయిల్లెను. అక్కడి మంచి జనులకు మనస్సులో నొక్క యూహయును పైకి వేరొక్క యూహయును లేదు. (జెరుసలేము అని వ్రాయుటయే వాడుక.)

ఉ॥ అల్లన రాజవీథుల దినాంతములం బరికింప నప్పురిం
బెల్లుగ సంచరించు ముఖబృంహితగర్జలు దంతకాంతివి
ద్యుల్లతికా ప్రకాశములుఁ దోఁప సముత్కట దానవృష్టి రం
జిల్ల వసుంధరా గగనసీమ మదద్విప నీలమేఘముల్. 4

క॥ అప్పురి హయముల వేగము - చెప్పఁగ మనసునకు నలవి చెందద దనినచో
నప్పవన విశిఖవేగము - సెప్పఁగ నేమిటికి ధరణిఁ జింతింపంగన్. 5

ఉ॥ హాటక రత్నశోభితములై తగు నప్పురి సౌధవీథులం
బాటలగంధు లెల్ల హిమభానునిలో మృగశాబకంబుకై
చీటికి మాటికి న్మిగులఁ జేతులు చాఁతురు దానిఁబట్టి చె
ల్లాట లొనర్ప హస్తకటకాభరణంబులు గల్లు గల్లనన్. 6

క॥ నాకాహిపులకుఁ దక్కను - బ్రాకార శ్రేణిపొడవు పరిఖల లోఁతున్
సాకల్యంబుగ నింతని - వాక్రువ్వఁగ నన్యులకును వశ మనఁ దగునే. 7

ఉ॥ అందఱు సత్యవర్తనులె యందఱు మేరు సమానధీరులే
యందఱు వైభవోన్నతులె యందఱు సత్కరుణాంతరంగులే
యందఱు దీనరక్షకులె యందఱు దానగుణప్రవిష్టులే
యందఱుఁ గీర్తిశోభితులె యందఱు ధన్యులె తత్పురంబునన్. 8

క॥ ఆ రాజధాని తనకు స - దా రమ్యనివాస మగుచుఁ దనరఁగ నేలుం
గారుణ్యాంబుధి విలస - ద్భూరియశోనిధి సలోమభూవరుఁ డెలమిన్. 9

---

4. మెల్లగా సాయంకాల వేళలయందు రాజవీథులను చూడగా ఆ పట్టణములో; ముఖబృంహిత గర్జలు=ముఖమునుండి బైలుదేరిన ఘీంకారములనెడు ఉఱుములును; దంత కాంతి విద్యుత్ లతికా ప్రకాశములు=దంతముల కాంతులనెడు మెఱుపు తీగలయొక్క ప్రకాశమును; సముత్కట దాన వృష్టి=మిక్కుటమైన మదమనెడు వర్షము; రంజిల్లగా; వసుంధరా గగనసీమ=భూమి యనెడు ఆకాశముమీద; మదద్విప నీలమేఘముల్=మదపుటేనుగులనెడు నల్లని మబ్బులు; పెల్లుగ=మిక్కిలి సంచరించును.

5. ఆ పట్టణములో గుఱ్ఱముల వేగమును జెప్పగ మనసునకు నలవి చెందదు (=మనసుకంటె వేగము గనుక) పవన విశిఖ వేగము=గాలి బాణముయొక్క వేగము చెప్ప నేమిటికి (ప్రయోజనములేదు.)

6. హాటక రత్న శోభితములు=బంగారు రత్నములు వీనితో నలంకరింపబడిన; సౌధవీథులన్=మేడల బారులతో; పాటల గంధులు=స్త్రీలు; హిమభానునిలో మృగశాబకంబుకై=చంద్రునిలో నున్న లేడిపిల్లను పట్టి; చెల్లాటలు=విహారములు నొనర్చుటకు; చీటికి మాటికి మిక్కిలి చేతులు చాతురు; ఆభరణంబులు=చేతులయందలి కడియములు మొదలగు నగలు గల్లుగల్లుమనగా.

7. ప్రాకార శ్రేణి పొడవు=చుట్టుగోడల సమూహముయొక్క యెత్తును; పరిఖల=అగడితల లోతును; సాకల్యముగా=వాక్రువ్వగా పూర్తిగా నింతని; చెప్ప; నాక అహిపులకు=స్వర్గములోని వారలకును పాతాళములోని వారలకును తప్ప ఇతరులకు వశమగునా? అనగ గోడలు ఆకాశమంత పొడుగున్నవి; అగడితలు పాతాళముదాక లోతు గలవి.

8. మేరు సమాన ధీరులు=మేరువను బంగారు కొండతో సమానమైన ధైర్యము కలవారు; వైభవ ఉన్నతులు=ప్రభుత్వముచేత గొప్పవారు; దీన రక్షకులు=బీదలను రక్షించువారు; దానగుణ ప్రవిష్టులే=దానము చేయుట యను పనిలో ప్రవేశించినవారె (అందఱును దాతలే.)

9. రాజధాని=ఆ పట్టణము; తనకు రమ్యనివాసము=తగ్గిన యునికిపట్టుగా నుండగా; కారుణ్య అంబునిధి=దయ సముద్రమువంటివాడును; విలసత్ భూరి యశోనిధి=ప్రసిద్ధమైన గొప్ప కీర్తికి స్థానమయిన

సీ॥ త్రవ్వించె నేరాజు విమల జలాపూర్ణ - కలన రంజిలు తటాకములు గొన్ని,
త్రవ్వించె నేరాజు తతరత్న సోపాన - కీలితంబైన దీర్ఘికలు గొన్ని,
కట్టించె నేరాజు ఘన సత్రశాలలు - వివిధ వస్తు సమృద్ధి వెలయఁ గొన్ని,
నిర్మించె నేరాజు నిత్యఫల ప్రదా - యకములౌ వృక్షవాటికలు గొన్ని, 10
తే॥ కొట్టె నేరాజు వినుతులఁ గుతిలపడఁగఁ - గాచె నేరాజు శరణొంది కలియుపతుల
నతఁడుకళ్యాణగుణగణాన్వితుఁడుఘనుఁడు - పుణ్యధనుఁడుసలోమాఖ్యభూమివిభుఁడు.
సీ॥ ఏ రాజు నిత్య కళారమ్య విభవంబు - రాకామృగాంకు నిరాకరించు,
నేమహీపతి ధైర్యసామగ్రి మేరుమం - దరతుషారాద్రులఁ దిరస్కరించు
నేధరణీతలనాథు గాంభీర్యంబు - జలనిధి గర్వంబు సడలువఱుచు
నేపుణ్యమూర్తి ప్రతాప తపస్ఫూర్తి - దినకర చ్ఛాయల తేజ మణఁచు
తే॥ నతఁడు వొగడొందు జగతిలో హారహీర - కుందమందార కర్పూర చందనేందు
సింహసురదంతి కైలాస శేషతుల్య - చారుకీర్తి సలోమాఖ్య చక్రవర్తి. 11
సీ॥ సత్యవేదోక్త భాస్వద్వర్తనమె కాని - యాచరింపఁగ నొల్లఁ డన్యవిధుల
సత్యశాస్త్రేతిహాస ప్రసంగమె కాని - యాలకింపఁగ నొల్లఁ డన్యకథల
సత్యాగమజ్ఞులౌ జనులతోడనె కాని - భాషింప నొల్లఁడు పరులతోడ
సత్యదైవంబైన సర్వేశునే కాని - కొలువఁడు పరదైవముల భజించి,
తే॥ యినుఁడు పశ్చిమగిరి నుదయించెనేని - యద్రి సంఘంబు తల్లక్రిందయ్యెనేని 12
మఱియుఁ గలలోననైనను మఱచియైనఁ - బలుకఁ డనృతంబు నమ్మహీపాలకుండు.

---

**10.** ఏ రాజు=సలోముడు; విమల జల ఆపూర్ణ కలన=తేటయైన నీళ్లచే నిండిన కారణమున, రంజిల్లు తటాకములు=ఒప్పుచున్న చెఱువుల; తతరత్న సోపాన కీలితంబైన దీర్ఘికల=విశాలమైన రత్నములు గల మెట్లతో కట్టబడిన దిగుడుబావుల; వివిధ వస్తు సమృద్ధి వెలయ=అనేక విధములయిన వస్తువులచేత నిండిన ఘన సత్రశాలలు; నిత్యఫల ప్రదాయకములౌ వృక్షవాటికలు=ఎల్లప్పుడును పండ్ల నిచ్చు తోటలు; వినుతులు కుతిలపడగన్=శత్రువులు బాధపడునట్లు కొట్టెను; శరణొంది కలియు పతులన్=రక్షింపుమని వచ్చిన ప్రభువులను కాచెను; కళ్యాణ గుణ గణ అన్వితుడు=మంగళకర గుణములతో గూడినవాడు.

**11.** నిత్య కళా గమ్య విభవంబు=సలోముని ఎడతెగని కాంతియొక్క చక్కని గొప్పతనము; రాకా మృగాంకుని నిరాకరించును=నిండు పున్నమనాటి చంద్రుని లక్ష్యము చేయదు; ఏ మహీపతి=రాజుయొక్క; ధైర్యసామగ్రి=పరాక్రమముయొక్క పరిపూర్ణత; మేరు మందర తుషారాద్రులన్=మేరు అను పర్వతము కవ్వపుగొండ హిమవత్పర్వతము వీనిని; తిరస్కరించున్=బెదరించును; ఏ ధరణీతలనాథుని=ఏ భూపాలునియొక్క గాంభీర్యము సముద్రముయొక్క గర్వమును; సడలు వఱుచున్=వదలజేయును. ఏ పుణ్యమూర్తి=ఏ పుణ్యాత్మునియొక్క; ప్రతాప తప స్ఫూర్తి=తేజమనెడు వేసవి కాలముయొక్క అతిశయము; దినకరచ్ఛాయల=సూర్యుని కాంతులను; తేజమణచున్=తగ్గించును; హార హీర కుంద మందార కర్పూర చందన ఇందు సింహ సురదంతి కైలాస శేష తుల్య చారు కీర్తి=ముత్తెములహారము వజ్రము మల్లెపువ్వు కల్పవృక్షము కప్పురము మంచి గంధము చంద్రుడు సింహము తెల్లయేనుగు వెండికొండ ఆదిశేషుడు, వీరితో తుల్యమైన సుందర యశస్సు కలవాడు పొగడు ఒందును.

**12.** సత్యవేదోక్త భాస్వద్వర్తనమె కాని=సత్యవేదములో జెప్పబడిన మంచి నడవడినే కాని; అన్యవిధుల ఆచరింపడు=ఇతర వర్తనమును చేయడు; సత్యశాస్త్రేతిహాస ప్రసంగమె కాని=సత్యవేద శాస్త్రములలో జెప్పబడిన ప్రసంగములనె కాని అన్య కథలను ఆలకింపడు; సత్యాగమజ్ఞులు=సత్యవేదము జదివిన వారితోనె కాని పరులతో భాషింపడు; ఇనుడు పశ్చిమగిరిన్=సూర్యుడు పడమటి కొండమీద

చ॥ కుటిల విరోధి యూథములఁ గొట్టి నిజాజ్ఞల నిల్పుచున్ సమ
త్కటగతి వారిచేత నరికప్పము లందుచు మాఱులేక వి
స్ఫుటముగ నేలె నిద్ధరణి భూరి పరాక్రమ శక్తి నెంతయుం
బటుతర ధర్మమార్గమున భాసురలీల యశోవిశాలుఁడై. 13

ఉ॥ ఈ సరణిన్ సలోమ ధరణీంద్రుఁడు గూర్చిన ద్రవ్య మెంతయున్
భాసుర దుర్గరక్షణకు బంధుజనాళికి నర్థికోటికిన్
గ్రాసము క్రిందఁ జెల్లుటయుఁ గా కటు నిల్చుట లెక్క సేయుచో
రాసులె కాక నిష్కములు రత్నము లిన్నని వ్రాయఁగూడునే. 14

సీ॥ మదిలోన ధర్మ మేమఱక సలోమభూకాంతుండు ధరణి సత్కరుణ నేలు
తఱిఁ దగు వానలు గురిసి సస్యాదులుదీర్చి పండును తెప్ప తెప్పలుగను
గవిసంచయములు చన్నవిసి ముప్ప్రొద్దును-బిదుకుఁ గాఁగులు నిండి పిక్కటిలఁగ
ధనకనకాంబర ఘనవస్తువాహన- మణిభూషణముల సమస్త జనులు 15

తే॥ సుఖవసతిఁ జెంది నెల మూఁడు శోభనములు-సేయుచును సత్యవేద సంశీలనియతి
నొక్క సర్వేశ్వరుని నమ్మి యుల్లమలరఁ-గాంతు రిహపర సౌఖ్యవిఖ్యాతి ఘనత.

క॥ తల్లియును దండ్రియునునై-యల్లనఁ బోషించుఁ బ్రజల నర్థుల కెల్లం
గొల్లలుగ ధనము లొసఁగుం-గల్లలు విన నొల్లఁ డెపుడుఁ గలలో నైనన్. 16

వ॥ ఇట్లు ప్రజాపరిపాలనంబు సేయుచుండి యొక్కనాఁ డమ్మహీవల్లభుం డుల్లంబున నుల్లాసంబు మల్లడిగొన; నల్లనల్లన నరిదుర్గమం బగు నిజదుర్గం బఖిలంబును బరీక్షించి నిరీక్షింప నపేక్షించి, సచివసామంతసుహృద్బంధు సేనాధీశ్వర పరివారకా

13. కుటిల విరోధి యూథములన్=వంకర నడతలుగల శత్రువుల సమూహమును గొట్టి; నిజాజ్ఞల=తన యధికారమును నిల్పుచు; సముత్కటగతిన్=మిగుల కఠినముగా; వారిచేత=కొట్టిన శత్రువులయొద్ద నుండి; అరికప్పములు అందుచును=పన్నులు పుచ్చుకొనుచు; మాఱులేక=తనకెవ్వరు సమానులు లేకుండ; విస్ఫుటముగన్=తేటగా; భూరిపరాక్రమ శక్తిన్=గొప్ప సాహసముయొక్క బలముచేత (పరాక్రమము; పర=ఇతరులను, ఆక్రమము=తన వశము చేసికొని యాక్రమించుట.) పటుతర ధర్మమార్గమున=బలమైన న్యాయవిధానముతో యశోవిశాలుడై=తన కీర్తి యెల్లయెడల వ్యాపించునట్లు ఈ ధరణిని ఏలెను.

14. ఈ సరణిన్=ఈ రీతి న్యాయమార్గమున; కూర్చిన=కూడబెట్టిన ధనము; భాసుర దుర్గరక్షణకున్=ప్రకాశమానమగు దుర్గములను కాపాడుటకు; బంధుజన ఆళికిన్=చుట్టముల సమూహమునకు; అర్థికోటికిన్=యాచకులకు; గ్రాసము క్రింద=భోజనమునకు చెల్లుటగాక మిగిలినది లెక్క చేయునెడల రాసుల గాక; నిష్కములు=నాణెములను రత్నములను వ్రాయగూడునా?

15. సలోముడు ధర్మము ఏమఱక=పుణ్యము మఱచిపోక; సత్కరుణన్=మిక్కిలి దయతో నేలు సమయమున; సస్య ఆదులు తీర్చి=ధాన్యములు మొదలైనవి చక్కనయి; తెప్పతెప్పలుగన్=విస్తారముగా పండును; గవి సంచయములు చన్ను అవిసి=ఆవులమందలు చనుకట్టుట తమంత విడి; ముప్ప్రొద్దును పిదుకన్=మూడు వేళలను పాలు పిండుచు; ధన కనక అంబర ఘనవస్తు వాహన మణి భూషణములు=ద్రవ్యము బంగారు వస్త్రములు గొప్ప వస్తువులు గుఱ్ఱములు పల్లకులు మొ॥ మణులతో గూర్చిన నగలు వీనిలో; జనులు సుఖవసతి జెంది=సౌఖ్యమైన కాపురములు గలిగి; నెలకు మూడు శోభనములు=పెండ్లి మొదలగునవి మూడు శుభకార్యములు చేయుచు; సత్యవేద సంశీలనియతిన్=సత్యవేదప్రకారముగా నాచారమున మెలగుచు; ఇహ పర సౌఖ్య విఖ్యాతి=ఈ లోకములోని పరలోకములోని సుఖ ప్రసిద్ధి; కాంతురు=పొందుదురు.

ద్యుచితజనపరివృతుండై; సుధాధవళంబులైన దుగ్ధంబులతో మేళవించిన మెత్తని క్రొత్తసున్నంబు గుత్తంబుగా సంకుచమరి చిత్తరించిన కొత్తడంబుల మొత్తంబులను; బహువిధసుగంధబంధురకుసుమాలంకృతంబులుం బరిపక్వమధురఫలాకీర్ణంబులుం బరభృతశుకశారికానికరకలకలారావంబులుం గలిగిన యుద్యానంబులును; విలసత్కనకారవిందనిష్యందమకరందబిందుసందోహతుందిలప్రమోదభరితాంతరంగరంగద్భృంగసంగీతరవంబులం బరస్పరాభివర్ధితకల్లోలమాలికాడోలికావిహరణక్రమాహ్లాదితచక్రవాకంబులం బ్రకాశించు కాసారంబులను; భర్మనిర్మితసోపానసమన్వితంబులగు దీర్ఘికలను; గక్ష్యాంతరంబులుం గేళీసౌధంబులుం గొలువుకూటంబులు వాజిశాలలు నృత్యస్థలంబులు విద్యామండపంబులుం బాకగృహంబులు భోజనమందిరంబులుం గనుంగొనుచుం జని చని బహుజనరక్షితంబును సకృత్ప్రవేశయోగ్యంబునగు ధనాగారంబు సేరం జని బలవత్కవాటోత్పాటనంబు సేయం బనిచి యందుఁ బ్రవేశించి యొక్క పరిచారకునిచే సమర్పింపంబడిన మణిమయపీఠంబునం గూర్చుండి యుచితాసనంబులం దగువారలం గూర్చుండ నియమించి యందు రాశీకృతంబులై యాత్మీయకనిష్ఠికాభరణముద్రాముద్రితంబులైన నాణియంబులచే దేదీప్యమానంబై తేజరిల్లు భండారం బంతయుం జూచి తల యూఁచి మంత్రి నుద్దేశించి యిట్లనియె. 17

17. మల్లడిగొన=అనందము పెనగొనగా; అరిదుర్గమము అగు నిజదుర్గము అఖిలంబును=విరోధులకు ప్రవేశింపరాని తన కోటయంతయు; పరీక్షించి నిరీక్షింప అపేక్షించి=కనుగొని చూచుటకు కోరి; సచివ సామంత సుహృత్ బంధు సేనాధీశ్వర పరిచారక ఆది ఉచితజన పరివృతుండై=మంత్రులు తన చేతిక్రింది రాజులు స్నేహితులు చుట్టములు సేనానాయకులు సేవకులు మొదలగు తగిన జనులతో కూడుకొనినవాడై; సుధ ధవళంబులైన దుగ్ధంబులతో మేళవించిన=అమృతమువలె తెల్లనివియగు పాలతో కలిసిన; క్రొత్త సున్నము; గుత్తంబుగా సంకుచమరి=గట్టిగా శంఖములతో మెరుగుపెట్టి; చిత్తరించిన కొత్తడంబుల మొత్తంబును=చిత్రములు వ్రాసిన కోట బురుజుల సమూహమును; బహు విధ సుగంధ బంధుర కుసుమ అలంకృతంబులు=అనేక విధములైన పరిమళముతోగూడిన పువ్వుల అలంకారములు; పరిపక్వ మధుర ఫల ఆకీర్ణంబులు=బాగుగా పండి రుచిగల పండ్లసమూహము; పరభృత శుక శారిక నికర కలకలారావంబులు=కోయిలలు చిలుకలు గోరువంకలు వీని మందయొక్క కలకలమనెడు ఇంపైన ధ్వనులు కలిగిన; ఉద్యానంబులను=ఇండ్ల వెనుక నుండు తోటలను; విలసత్ కనకారవింద విష్యంద మకరందబిందు సందోహ తుందిల ప్రమోదభరిత అంతరంగ రంగద్భృంగ సంగీతరవంబులం=విడిన బంగారు తామరలనుండి జారిన పూతేనెబొట్ల సమూహముచేత బలసినవైన సంతోష భారముగల హృదయములతోడి నృత్యము చేయు తుమ్మెదలయొక్క సంగీత ధ్వనులచేతను; పరస్పర అభివర్ధిత కల్లోలమాలికా డోలిక విహరణక్రమ ఆహ్లాదిత చక్రవాకంబులం=ఒకదానిచే నొకటి వృద్ధిచేయబడిన అలలబారులు అనెడు ఉయ్యేలయందు విహరించు విధముచేత్త సంతోషము నొందు చక్రవాకములచేతను; ప్రకాశించెడు కాసారంబులను=కొలకులను; భర్మనిర్మిత సోపాన సమన్వితంబులగు దీర్ఘికలును=బంగారముతో చేయబడిన మెట్లతో కూడినవగు దిగుడు బావులను; కక్ష్యాంతరములు=బంతుల వరుసలు; కేళీసౌధములు=ఆడుకొనుటకై కట్టించిన మేడలు; వాజిశాలలు=గుఱ్ఱపులాయములు; వీనినన్ని సలోముడు కనుగొనుచు చనగా; బహు జన రక్షితంబును సకృత్ప్రవేశయోగ్యంబు నగు ధనాగారంబు నేరం జని=అనేక జనులచే కాపాడబడి పలువురులోన ప్రవేశించుటకు వీలులేని ధనపుకొట్టు చూచుటకు పోయి; బలవత్ కవాట ఉత్పాటనంబు సేయ బనిచి=బలవంతమైన తలుపు తెరచుటకు సెలవిచ్చి; ప్రవేశించి; మణిమయ పీఠంబునం=మణులతో చేయబడిన పీటమీద కూర్చుండి; యుచిత ఆసనంబులం దగు వారలం=వారివారికి తగిన పీఠములమీద కూర్చుండ సెలవిచ్చి; రాశీకృతంబులై యాత్మీయ కనిష్ఠికాభరణ ముద్రాముద్రితంబులైన నాణియంబుచే=ప్రోగులుగా పోయబడి తనయొక్క చిటికెనవ్రేలి యుం

క॥ మన భుజబలమునఁ గాంచిన - ధనమేకద, యింతవట్టుఁ దడయక దీనిన్
వినియోగము చేయక యిం - దునిచిన ఫలమేమి గల్గు నూహ యొనర్పన్. 18

ఉ॥ భండనభూమి శాత్రవులఁ బాఱఁగఁ ద్రోలి ధరిత్రియెల్ల న
ద్దండత నాక్రమించి భుజదర్పము పెంపునఁ గన్న యిద్ధనం
బుండఁగ నేటి కీకరణి నూరక యిచ్చట నిత్యచిత్ప్రకా
శుం డగు నాదిదేవునకుఁ జొప్పడు సద్వ్యయ మెద్ది పల్కుమా. 19

చ॥ అనవుడు మంత్రి పల్కె వినయంబున, నో జనపాలచంద్ర, మీ
రనఘులు సత్యసంధులు మహాత్ములు ధన్యులు నిత్యధర్మవ
ర్తను లిఁక నేమిటం గొఱఁత, రాజులు మూలధనంబు గొల్ల వ
చ్చిన పలుకెన్నఁడు న్వినము, చిత్తములో నిటు దల్పఁ గూడునే. 20

క॥ తమ రనుభవింపకుండినఁ - బ్రమదంబుగఁ బుత్త్రపౌత్త్ర పారంపర్యాం
తముగా నిల్చు, నొకానొక - సమయంబున ధనము గల్గ జయ మొనగూడున్. 21

క॥ అనుటయు విని యచ్చటఁ గల - తన పరిజనమెల్ల వినఁగ, ధరణీశ్వరుఁ డ
ల్లనఁ బల్కె మోముఁ దమ్మిం - దనరెడు చిఱునగవు సొంపు దళుకొత్తంగన్. 22

క॥ ఎక్కడి పుత్త్రులు పౌత్త్రకు - లెక్కడి ధన మెవరి కలుము లెవ్వరి తరుణుల్
నిక్క మనుచు నిమ్మాయం - జిక్కుదురే తెలివి గలుగు శిష్టులు జగతిన్. 23

ఉ॥ కాయము లంబుబుద్బుదనికాయము లింద్రియ సౌఖ్యవర్తనల్
మాయలు వీని నమ్మికొని మానవుఁ డెట్లు తరించు వేగమే

---

18. గాంచిన=పొందిన; ఇంతవట్టు=ఇదియంతయు; ఇందునిచిన=ఇక్కడ ఉంచినయెడల; ఊహ యొనర్పన్=ఆలోచించి చూడగా.

19. భండన=యుద్ధభూమిలో శత్రువులను పాఱ తోలి ధరిత్రియంతయు; ఉద్దండత=పరాక్రమముతో ఆక్రమించి; భుజదర్పము పెంపున=నా భుజముయొక్క బలముచేత; కన్న=సంపాదించిన యీ ధనము ఉండగా, నెందుకు ఈ విధముగా ఊరక ఇక్కడ (ఉన్నది); నిత్య చిత్ ప్రకాశుడు=నిత్య తెలివిచేత ప్రకాశించుచున్న యాదిదేవునికి; చొప్పడు సద్వ్యయము=ఉపయోగించిన మంచి వ్యయముకన్న ఏదైన గలదా, చెప్పుము.

20. అనినప్పుడు మంత్రి చెప్పెను: ఓ రాజోత్తమా, మీరు అనఘులు=పుణ్యాత్ములు; సత్యసంధులు=అబద్ధమాడనివారు; నిత్యధర్మవర్తనులు=నిత్యన్యాయమార్గమున నడచువారు; మీకు నేమి తక్కువలేదు, రాజులు మూలధనము సెలవు చేసినారను మాట యెన్నడు వినలేదు, మీ మనస్సులో నీ విధముగా తలపవద్దు.

21. తమరు అనుభవింపక పోవునెడల సంతోషముగ; పుత్త్ర పౌత్త్ర పారంపర్య అంతముగాన్=కుమారులు వారి కుమారులు వీరియొక్క పరంపరకు, చివరవఱకు నిల్చియుండును; ఒకానొక సమయమున; ఈ ధనము గల్గన్=ధనమున్న యెడల; మనకే విజయము కలుగవచ్చును.

22. అనినప్పుడు పరిజనము=చుట్టునున్న పనివారలు వినగా; మోము దమ్మిన్=తమ్మివంటి మోమున; చిఱునగవు సొంపు=మందహాసపు సౌందర్యము; తళుకొత్తంగన్=మెఱయుచుండగా సలోముడు పల్కెను:

23. కొడుకు లనువారెవ్వరు; మనుమ లనువారెవ్వరు; ఈ సొమ్మెక్కడినుండి వచ్చినది; ఈ సంపద లెవ్వరివి; భార్యలనగా నెవ్వరు; నిక్కమనుచున్=పైన చెప్పబడినవారందఱును నిజమైనవారని అనుచు; ఈ మాయం జిక్కుదురే=ఈ ప్రపంచపు మాయలలో; తెలివిగల శిష్టులు=పెద్దలు చిక్కుకొందురా.

24. కాయములు అంబు బుద్బుద నికాయము=శరీరములు నీటి బుగ్గల సమూహమువంటివి; ఇంద్రియసౌఖ్యవర్తనల్ మాయలు=పంచేంద్రియములయొక్క సుఖములలో దిరుగుటలు స్థిరమైనవి కావు; దివ్య

ద్యుచితజనపరివృతుండై; సుధాధవళంబులైన దుగ్ధంబులతో మేళవించిన మెత్తని క్రొత్తసున్నంబు గుత్తంబుగా సంకుచమరి చిత్తరించిన కొత్తడంబుల మొత్తంబులను; బహువిధసుగంధబంధురకుసుమాలంకృతంబులుం బరిపక్వమధురఫలాకీర్ణంబులుం బరభృతశుకశారికానికరకలకలారావంబులుం గలిగిన యుద్యానంబులును; విలసత్కనకారవింద నిష్యందమకరందబిందుసందోహతుందిలప్రమోదభరితాంతరంగరంగద్భృంగసంగీతరవంబులం బరస్పరాభివర్ధితకల్లోలమాలికాడోలికావిహారణక్రమాహ్లాదితచక్రవాకంబులం బ్రకాశించు కాసారంబులను; భర్మనిర్మితసోపానసమన్వితంబులగు దీర్ఘికలను; కక్ష్యాంతరంబులుం గేళీసౌధంబులుం గొలువుకూటంబులు వాజిశాలలు నృత్యస్థలంబులు విద్యామండపంబులుం బాకగృహంబులు భోజనమందిరంబులుం గనుంగొనుచుం జని చని బహుజనరక్షితంబును సకృత్ప్రవేశయోగ్యంబునగు ధనాగారంబు చేరం జని బలవత్కవాటోత్పాటనంబు సేయం బనిచి యందుఁ బ్రవేశించి యొక్క పరిచారకునిచే సర్పింపంబడిన మణిమయపీఠంబునం గూర్చుండి యుచితాసనంబులం దగువారలఁ గూర్చుండ నియమించి యందు రాశీకృతంబులై యాత్మీయకనిష్ఠికాభరణముద్రాముద్రితంబులైన నాణియంబులచే దేదీప్యమానంబై తేజరిల్లు భండారం బంతయుం జూచి తల యూఁచి మంత్రి నుద్దేశించి యిట్లనియె. 17

17. మల్లడిగొన=ఆనందము పెనకొనగా; అరిదుర్గమము అగు నిజదుర్గము అఖిలంబును=విరోధులకు ప్రవేశింపరాని తన కోటయంతయు; పరీక్షించి నిరీక్షింప అపేక్షించి=కనుగొని చూచుటకు కోరి; సచివ సామంత సుహృత్ బంధు సేనాధీశ్వర పరిచారక ఆది ఉచితజన పరివృతుండై=మంత్రులు తన చేతిక్రింది రాజులు స్నేహితులు చుట్టములు సేనానాయకులు సేవకులు మొదలగు తగిన జనులతో కూడుకొనినవాడై; సుధ ధవళంబులైన దుగ్ధంబులతో మేళవించిన=అమృతమువలె తెల్లనివియగు పాలతో కలిసిన; క్రొత్త సున్నము; గుత్తంబుగా సంకుచమరి=గట్టిగా శంఖములతో మెరుగుపెట్టి; చిత్తరించిన కొత్తడంబుల మొత్తంబును=చిత్రములు వ్రాసిన కోట బురుజుల సమూహమును; బహు విధ సుగంధ బంధుర కుసుమ అలంకృతంబులు=అనేక విధములైన పరిమళముతోగూడిన పువ్వుల అలంకారములు; పరిపక్వ మధుర ఫల ఆకీర్ణంబులు=బాగుగా పండి రుచిగల పండ్లసమూహము; పరభృత శుక శారిక నికర కలకలారావంబులు=కోయిలలు చిలుకలు గోరువంకలు వీని మందయొక్క కలకలమనెడు ఇంపైన ధ్వనులు కలిగిన; ఉద్యానంబులను=ఇండ్ల వెనుక నుండు తోటలను; విలసత్ కనకారవింద నిష్యంద మకరందబిందు సందోహ తుందిల ప్రమోదభరిత అంతరంగ రంగద్భృంగ సంగీతరవంబులం=విడిన బంగారు తామరలనుండి జారిన పూతేనెబొట్ల సమూహముచేత బలసినవైన సంతోష భారముగల హృదయములతోడి నృత్యము చేయు తుమ్మెదలయొక్క సంగీత ధ్వనులచేతను; పరస్పర అభివర్ధిత కల్లోలమాలికా డోలిక విహారణక్రమ ఆహ్లాదిత చక్రవాకంబులం=ఒకదానిచే నొకటి వృద్ధిచేయబడిన అలలబారులు అనెడు ఉయ్యాలయందు విహరించు విధముచేత సంతోషము నొందు చక్రవాకములచేతను; ప్రకాశించెడు కాసారంబులను=కొలకులను; భర్మనిర్మిత సోపాన సమన్వితంబులగు దీర్ఘికలను=బంగారముతో చేయబడిన మెట్లతో కూడినవగు దిగెడు బావులను; కక్ష్యాంతరములు=బంతుల వరుసలు; కేళీసౌధములు=ఆడుకొనుటకై కట్టించిన మేడలు; వాజిశాలలు=గుఱ్ఱపులాయములు; వీనినన్ని సలోముందు కనుగొనుచు చనగా; బహు జన రక్షితంబును సకృత్ప్రవేశయోగ్యంబు నగు ధనాగారంబు చేరం జని=అనేక జనులచే కాపాడబడి పలువురులోన ప్రవేశించుటకు వీలులేని ధనపుకొట్టు చూచుటకు పోయి; బలవత్ కవాట ఉత్పాటనంబు సేయ బనిచి=బలవంతమైన తలుపు తెరచుటకు సెలవిచ్చి; ప్రవేశించి; మణిమయ పీఠంబునం=మణులతో చేయబడిన పీటమీద కూర్చుండి; యుచిత ఆసనంబులం దగు వారల=వారివారికి తగిన పీఠములమీద కూర్చుండ సెలవిచ్చి; రాశీకృతంబులై యాత్మీయ కనిష్ఠికాభరణ ముద్రాముద్రితంబులైన నాణియంబుచే=ప్రోగులుగా పోయబడి తనయొక్క చిటికెనవ్రేలి యుంగరముతో ముద్రవేయబడిన రొక్కముచేత; దేదీప్యమానంబై భండారము= మిక్కిలి వెలుగు బొక్కసము.

క॥ మన భుజబలమునఁ గాంచిన - ధనమేకద, యింతవట్టుఁ దడయక దీనిన్
వినియోగము చేయక యిం - దునిచిన ఫలమేమి గల్గు నూహ యొనర్పన్. 18

ఉ॥ భండనభూమి శాత్రవులఁ బాఱఁగఁ ద్రోలి ధరిత్రియెల్ల న
ద్దండత నాక్రమించి భుజదర్పము పెంపునఁ గన్న యిద్ధనం
బుండఁగ నేటికీకరణి నూరక యిచ్చట నిత్య చిత్ప్రకా
శుం డగు నాదిదేవునకుఁ జొప్పడు సద్వ్యయ మెద్ది పల్కుమా. 19

చ॥ అనవుడు మంత్రి వల్కె నినయంబున, నో జనపాలచంద్ర, మీ
రనఘులు సత్యసంధులు మహాత్ములు ధన్యులు నిత్యధర్మవ
ర్తను లిఁక నేమిటం గొఱఁతె, రాజులు మూలధనంబు గొల్ల వు
చ్చిన పలుకెన్నఁడు న్వినము, చిత్తములో నిటు దల్ప గూడునే. 20

క॥ తమ రనుభవింపకుండినఁ - బ్రమదంబుగఁ బుత్త్రిపౌత్త్రి పారంపర్యాం
తముగా నిల్చు, నొకానొక - సమయంబున ధనము గల్గ జయ మొనగూడున్. 21

క॥ అనుటయు విని యచ్చటఁ గల - తన పరిజనమెల్ల వినఁగ, ధరణీశ్వరుఁ డ
ల్లనఁ బల్కె మోముఁ దమ్మిం - దనరెడు చిఱునగవు సొంపు దళుకొత్తంగన్. 22

క॥ ఎక్కడి పుత్త్రులు పౌత్త్రకు - లెక్కడి ధన మెవరి కలుము లెవ్వరి తరుణుల్
నిక్క మనుచు నిమ్మాయం - జిక్కుదురే తెలివి గలుగు శిష్టులు జగతిన్. 23

ఉ॥ కాయము లంబుబుద్బుదనికాయము లింద్రియ సౌఖ్యవర్తనల్
మాయలు వీని నమ్మకొని మానవుఁ డెట్లు తరించు వేగమే

18. గాంచిన=పొందిన; ఇంతవట్టు=ఇటియంతయు; ఇందునిచిన=ఇక్కడ ఉంచినయెడల; ఊహ యొనర్ప=ఆలోచించి చూడగా.

19. భండన=యుద్ధభూమిలో శత్రువులను పాఱ తరిమి ధరిత్రియంతయు; ఉద్దండత=పరాక్రమముతో ఆక్రమించి; భుజదర్పము పెంపున=నా భుజముయొక్క బలముచేత; కన్న=సంపాదించిన యీ ధనము ఉండగా, నెందుకు ఈ విధముగా ఊరక ఇక్కడ (ఉన్నది); నిత్య చిత్ ప్రకాశుడు=నిత్య తెలివిచేత ప్రకాశించుచున్న యాదిదేవునికి; చొప్పడు సద్వ్యయము=ఉపయోగించిన మంచి వ్యయముకన్న ఏదైన గలదా, చెప్పుము.

20. అనినప్పుడు మంత్రి చెప్పెను: ఓ రాజోత్తమా, మీరు అనఘులు=పుణ్యాత్ములు; సత్యసంధులు=అబద్ధమాడనివారు; నిత్యధర్మవర్తనులు=నిత్యన్యాయమార్గమున నడచువారు; మీకు నేమి తక్కువలేదు, రాజులు మూలధనము సెలవు చేసినారను మాట యెన్నడు వినలేదు, మీ మనస్సులో నీ విధముగా తలపవద్దు.

21. తమరు అనుభవింపక పోవునెడల సంతోషముగ; పుత్త్రి పౌత్త్రి పారంపర్య అంతముగాన్=కుమారులు వారి కుమారులు వీరియొక్క పరంపరకు, చివరవఱకు నిల్చియుండును; ఒకానొక సమయమున; ఈ ధనము గల్గన్=ధనమున్నయెడల; మనకే విజయము కలుగవచ్చును.

22. అనినప్పుడు పరిజనము=చుట్టునున్న పనివారలు వినగా; మోము దమ్మిన్=తమ్మివంటి మోమున; చిఱునగవు సొంపు=మందహాసపు సౌందర్యము; తళుకొత్తంగన్=మెఱయుచుండగా సలోముడు పల్కెను:

23. కొడుకు లనువారెవ్వరు; మనుమ లనువారెవ్వరు; ఈ సొమ్మెక్కడినుండి వచ్చినది; ఈ సంపద లెవ్వరివి; భార్యలనగా నెవ్వరు; నిక్కమనుచున్=పైన చెప్పబడినవారందఱును నిజమైనవారని అనుచు; ఈ మాయం జిక్కుదురే=ఈ ప్రపంచపు మాయలలో; తెలివిగల శిష్టులు=పెద్దలు చిక్కికొందురా.

24. కాయములు అంబు బుద్బుద నికాయము=శరీరములు నీటి బుగ్గల సమూహమువంటివి; ఇంద్రియసౌఖ్యవర్తనల్ మాయలు=పంచేంద్రియములయొక్క సుఖములలో దిరుగుటలు స్థిరమైనవి కావు; దివ్యకటాక్షముం జెంది=యోగ్యమైన దయను సంపాదించి; ముక్తి సంధాయకమైన కృత్యములు=మోక్షమును స

శ్రీయుతుండైన సద్గురుని దివ్య కటాక్షముఁ జెంది ముక్తిసం
ధాయకమైన కృత్యములు తత్పరబుద్ధి నొనర్పకుండినన్. 24

క॥ పనివారలఁ బంపించెద - నని చెప్ప సదనంబుఁ గట్ట నఖిలేశునకున్
ఘనరత్న శోభితముగా - ననుమానము లేదు నిశ్చయం బని వేగన్. 25

చ॥ అలఘు విశేష తత్పరత నప్పుడ శిల్పకళాప్రవీణులన్
పిలువఁగఁ బంపి వారలను ప్రేమ ధనాఢ్యులఁ జేసి వేడ్కతో
వెలిగెడు జేరుసల్యమునఁ బంపుగఁ గట్టఁగ నాజ్ఞ చేసెఁ దా
నెలకొని యాదిదేవున కనిందిత రమ్య మనోజ్ఞ కోవెలన్. 26

సీ॥ భర్మ నిర్మిత మణిప్రభల రంజిలునట్టి - ప్రాకారములు ముఖభద్రములును
లీలాగృహము లాంతరాళికములును గ - ర్భాగారములును కక్ష్యాంతరములు
కొలువుకూటంబులు గోపురములును క - ళ్యాణమండపములు నంతరాంత
రప్రదక్షిణ విధి క్రమ యుక్త మార్గముల్ - బహువిధ నైవేద్య పాక యోగ్య
తే॥ మందిరంబులతో నతి సుందరములు - గాఁగ శిల్పకళాప్రౌఢి గడలుకొనఁగ
నరగఁ గట్టిరి తిరు జేరుసల్యమందు - గోవెల నఖిలేశ్వరునకుఁ గుశలమతులు. 27

వ॥ ఇట్లు దివ్యభవనంబుఁ గావించి శిల్పాధికారు లేతెంచి రాజున కిట్లనిరి. 28

శా॥ అయ్యా నేఁటికి మీ కటాక్షమున నాద్యంతక్రమం బొప్పఁగా
నయ్యెం గోవెల యంతయు, న్నటి ప్రతిష్ఠారూఢ దైవంబులం
జెయ్యంగావలె నన్న, రాజు నగి సృష్టిం జేయు సర్వేశునిం
జెయ్య నీ తరమే, వృథామతులఁ గష్టిం బొందఁగా నేటికిన్. 29

---

మకూర్చు పనులను; తత్పరబుద్ధిన్ ఒనర్పకుండిన=ఆసక్తిగల మనస్సుతో చేయక పోవునెడల; ఎట్లు తరించు= ఎట్లు మానవుడు ముక్తి పొందును.

25. ఘన రత్న శోభితముగా=గొప్ప రత్నములచేత ప్రకాశింపగా; సర్వేశ్వరునికి; సదనము=కోవెలను కట్టుటకు పనివారలను; పంపించెదను=పంపుదును.

26. అలఘు విశేష తత్పరతన్=మిక్కిలి గొప్ప ఆసక్తితో; శిల్పకళా ప్రవీణులన్=ఇండ్లు మొదలైనవి కట్టు శాస్త్రమునందు నేర్పరులైనవారిని పిలువుమని పంపి; ధనాఢ్యుల చేసి=వారలను ధనముగల వారినిగా జేసి (ధనమిచ్చి) తాను నెలకొని=స్థిరముగా నుండి; అనిందిత రమ్య మనోజ్ఞ=ఆదిదేవునికొఱకు పవిత్ర సుందర మనోహరమైన కోవెల కట్టవలయునని ఆజ్ఞ ఇచ్చెను.

27. భర్మ నిర్మిత మణి ప్రభలన్=బంగారుతో గట్టిన మణుల కాంతుల చేత; రంజిలునట్టి ప్రాకారములు =చుట్టు గోడలును; ముఖభద్రములును=మొగసాలలు (ముందుండు చావడులు) లీలాగృహములు=విహారము చేయు నిండ్లు; అంతరాళికములు=మేలుకట్లు మొదలగునవి; గర్భాగారములు=వాసము చేయు నిండ్లు; కక్ష్యాంతరములు=తొట్టికట్లును; కొలువుకూటములు=కచ్చేరిచావడులు; గోపురములు=గవనులు; కళ్యాణ మండపములు=వివాహములు చేయు గృహములు; అంతరాంతర ప్రదక్షిణ విధి క్రమ యుక్త మార్గముల్= నడుమ నడుమ చుట్టు ప్రదక్షిణము చేసి వచ్చుటకు తగిన దారులు; బహు విధములయిన నైవేద్య పాక యోగ్య మందిరములు=భక్ష్యవస్తువులను వండుటకు తగిన ఇండ్లను; వీనితో కుశలమతులు=బుద్ధిమంతులు కోవెలను కట్టిరి. శిల్ప కళా ప్రౌఢి కడలుకొనగా=ఇండ్లు కట్టు శిల్పశాస్త్రమునందుగల నేర్పు విస్తరింపగా.

28. దివ్య భవనంబు=దేవాలయము; కావించి=కట్టి; శిల్పాధికారులు=ఇండ్లు కట్టు పనివాండ్రు.

29. ఆది అంత క్రమం బొప్పగా=మొదలు పెట్టినవి ముగియునట్లుగా కోవెల అయ్యెను; ప్రతిష్ఠా ఆరూఢ దైవంబులన్=ఆ గుడిలో ప్రతిష్ఠింపబడవలసిన దేవులను; చెయ్యంగావలెన్=చేయవలెను. (చేయం

సీ॥ ఎవ్వని శక్తిచే నెల్లలోకంబులు - పుట్టి పెంపు వహించి పొడవడంగు
నెవ్వాని ఘనతేజ మినకోటి కోటుల ప్రభాజాలములనైనఁ బట్టి మ్రింగు
నెవ్వాని యాకార మిట్టిట్టిదని నిశ్చ - యింప వేదములకు నెఱుఁగఁ బోదు
యెవ్వని భవ్యసమిద్ధ చరిత్రలు - వాఙ్మనసాతీత వర్తితములు,
తే॥ అతఁడె సర్వేశ్వరుండు పరాత్పరుండు - గాన వానికై సొంపుగఁ గట్టినట్టి 30
ఘనభవనము వర్ణింపను కౌతుకమున - సార్వభౌముని మహిమందు జాల వెలుఁగ
ఉ॥ మతిఁ దలఁప న్వియత్కలన నుత్కృత దేవనివాసమధ్యశో
భితుఁడగు నాదిదేవునకుఁ బ్రీతిమెయి న్సకలోపచారముల్
రతి నడపించు టొప్పగుఁ దిరంబుగ నింతియ కాక నెట్టినై
ప్రతిమల నిల్పు టేటికిది భావ్యమునం దగ దెన్నిభంగులన్. ౩౧
క॥ అని నిశ్చయించి శిల్పకు - లను దత్తదభీష్టధనములఁ దృప్తులుగా
నొనరించి పంచె సర్వే - శునకు న్సద్భక్తి యుక్తి సొంపు దలిర్పన్. ౩౨
వ॥ అనవరతంబునుం ద్రిసంధ్యాకాలంబుల మ్రోయించు ననేక భేరీమృదంగాది వాద్యవిశేషంబులం గాహళశంఖఘంటతాళాదులం బొడమిన రవంబు లొక్కపెట్ట నాకసంబంటి ఘూర్ణిల్ల, గీతనృత్యవినోదంబులం గరదీపికా సహస్ర ప్రభాజాలంబులం బరితోషం బావహిల్ల, నెడనెడఁ బరిపక్వ మధురఫలాద్యుపహారంబుల బహువిధ భక్ష్యభోజ్యాది మహానైవేద్యంబు లర్పణతో మహోత్సవంబు నడపుచుండు నెడ; నచ్చటచ్చటి జనంబులందఱును దదనుగుణప్రవర్తనులై యితర దేవతాప్ర

గా నని యుండిన మేలు.) అనవుడు రాజు నవ్వి చెప్పినదేమనగా: సృష్టియొక్క సర్వేశ్వరుని చేయుట మా చేతనగునా? వృథామతులన్=వ్యర్థమైన బుద్ధులచేత కష్టపడుట యేఁటికి?

30. ఏ దేవుని శక్తిచే; ఎల్లలోకములు పుట్టి పెరిగి పొడవడఁగున్=నశించునో; ఎవ్వని ఘనతేజము=గొప్పకాంతి; ఇన కోటి కోటు ప్రభా జాలములన్=కోట్లకొలది సూర్య సమూహముల కాంతి సముదాయమును పట్టి మ్రింగునో; ఆకారము=స్వరూపము; పొడమదు=దొరకదు; ఎవ్వని భవ్య సమిద్ధ చరిత్రలు=ఏ దేవునియొక్క శుభప్రదమైన ప్రసిద్ధి కెక్కిన వృత్తాంతములు; వాక్ మనస్ అతీతములు=నోటితో జెప్పుటకును, మనస్సులో నూహించుటకును వీలులేనివి;

31. మతి దలపన్=ఆలోచింపగా; వియత్ కలనన్=ఆకాశమనెడు భావముచేత; (ఆకాశము మన కన్నుల కగపడదు. కనబడక పోయినను ఆకాశము కలదు. ఆ విధముగా దేవుడు కనపడక పోయినను, ఈ కోవెలలో వేంచేసినాడు అను భావము) ఉత్కృతి దేవనివాస=నాచే గట్టింపబడిన దేవాలయములయొక్క; మధ్యశోభితుడు=నడుమ ప్రకాశించునాడు; ఆదిదేవునికి ప్రీతితో సకల ఉపచారములను; రతిన్=భక్తితో నడపించుట ఒప్పు అగును; ఇంతియకాక=అట్లుకాకుండ నేను వెట్టివాడనై ఎందును ప్రతిమలను నిల్పుదును; ఇది యే విధములైనను భావ్యము=సరియైన పని యని చెప్పరాదు.

32. నిశ్చయించి=సిద్ధాంతముచేసి; తత్తదభీష్ట ధనములన్=వారి వారి కిష్టమైన ధనములచేత; తృప్తులుగా నొనరించి=ప్రీతి పొందించి; సర్వేశ్వరునియందు భక్తి యుక్తియొక్క సొంపు ప్రకాశింపగా.

33. అనవరతంబును=దినదినము; త్రిసంధ్యాకాలంబులన్=మూడు సంధ్యలయందు: ఉదయ మధ్యాహ్న సాయంకాలములు; భేరీ మృదంగ ఆది వాద్య విశేషము=దుందుభి మద్దెల మొదలైనవాని వాద్యముల చేతను; కాహళ=బూర; శంఖము ఘంట తాళము మొ॥ వానిచేతను; పొడమిన రవంబులు=పుట్టిన చప్పుడులు; ఒక్క పెట్టన్=ఒక్కమారుగా; ఘూర్ణిల్లగా=పెద్ద ధ్వనికాగా; గీతము నృత్యము=పాటలు ఆటలు మొదలైన వినోదములతో; కరదీపికా సహస్ర ప్రభాజాలంబులన్=చేతి దీపముల వేయింటి కాంతుల

చింతనఁ బుసి. మృద్దారు పాషాణలోహాదులం జేసిన ప్రతిమలం గైకొనక నిరాకార నిరంజనుండగు నొక్క సర్వేశ్వరునే భజించుచుండి రిట్లు భోగమోక్షాధికార సిద్ధికారణుండై సలోమాధీశ్వరుం డనేకాబ్దంబులు రాజ్యంబు చేసి కాలవశంబునం బంచత్వంబు నొంది కృతార్థుండయ్యె నయ్యనంతరంబున దత్పుత్రికుం డప్రగల్భ భావంబు పెంపున రాజ్యభారంబు నహింపక నేరమిం జేసి. 33

క. అశ్శూర్యరాజ్యమేలెను - నీశుండగు సల్మనసరుఁ డిద్ధబలాఢ్యుం
డాశాయుతకుటిలుండా - దేశములో నెల్ల ప్రజ నధీనం బయ్యెన్. 34

క. పట్టాభిషిక్తుఁడై ప్రజ - లట్టిట్టుఁ గలంగి పాఱ, నాజ్ఞాకలనం
గట్టించెఁ దోరణంబులు - బట్టణముల జనపథముల భాసురలీలన్. 35

చ. గుములుగ వేలువేలుఁ గొనికొన్ని పురంబులు గూర్చి నాసిపైఁ
బదిలముగాఁగ నొక్కొకరిఁ బాలనకుం దన కూర్చువారి నిం
పొదవఁగ నిల్పి తత్కృతుల నూహకుఁ దార్చుచు నెట్టి పెద్దలన్
మది నొకలెక్క సేయక ప్రమత్తత రాజ్యము చేయఁ బాల్పడెన్. 36

సమూహముచే సంతోషము; ఆవహిల్లన్=కలుగగా; ఎడనెడన్=నడుమ నడుమ; పరిపక్వ మధుర ఫలాగ్ర్యపహారములు=బాగుగా పండిన తీయని పండ్లు మొదలైన కానుకలచేతను; భక్ష్య భోజ్య ఆది మహా నైవేద్యములు=పిండివంటలు అన్నము మొదలైనవాని గొప్ప నివేదనచేతను; సందున నడుపుచున్న సమయమున; తదనుగుణ ప్రవర్తనులై=వానికి తగినట్లుగా సంచరించువారై; ఇతర దేవతా ప్రచింతనంబు ఉడిగి=అన్యులైన దేవతలను పిలపెట్టుట మాని; మృత్ దారు పాషాణ లోహాదులన్=మట్టి కఱ్ఱ ఱాయి ఇనుము మొదలగువానితో జేయబడిన; నిరాకార నిరంజనుండు=ఆకారము లేనివాడు దోషము లేనివాడు; భోగ మోక్ష అధికార సిద్ధికారణుండు=సుఖించుటకును ముక్తి పొందుటకును (నరులకు) అధికారమును కలుగుటకు కారణుడైనవాడు; అనేకాబ్దంబులు=బహు సంవత్సరములు; కాలవశంబున=అతడు జీవించుకాలము పూర్తియగుటచే; పంచత్వము=మరణము పొంది; కృతార్థుండయ్యె=మోక్షమున కెక్కెను; తత్పుత్రికుండు అప్రగల్భభావంబు పెంపున=అతని కొడుకు ప్రతాపము చూపలేని గుణము గలవాడగుటచేత (ఎక్కుడు సామర్థ్యము లేని కారణమున) నేరమిం జేసి=చేతగాక పోయినందువల్ల.

34. ఈశుడగు=రాజు అనెడు సల్మనసరుడు (పూర్వవేద గ్రంథములలో ఈ రాజుయొక్క పేరు సల్మనజారుడు గాని సల్మనసరుడు అను పేరుకాదు. కవికి దొరకిన వ్రాత పుస్తకములో వ్రాత తప్పు కలిగెను.) ఇద్ధబలాఢ్యుడు=ప్రసిద్ధి కెక్కిన బలవంతుడు; ఆశాయుతకుటిలుండు=దురాశలతో కూడిన దుర్మార్గుడు.

35. పట్టాభిషిక్తుడై=రాజు పట్టమును బొంది; ప్రజలు; అట్టిట్టు కలంగి పాఱన్=అన్ని వైపులకు భయపడి పరుగెత్తునట్లు; పట్టణములయందును; జనపథములన్=పల్లెటూరులయందును; ఆజ్ఞాకలనన్=తన అధికారముతో గూడిన తోరణములు=అక్షరములు వ్రాసిన జెండాలు మొదలైనవి; భాసురలీలన్=ప్రకటనమగునట్లు కట్టించెను. తా॥ తాను క్రొత్త క్రొత్తగా నేవో యేర్పాటులు చేసి ప్రజలకు భయము పుట్టునట్లును ఎల్ల జనులకు దెలియునట్లును ప్రతిస్థలమున తడికలమీదను తోరణములు మొదలగు వానిమీదను తన యధికారబలము వ్రాసి ప్రకటించినాడని భావము.

36. గుములుగ వేలువేలన్=గుంపులుగాను, విడివిడిగాను; కూర్చి=చేర్చి; పదిలముగాగన్=జాగ్రత్తగా; పాలనకున్=అధికారమునకు; తన కూర్చువారిన్=తన స్నేహితులను; నిల్పి=అధికారులుగా జేసి తత్కృతులన్=వారు చేయు పనులను; ఊహకు దార్చుచున్=ఆలోచించుచు; ఎట్టి పెద్దలన్=యెంత పెద్దవారలనైన; లెక్క సేయక=లక్ష్యపెట్టక (మర్యాద చేయక) ప్రమత్తతన్=మిక్కిలి గర్వముతో రాజ్యము చేయుటకు పాల్పడెన్=సిద్ధపడినాడు.

చ॥ తన పని దొడ్డుగాఁ దలఁచుఁ, దక్కువటంచు నిరాకరించు న
న్యుని పని యెంత సద్ఘనత నొందిన యేని, పృథాభిమానియై
తనుఁ గొనియాడ నుబ్బు, మును ధన్యతఁ గాంచిన యన్యరాజ వ
ర్తనములు నెన్ను వారిఁ గని తామసవృత్తి నదల్చు నెంతయున్. 37

సీ॥ దండివర్తకుల నుద్దండతఁ గావించి - నయభయాలాపము ల్నడిపి కొంత
మేటికాఁపుల నెల్ల మెల్లనఁ బిలువంగఁ - బంచి నేరుపున లాలించి కొంత
బలిమిమైఁ జిల్లరప్రజఁ బట్టి తెప్పించి - మించి యాగ్రహము గావించి కొంత
పుల్లరిఁ బేర్కొని గొల్లల నరికట్టి - బెదరించి వాక్ప్రౌఢి గదిమి కొంత 38

తే॥ కోడిపందెంబు గెలుపులఁ గోరి కొంత - లేని తప్పుల మోపి యలిగియుఁ గొంత
జనుల బాధించి యీ రీతి ధన మనేక - కుటిలమార్గంబులను బెక్కు గూర్చె నతఁడు.

ఉ॥ అల్లనఁ బట్టణంబుల విహారము సల్పుచు మున్సలోమభూ
వల్లభుచేఁ బ్రతిష్ఠఁ గని వైభవశీలఁ దనర్చు గుళ్లయం
దెల్ల శిలాది విగ్రహ విహీనతఁ గన్గొని నవ్వి నవ్వి యీ
కల్ల లెఱుంగ మెన్నఁడు జగంబున దయ్యములేని జాతరల్. 39

మత్తకోకిల॥ ఇట్టి ధర్మవు సేయఁగా మన కించుకంతయుఁ దోఁచునే,
నట్టి గుళ్లు ప్రతిష్ఠచేసిన వాని భాగ్య మటుండఁగాఁ
జుట్టు నిల్చి భజించు పౌరులుఁ జూడ మంచి గుణాఢ్యులే
పట్టి వేసిననైన నిల్వరు పంచఁ గొల్వక నిత్యమున్. 40

37. తన పని దొడ్డుగా=గొప్పదానినిగా దలఁచును ఇతరుల పని సద్ఘనతనొందిన యేని=ఎంత గొప్పదియైనను తక్కువటంచు; నిరాకరించున్=తిరస్కరించును; పృథాభిమాని=వట్టిగర్వము గలవాడు; కొనియాడ ఉబ్బును=ఎవ్వరైన పొగడిరేని సంతోషముచే నొడలుబ్బుంగ నుండును; మును=తనకంటె ముందు రాజ్యము చేసినవారును; ధన్యత గాంచినవారును అయిన; అన్యరాజ వర్తనములన్=ఇతర రాజులు చేసిన పనులను; ఎన్ను వారిని=పొగడుచుండువారిని; తామసవృత్తి=కోపముతో; ఎంతయున్=మిక్కిలి; అదల్చున్=భయపెట్టును.

38. దండివర్తకులన్=పెద్ద వ్యాపారములు చేయు వర్తకులను; ఉద్దండతన్ రావించి=భయపెట్టుచు పిలిచి; నయ భయ ఆలాపముల్ నడిపి=నీతి భయము చూపునట్టి పలుకులు పలికి; మేటికాపులన్=పెద్ద సేద్యగాండ్రయిన (రయితులను); మెల్లన=నెమ్మదిగా; బిలువంగబంచి; లాలించి=బుజ్జగించి; బలిమిమై=బలవంతముగా; చిల్లరప్రజన్=హీనజనులను (చిల్లర యనగా పేరుపొందినవారు కారు); ఆగ్రహము మించి కావించి=గట్టికోపము కనబఱచి; పుల్లరి=గడ్డిబీడుల పన్నులను పేరుపెట్టి; గొల్లలను అరికట్టి=నిర్బంధపెట్టి; వాక్ప్రౌఢిన్=నోటిమాటల బలముచే; కోడిపందెములు గెల్చుకొన్నవారియొద్ద కొంత; అనేక కుటిలమార్గంబులన్=పెక్కు కుట్రమార్గములచేత ధనము; పెక్కు=విస్తారము కూర్చెను.

39. అల్లనన్=విలాసముతో; విహారము సల్పుచున్=సంచరించుచు; మున్=పూర్వము; ప్రతిష్ఠ గని=ప్రతిష్ఠ పొంది; శిలాది విగ్రహ విహీనతన్=ఱాయి మొదలగువానితో జేయబడిన విగ్రహములు లేకపోవుటను కనుగొని; (రాజు చెప్పినదేమనగా:) ఈ మోసము నెన్నడు నెఱుగము, దేవతలేని జాతర లుండునా?

40. ఇట్టి ధర్మకార్యములు చేయుటకు; ఇంచుకంతయున్=కొంచెమైనను; మనకు తోచునా=తోపదు, నాకు ఇష్టము లేదు; మనకు అనగా తన గౌరవము గనబడునట్లు చెప్పుకొనినాడు; వట్టి గుడులను గట్టించి ప్రతిష్ఠ చేసిన వాని (సలోముని) భాగ్యము అటుండగా=ఆ రీతి నుండగా ఈ వట్టిగుళ్లలో చుట్టు నిల్చి భజించు పౌరులు=ఈ పురములలోని జనులు; మంచి గుణాఢ్యులే=మంచి బుద్ధిమంతులేగదా, అన

క॥ అని యుల్లాసంబులాడుచు - మన వశమైయున్న దేశమధ్యంబున నీ
కనరాని దేవభజనము - లొనగూడ వటంచు నృపతి యూహ దలిర్పన్. 41

ఉ॥ అప్పుడు శిల్పవేదుల రయంబునఁ బిల్చి ధనం బొసంగి మీ
రిప్పుడె పోయి దేవళము లెచ్చట యుక్తమొ యచ్చటచ్చటన్
గొప్పలుగా రచింపుఁడని కొందఱఁ గొందఱఁ బంచి వారిలో
నెప్పరులైన వారిఁ బట్టు నిల్పి వినిర్మలహేమ మయ్యెడన్. 42

క॥ తెప్పించి వారిముందఱఁ - గుప్పలుగా వైచి పెద్ద కొలుముల నిడి బా
గొప్పఁ గరఁగించి యచ్చుల - నప్పుడ చేయించె విగ్రహాదులఁ బేర్మిన్. 43

సీ॥ ఇట్లు బల్మూసల నిడి పైఁడి వడి నూఁది - కళకళ నీరుగాఁ గరఁగ దాని
నచ్చులఁ బూరించి యార్చి వెడల్చి పి - మ్మటఁ జక్కఁగా దిద్ది పటిక నార్చి
తళ తళ మెఱుఁగురా బెళికి తీర్చిన విగ్ర - హాదుల నాయితంబైన గుళ్ల
యందుఁ బ్రతిష్ఠించి యనవరతార్చన - లొగిఁ దిరునాళ్ల మహోత్సవములుఁ

తే॥ పంచపాది॥ బరఁగ నడపుచు నచ్చటి ప్రజలనెల్ల
వేగ రప్పించి మునుపటి వెట్టి మానుఁ
డిదె ప్రతిష్ఠించినారము హేమవిగ్ర
హముల బహు నామముల వీని నహరహంబుఁ
గొల్వుఁడని యాజ్ఞ వెట్టించె గురుతరముగ. 44

గా సలోము తెలియక చేసిన పనిని వీరెట్లు సమ్మతించినారని యాక్షేపణ. ఈ పౌరుల పట్టివేసినన్=నిర్బంధించినగాని; పంచన్=ప్రక్క ప్రక్కలను; కొల్వక=పూజచేయకుండ; నిల్వరు=మానరు.

41. ఉల్లసంబులాడుచు=వేళాకోళము చేయుచు; మన వశమైయున్న=నాయధికారమునకు లోబడియున్న; కనరాని దేవభజనము=కంటికి గనబడని దేవుని పూజించుట; ఒనగూడవు=మాకు నచ్చదు; ఊహ దలిర్పన్=ఊహించి.

42. శిల్పవేదులన్=శిల్పశాస్త్రము తెలిసినవారిని; రయంబున=తొందరగా; ఎచ్చట యుక్తమొ=ఎక్కడ తగిన చోటు ఉన్నదో అక్కడ; నెప్పరులైనవారిని=పని బాగుగా తెలిసినవారిని; వినిర్మల హేమము=మంచి బంగారము.

43. కొలుముల నిడి=కరగించుటకుగాను కంసాలపనివాని నిప్పులగుంట త్రవ్వించి కరగించి యచ్చులు పోయించి విగ్రహములను జేయించెను. (పై విగ్రహాదులను జేయించినాడన్న మాటలనే విరివిగా క్రింద జెప్పుచున్నాడు)

44. బల్మూసలన్ పైడి నిడి=పెద్ద మూసలలో బంగారము పెట్టి (మూసలు=బంగారు వెండి మొదలగునవి కరగించెడు మట్టిపాత్రలు, అచ్చులన్=విగ్రహములు చెక్కిన పోత); పూరించి=నిండుగా బోసి; ఆర్చి=చల్లారనిచ్చి; వెడల్చి=అచ్చులలోనుండి పైకి దీసి; దిద్ది=చక్కజేసి; పటికన్ ఆర్చి=పటికరాచి కాల్చి; మెఱుగురా=మెఱుగు వచ్చునట్లు; బెళికి=లేఖలతో ఆకుతాళ్లతో తోమి రాపటముపెట్టి; తీర్చిన=సిద్ధముచేసిన; ఆయితంబైన=కట్టబడినట్టి; ప్రతిష్ఠించి=స్థాపించి; అనవరత అర్చనలు=ఎల్లప్పుడును పూజలు; ఒగిన్=క్రమముగా; తిరునాళ్లు=దేవతలకు సంవత్సర సంవత్సరము చేయు నుత్సవములు; మహోత్సవములు=పెద్ద పండుగలు; హేమవిగ్రహములన్=బంగారు బొమ్మలను; బహు నామములన్=అనేక (దేవతల) పేరులతో; అహరహంబున్=దినదినము కొల్వుడు అని; గురుతరముగ=గట్టిగా; ఆజ్ఞ బెట్టించి=చేయించి.

క॥ అంగీకరించి బ్రదుకుఁడు - వెంగలులై చెడియు మీరు వెఱవక మది నీ
బంగరు వేల్పులఁ గొలువఁ బో - సంగని యెడ నిండ్లు విడిచి జరుగుఁడు వేగన్ 45

ఉ॥ నా విని వారలందఱు వినమ్రత నిట్లని విన్నవించి రో
భూవర నీ మహాజ్ఞఁ దలఁబూని భజించెద మట్లు గానిచోఁ
బోవఁగ నేర్తుమే తొలఁగి పుట్టిన భూములు, వాని మోక్షపుం
ద్రోవలతీరు దేవర యెఱుంగును బ్రోవుము మమ్ము నిమ్మెడన్. 46

శా॥ అంతర్లీన చిదంబరాంచిత కళాధ్యాన క్రియాశూన్యులై
యంతం బూర్వవిధి ప్రవర్తన పరిత్యాగంబు హేయంబుగాఁ
జింతింపంగ నశక్యులైరి నృపసంశిక్షా భయవ్యాప్తి "రా
జాంతే ధర్మ" మటన్న సామ్య మిలఁ దథ్యం బయ్యె నూహింపఁగన్. 47

తే॥ తమకు సరిపోని రాజ బోధలకుఁ జిక్కి - వదలలేరైరి దుస్సహవాస మకట
తల్లి నెడఁబాసి పోలేని తనయు లట్లు - "యున్న యూరును గన్న త" ల్లన్నపగిది. 48

క॥ అని యిట్లఖిలముఁ బుట్టిం - చిన దేవుని మఱచి నరులు చేసిన బొమ్మల్
ఘనదైవము లని తప్పక - యనవరతముఁ గొలువఁ జొచ్చి రచ్చటి జనముల్ 49

క॥ అది గావున సుజ్ఞానం - బుదయించుట నరుల కరిది, యుదయించినచోఁ
దుదిముట్టు టరిది, శ్రేయః - పద మగునెడఁ బుట్టుచుండు బహు విఘ్నంబుల్. 50

45. అంగీకరించి=విగ్రహమును బూజించుటకు సమ్మతించి; బ్రదుకుడు=సుఖముగా జీవింపుడు వెంగలులై=వెఱ్ఱివారై; గొలువ బోసంగనియెడ=సేవించుటకు ఇష్టములేనివారు; ఇండ్లు విడిచి జరుగుడు=ఎక్కడికైన లేచి పొండు.

46. నాన్ విని=అని చెప్పగా విని; వినమ్రతన్=మిక్కిలి వంగినవారై (తలవంచి) విన్నవించిరి. ఓ భూవర=రాజా; నీ మహా ఆజ్ఞన్ తలబూని=తలపై బెట్టుకొని (సమ్మతించి) భజించెదము; అట్లు కాని యెడల పుట్టిన భూములు విడిచి తొలంగిపోవగలమా మోక్షపు ద్రోవల తీరు=ముక్తి దొరకు దారుల విధము; దేవరవారైన మీరు ఎఱుగుదురు.

47. అంతర్లీన చిదంబర అంచిత కళాధ్యాన క్రియాశూన్యులై=లోన గనబడకుండనుండిన చిదాకాశమందు కూడియుండిన జ్యోతిని ధ్యానము చేయు పనియందు తెలివిలేనివారై; పూర్వ విధి ప్రవర్తన పరిత్యాగంబు=పూర్వకాలమునుండి జరుగుచున్న పూజయందు ప్రవర్తించుటను విడుచుట (పూర్వము వీరు విగ్రహములు లేని దేవాలయములలో పూజించువారు, ఆ పూజ నిపుడు మానుట); హేయంబుగాన్=నిందింపదగిన దానినిగా; చింతింపంగ అశక్యులైరి=తలప శక్తిచాలక యుండిరి. ఏ కారణముననగా? నృపసంశిక్షా భయవ్యాప్తిన్=రాజు కఠిన శిక్ష చేయునను భయము కలిగినందుచేత; రాజాంతే ధర్మమ్=రాజు నశించిన ధర్మమును నశించును అన్న సామెత; తథ్యంబయ్యెన్=నిక్కమైనది.

48. సరిపోని=ఇష్టములేని; రాజుగారి బోధలలో; చిక్కి=తగులుకొని; దుస్సహవాసమును=చెడ్డ స్నేహమును వదలలేకపోయిరి; అకటా=అయ్యో; "ఉన్న యూరును కన్నతల్లి" అను సామెతవలె ఉన్న యూరును పోలినది యింకొక యూరుండదు, కన్నతల్లివంటిది యింకొక్క స్త్రీ యుండదు. కావున నదె విడిచి పోలేక పోయిరి.

49. అఖిలముల్=సర్వప్రపంచమును; ఘనదైవము=పెద్ద దేవుడు; అనవరతము=ప్రతిదినము.

50. సుజ్ఞానంబు ఉదయించుట=మంచి తెలివి పుట్టుట; నరులకు అరిది=కష్టము; ఉదయించినచో=పుట్టినను; తుది ముట్టుట అరిది=చచ్చువఱకు ఆ సుజ్ఞానముండుట కష్టము; శ్రేయఃపదము అగునెడ=మేలగు పనులయందు నుండునెడల; బహు విఘ్నములు=ఎక్కువ ఆటంకములు పుట్టుచుండును. (శ్రేయాంసి బహు విఘ్నాని అను సామెత, మంచి పని చేయబోగా దానికి నడుమ అడ్డు కలుగుచుండుననుట.)

సీ॥ ఆది మధ్యాంత శూన్య ప్రభావత నొక్క - డై వెల్గు శ్రీమహా దేవునందు
సద్భక్తి సరసమైన సమరస జ్ఞానంబు - పెక్కండ్రలోపల నొక్కనికిని
బరమేశ్వరుని కృపాప్రాప్తి వశంబునఁ - బుట్టి నిశ్చలభావమునఁ దనర్చుఁ
గాని యందఱకును గలుగ దట్లు సల్మ - నసరుఁడు పరిపాలనంబొనర్చు 51

తే॥ రాజ్యమునందు గల్గు ప్రజలెల్ల రాజభ్రమలఁ - జిక్కి పెఱదైవములఁ గొల్చి రక్కజముగ
నప్పుడిందఱిలో దోభ్యుఁడను మహాత్ముఁ - డొక్కరుండు పుణ్యాత్ముఁడై యొప్పెఁ జగతి.

వ॥ తదుద్భావనం బెట్లనిన, నిచ్చటి జనంబు లందఱుఁ బరమేశ్వరభక్తి విధాన విజ్ఞాన
యోగమతంబు మొదల నంగీకరించి యుండియుం బిమ్మటఁ దదీయ సామర్థ్యం బె
ఱుంగనేరక చాంచల్యభావంబులఁ జెందినఁ జెందిన యపవర్గ సౌఖ్యపదభ్రష్టత్వ
మఖిలజ్ఞుండగు సర్వేశ్వరుండంతయు నెఱింగి జగదుపకారార్థంబుగా సమస్తజనము
క్తికి కారణం బగు తదేకనిష్ఠామహాత్త్వంబు జగత్ప్రసిద్ధంబు సేయం దలంచు నవసరం
బున. 52

క॥ ఇశ్రేలని యెడు రాజ్యం - బక్రాంత శ్రీఁ దనర్ప నచటం దగు స
త్యశ్రుతిమత జనసందో - హాశ్రయమై యందుఁ బుట్టె దాతోభ్యుఁ డొగిన్. 53

సీ॥ కొన్ని దినంబులు కన్నులు దెఱవక - యంతరంగ సమాధి నతిశయిల్లెఁ,
దర్వాత బయలెల్లఁ దాను చూడఁగ గోరి - జోడు కన్నులు విచ్చి చూడ నేర్చెఁ.

51. ఆది మధ్య అంత శూన్య ప్రభావతన్=మొదలు మధ్య ముగింపులేని మహత్తుగలవాడై ప్రకాశించుచు దేవునియందు మంచి భక్తియు; సమరసజ్ఞానంబు=ప్రేమతో కూడిన తెలివియు; పెక్కండ్రలో=అనేకులలో నొక్కనికి; పరమేశ్వరుని కృపా ప్రాప్తివశంబునన్=దేవుని దయ కలుగుటచేత; పుట్టి నిశ్చలభావమునన్ తనర్చును=స్థిరమైన మనస్సు నుండును గాని అందఱకు ఆ జ్ఞానము కలుగదు. (అనగా, ఏక దేవునియందు భక్తి) ఎందుకనగా: సల్మనసరుడు పరిపాలన చేయు రాజ్యములోని జనులందఱు రాజుగారి భ్రమల జిక్కి=తప్పుతలంపులలో తగులుకొని; పెఱ=అన్యదైవములను కొల్చిరి; అక్కజముగా=ఆశ్చర్యముగా.

52. తత్ ఉత్ భావంబు=(ఆ తోభ్యునకు) అట్టి గొప్ప తెలివి యెట్లు కలిగినదనగా; నిచ్చటి జనులందఱు పరమేశ్వర భక్తి విధాన=సర్వేశ్వరునియందు భక్తి కలుగుట యను; విజ్ఞానయోగమతంబు=మిక్కిలి శ్రేష్ఠమైన యాచారమును మొదట అంగీకరించి యుండినను; పిమ్మట తదీయ సామర్థ్యంబు=ఆ భక్తియొక్క శక్తిని ఎఱుంగక; చాంచల్యభావంబులన్ చెందినన్=చంచలమైన మనస్సు పొందగా; చెందిన=ఇదివఱకు దమకు దొరకిన; అపవర్గసౌఖ్య=మోక్షమువంటి సుఖము; పదభ్రష్టత్వంబు=కోల్పోవుటయు; అఖిలజ్ఞుండగు=సర్వమును దెలిసిన సర్వేశ్వరుడు ఎఱిగి; జగదుపకారార్థము=ప్రజలయొక్క మేలుకొఱకు; సమస్తజన ముక్తికి కారణంబు=అందఱు జనులును ముక్తి పొందుటకు హేతువైన; తదేకనిష్ఠామహాత్త్వంబు=ఆ ముఖ్యమైన భక్తియొక్క గొప్పతనంబును; జగత్ప్రసిద్ధంబు=లోకములో నందఱు నెఱుగునట్లు చేయం దలంచు నవసరమున=సమయమున.

53. ఇశ్రేలు=జేరుసల్యమను రాజ్యములోనివారు; (ఇశ్రయేలు అని వ్రాయుటయే వాడుక) అక్రాంత శ్రీన్ తనర్పన్=ఎడతెగని సంపదతో గూడుకొని యుండగా; సత్యశ్రుతిమత=సత్యవేదమందు ఇష్టముగల; జనసందోహ ఆశ్రయమై=జనసమూహమునకు ఆదరువై తోభ్యుడు పుట్టెను.

54. అంతరంగసమాధిన్ అతిశయిల్లె=మనస్సులో ధ్యానించుటయందు ఉండెను. (తోభ్యుడు పుట్టగానే కన్నులు మూసికొనెను. అది యంతరంగ సమాధి.) బయలెల్లన్=మనస్సులోపలనేకాక యీబైట

గడు కట్టు బంధము ల్విడఁ దన్నవలె నని - తలఁచి పాదములు విదులుపసాగె,
సంబంధజనమృషాశ్రవణపరాఙ్ముఖ - బుద్ధిఁ బానుపుమీఁదఁ బొరలఁ దొడఁగె,
తే॥ యోగపీఠాసనస్థితి నొందవలయు - నని తిరంబుగఁ గూర్చుండె నవనిమీఁద,
నలఘుకల్మష పంకిలం బంటకుండ - నడవవలెనని భువిఁ దప్పటడుగు నిడెను. 54

ఉ॥ తిన్నని మేనుఁ గన్నుఁగవతేట భుజంబుల తీరు బెళ్కు వా
ల్గన్నుల సొంపు నడుము వికాసము కౌనుబెడంగు దిక్కులన్
వెన్నెల లీను నవ్వులును వీనుల కింపగు ముద్దుపల్కులుం
గ్రొన్ననమేని కాంతియును గోరి నుతింపఁగ నొప్పె నెంతయున్. 55

ఉ॥ ఆడఁగఁ బోవఁ డూరక తనంతట నొక్కొకవేళ బల్మిమైఁ
దోడికుమారు లెల్లఁ దనుఁ దోడ్కొనిపోయినఁ బోయి వారితో
నాడఁగఁ జొచ్చుఁ గాని మఱి యా నిఖిలేశ్వరునందుఁ జిత్తమ
ల్లాడఁగ నీయఁ డేయెడల, నాతని భాగ్యముఁ జెప్ప శక్యమే. 56

సీ॥ పరువడి నక్షరాభ్యాసంబు సేయక - మున్నె వ్రాయఁగ నేర్చె నన్నిలిపులు
లక్షణగ్రంథంబు వీక్షింపకయమున్నె - కావ్యనిర్మాణంపు ఘనతఁ గాంచె
వేదశాస్త్రవిహితవిద్యలు చదువక - మున్నె వేదాంతార్థములు గ్రహించె
శ్రవణాది సాధనశ్రాంతిఁ బూనకమున్నె - స్వరస్వరూపజ్ఞాన సరణిఁ జెందె

గూడ; కడు కట్టు బంధములు=విస్తారమైన కట్టుత్రాళ్లను; విడదన్నవలెనని=విడిపోవునట్లు తన్నవలె నని నట్లు; పాదములు విదులుప=ఆడింప మొదలుపెట్టెను; సంబంధజన మృషా శ్రవణ పరాఙ్ముఖబుద్ధి=తన బంధువులైన జనులు పలుకు అబద్ధపు వాక్యములను వినుటయందు ఇష్టములేక వెడమొగము పెట్టుకొను నానివలె పానుపుమీద దొర్లుటకు మొదలుపెట్టెను; (ఇది మూడు నాలుగు మాసముల యీడు). యోగపీఠ ఆసనస్థితిన్=భక్తిధ్యానయోగ సమాధిపీఠముపై కూర్చున్నరీతిగా నుండవలెననినట్టు; నిబ్బరముగా భూమిమీద కూర్చుండెను; (ఇది 6, 7 నెలల యీడు). అలఘు కల్మష పంకిలంబు అంటకుండన్=విస్తారమైన పాపము అనెడు బురద అంటుకొనకుండవలయుననినట్లు; తప్పటడుగులు ఇడియెన్=తొట్రుపడుచుండెడు నడుగులు పెట్టెను.

55. తిన్నని మేను=అందమైన శరీరము; కన్నుగవతేట=రెండు కన్నుల తెలివి; భుజంబుల తీరు=చక్కదనము; బెళ్కు వాలు గన్నుల సొంపు=చలించుచున్న పెద్ద నేత్రముల సౌందర్యము; కౌను బెడంగు=నడుముయొక్క సొగసు; దిక్కులన్ వెన్నెలను ఈను నవ్వులు=అతడు చూచిన అన్ని వైపులకు కాంతి పుట్టించు నవ్వులు; క్రొత్తనన మేని కాంతి=క్రొత్త చిగురుటాకులవంటి శరీరముయొక్క రంగును; నుతింపగన్ ఒప్పెన్=పొగడుటకు తగియుండెను.

56. బల్మిమై=బలవంతము చేయుటచేత; ఆ నిఖిలేశ్వరునందున్=సర్వేశ్వరుని మీది చిత్తము ఏ యెడలన్ అల్లాడగ నీయడు=ఏ సమయమందును చలింపనీయడు. (పిల్లలతో తన కిష్టములేని యాటలాడుచున్నను ఆటలలోబడి, ఏసమయమందును దైవధ్యానమును మఱచిపోడు.)

57. పరువడిన్ అక్షరాభ్యాసము=క్రమముగా అక్షరములను వ్రాయుట నేర్పకమునుపే; అన్నిలిపులు=అన్ని వ్రాతలను; లక్షణగ్రంథములు వీక్షింపకమున్నె=పుస్తకముల చదువుటకు మునుపే. కావ్యనిర్మాణంపు ఘనత=గ్రంథములను రచియించు నేర్పు పొందెను; శ్రవణాది సాధనశ్రాంతిన్=చెవులు మొదలగు పరికరములయొక్క సహాయము రాకమునుపే. (చెవితో వినకమునుపే, కంటితో జూడక మునుపే, చేతితో ముట్టుకొనక మునుపే) స్వర స్వరూప జ్ఞాన సరణి=ధ్వనిసందర్భమును మొదలగువానిని తెలిసికొను

తే॥ సమ్మహాత్ముఁ డనంత కళ్యాణగుణగ-ణాభిరాముఁ డనంగ నిత్యాపవర్గ 57
మార్గసంధానకరుఁ డన మహిఁ దనర్చె-నతనిఁ గొనియాడ నెవరికైనఁ దరమగునె?

మదనదర్పణము॥ ఉల్లమలరఁ జేయు తన్మహోజ్జ్వల ప్రభావము
న్దెల్ల జనులుఁ గూర్చి చూచి యొందు నిట్టి ధన్యునిం
దొల్లి వినమటంచుఁ జెప్ప నుత్సహించి తండ్రియుఁ
దల్లియును మనంబులోఁ దార్ప మెచ్చిరెంతయున్. 58

వ॥ ఇట్లు దినదినప్రవర్ధమానుండై యభినవ సౌందర్యవిలాసంబులం బ్రకాశించుచుండ నెడఁ దత్పిత్రాది సుహృజ్జనంబు లతనికిం దగిన కుమారికారత్నంబు నూహించి పరిణయంబు చేయ సమకట్టి యచ్చటచ్చటి బంధుస్థలంబులం బరిశీలించునెడ. 59

క॥ క్రొన్ననగుత్తి యని పొగడ-సన్నుతి కెక్కిన లతాంగి సద్బంధులలో
నన్నమ్మ యనెడు కన్నియ-కన్నుల పండువుగ నుండెఁ గడు మోదమునన్. 60

సీ॥ ఇంద్రనీలంబుల నెన గూర్పఁగూడునె-వివరింప నీ యింతి వేనలికిని
బవడంబు దీటుగాఁ బాటింపఁ జెల్లునె-భావింప నీ కల్కి మోవిరుచికి
సంపూర్ణ చంద్రుని సరిచేయవచ్చునె-వర్ణింప నీ కాంత వదనమునకు
సరసీరుహంబులు సాటినాఁ బాడియె-యెన్నఁగా నీ తన్వి కన్నుఁగవకు
తే॥ శిలలు గాకున్నఁ గఠినతఁ జెందకున్నఁ-గప్పు పూనకయున్నఁ, బంకమునఁ బుట్ట
కుండినను వీని సరిపోల్ప నొప్పుఁగాక-సహజ దోషంబులవి వాని సాటియగునె. 61

మార్గము దొరకెను; అనంత కళ్యాణగుణ గణ అభిరాముడు=అంతములేని విస్తారమైన మంచి గుణములచేత సుందరమైనవాడు; నిత్యాపవర్గ=నిత్య మోక్షముయొక్క; మార్గ సంధానకరుడు=సాధనమును కూర్చినట్టివాడు; లోకములో తనర్చెన్=ఉండెను.

58. ఉల్లము అలరన్=మనస్సు సంతోషపడునట్లు చేయు; తత్ మహోజ్జ్వల ప్రభావము=అతనియొక్క గొప్ప కాంతిగల అద్భుతమైన శక్తి ఎల్లజనులును జూచి; తొల్లి ఇట్టి ధన్యునిన్=పూర్వము ఇటువంటి పుణ్యాత్ముని; ఎఱుగమని చెప్పగా, తల్లియును తండ్రియును ఉత్సహించి=సంతోషించి మనస్సులో; దార్ప మెచ్చిరి=ఇష్టపడిరి.

59. దినదిన ప్రవర్ధమానుండై=ప్రతిదినము వృద్ధిపొందుచున్నవాడై; అభినవ సౌందర్య విలాసంబులన్=క్రొత్త క్రొత్త అందమైన కాంతులచేత ప్రకాశించుచుండగా; తత్ పితృ ఆది సుహృత్ జనంబులు=అతనియొక్క తండ్రి మొదలగు ఇష్టులైనవారు; కుమారికా రత్నంబున్ ఊహించి=మంచి కన్నెను వెదకి; బంధుస్థలంబుల=బంధువుల యిండ్లలో.

60. క్రొత్త నన=క్రొత్త చిగురాకుల గుత్తి యని జనులు పొగడగా; సన్నుతి కెక్కిన=ప్రసిద్ధి పొందిన లతాంగి=తీగవంటి మృదువైన దేహముగల కన్య; సద్బంధువులలో=మంచి చుట్టములలో నుండెను.

61. ఆలోచింపగా ఇంద్రనీలంబులన్=నవరత్నములలో నొకటియగు ఇంద్రనీలమను నల్లని రత్నమును; ఈ యింతి వేనలికిని=ఈ కన్యయొక్క కొప్పునకు (తల వెండ్రుకల ముడికి) ఎన గూర్ప గూడునే=సాటిగా చెప్పవచ్చునా; ఈ కల్కి మోవి రుచికి=ఈ కన్యయొక్క పెదవి కాంతికి; పవడంబున్ దీటుగా పాటింప చెల్లునే=పగడము సమానముగా అనుకొనవచ్చునా; ఈ కన్యయొక్క ముఖమునకు నిండు చందమామను సరిచేయవచ్చునా; ఈ తన్వి=ఈ కన్య రెండు కన్నులకు; సరసీరుహములు=పద్మములు (సరసి=చెరువులో; రుహము=పుట్టినది) సాటినా పాడియే=సరియగునని చెప్పుట న్యాయమా; శిలలు=రాళ్లు కాకపోయినయెడల; కఠినత జెందకున్న=గట్టిగా నుండక పోయినయెడల; కప్పు పూనకయున్నన్=నల్లదనము లేకపోయినయెడల; పంకమున=బురదలో పుట్టక యుండినయెడల; సరిపోల్ప నొప్పును=సమానమని పోల్చ

ఉ॥ ఈ తలిరాకుఁబోఁడి తగు నెంతయు నాతని కమ్మహామహుం
డీ తరలాయతేక్షణకు నింపుమెయిం దగు వీర లమ్మనో
జాత సధర్మభావులనఁ జాలుదు రౌనని వారలందఱుం
గౌతుకవృత్తి సంఘటన కార్యమునందు వినిశ్చితాత్ములై. 62

తే॥ పెండ్లికూఁతురు వారితోఁ బెట్టు దోఁప - నుచిత సల్లాపరీతుల నొక్క మాటు
మందలించిరో లేదో మున్ముందుగానె - భాగ్యమని సమ్మతింపఁ దత్పరత నపుడు. 63

ఆ॥ గురుజనముల బుధులఁ గూరిచి వెవ్వేగఁ
బలువుర కనుకూలమగు దినమునఁ
బరిణయమగునట్లు ప్రాభవ మొప్పఁగ
నిశ్చయంబు చేసి నేర్పు మిగుల.

సీ॥ ఎచ్చు పెచ్చుటఁ గల హితసుహృద్బంధుజ - నంబులఁ రప్పించి, నగర మెల్లఁ
గడు నలంకారంబు గావింపఁగాఁ బూని, - తులకించు పచ్చని తోరణములు
గట్టించి, వివిధ సుగంధ బంధుర ఘుమ - ఘుమలు దిక్కుల నిండి ప్రమద మొసఁగ
భేరీమృదంగాది పృథుల వాద్యవిశేష - ములు మ్రోయఁ, గాంతామణులు నెడనెడ
తే॥ రమ్య కుసుమగుచ్ఛంబుల రాలఁజేయ - గడిమిఁ జేసాఁచి వందిమాగధులు పొగడ
వేడ్క మీఱంగ నియమితవేళ వేద - సరణిఁ జేసిరి శోభ్యాని పరిణయంబు. 65

కాన తగును; (ఇంద్రనీలమునకు శిల యగుట, పవడమునకు కఠినత యగుట, చంద్రునకు అప్పుడప్పుడు మబ్బులచేత కప్పఁబడుట, సరసీరుహములకు పంకమున పుట్టుట దోషములని భావము) సహజ దోషంబులు=అవి దోషములతో గూడుకొనియున్నవి: వాని సాటి యగునె=అవి వేనలికి మోవిరుచికి వదనమునకు కన్నులకును సాటియైనవి కావు.

62. ఈ తలిరు ఆకు పోఁడి=ఈ చిగురుటాకువంటి శరీరముగల అన్నమ్మ; ఆతనికిన్ తగున్=సరిపడి యున్నది; ఆమ్మహానుభావుడు=ఆ గొప్ప తేజస్సుగల శోభ్యుడు; ఈ తరల ఆయత ఈక్షణకున్=ఈ చలించుచున్న విశాలమైన కన్నులు గలదానికి; వీరలు మనోజాత సధర్మ భావులు=మనస్సులో పుట్టిన మంచి ధర్మము గలిగినవారలు (సధర్మభావము వీరలకు సహజముగా కలిగినదిగాని నేర్పుచేత కలిగినది కాదు అను భావము) అన చాలుదురు అవును అని; కౌతుకవృత్తిన్=సంతోషించిన మనస్సులతో; సంఘటన కార్యమునందు=వీరిద్దఱిని దంపతులనుగా చేయుటయందు: వినిశ్చితాత్ములై=నిశ్చయము చేసికొన్న మనస్సు కలవారై.

63. బెట్టుదోఁపన్=అతిశయము కనబడునట్లు; ఉచిత సల్లాపరీతులన్=సమయమునకు దగిన సంభాషణములలో; ఒక్కమాటు మందలించిరో లేదో=ఒక్కసారి చెప్పినారో చెప్పలేదో; (అనగా కొంచెము చెప్పినంతలోనె) భాగ్యమని=మంచిదని: (మాకిట్టి యల్లుడు దొరకుట మహా భాగ్యమని) మున్ముందుగానె తత్పరతన్=ప్రారంభములో ఆ పెండ్లి చేయు పనిలో సమ్మతింపగా.

64. గురుజనముల బుధుల గూరిచి=గురువులను పెద్దలను రప్పించి; పలువురకు అనుకూల దినమున=వివాహమును చూచుటకు అందరికి అనుకూలముగా నుండెడి దినమున; ప్రభావమొప్పగా=గొప్పతనముతో గూడుకొని పెండ్లి అగునట్లు రూఢిపఱచి.

65. హిత సుహృత్ బంధుజనంబులన్=స్నేహితులను, ఇష్టులను బంధువులను రప్పించి; తులకించు=అతిశయించి యుబుకుచున్న; వివిధ సుగంధ బంధుర ఘుమఘుమలు=అనేక విధములైన పరిమళముల యొక్క దట్టములైన గుమగుమను వాసన; దిక్కుల నిండి ప్రమద మొసగ=అన్ని వైపులకు వ్యాపించి ఆనందము గూర్పగా; భేరి మృదంగము ఆది=భేరులు మద్దెలలు మొదలగు; పృథుల వాద్యవిశేషములు

క॥ పగలును రేయును విదితంబుగఁ దలిమి విశేష కృత్యములు సల్పెడుచోఁ
మిగుల నెడగల దటంచును దగు నుత్తర నిమిషమైన నమ్మఁడు బుద్ధిన్. 71

మ॥ ఇల గంపించినఁ, దారకల్ చెదరినన్, నిష్పచ్ఛమై కొండలున్
దలక్రిందైనను, భానుఁ డస్తగిరిమీఁదం దోఁచినన్. వార్ధు లా
వలి యేళ్లెల్లను నింకి యెండిన మనోవాక్కాయ కర్మంబులం
బలుకం బూనఁ డసత్య మొక్కటికి మానం డాత్మ ధర్మ స్థితిన్. 72

వ॥ ఇట్లుండ నొక్కనాఁ డప్పురంబున మున్ను సలోమాధీశ్వర ప్రతిష్ఠితంబైన యనర్ఘ్య మణిగణ ప్రభాభాసమానంబైన సర్వేశ్వరాలయంబు గనుంగొని, తదీయ విచిత్ర రచనావిలాసంబునకుం గాంతి విశేషంబునకుఁ గౌతూహలమానసుండై విగ్రహాదు లేమియుఁ జూడమిఁ బరితోషంబు నొందుచుం దన్నిర్మాణకారణుండగు సలోముని నిర్గుణధ్యాననిష్ఠాగరిష్ఠభావంబుఁ దెలిసి యతనిం గీర్తించుచు నది తనకు విహారస్థానంబుగాఁ గైకొని యచ్చటి జనంబుల కెల్ల నిర్గుణధ్యానసంధానమార్గంబు తేటపడం గఱపుచుఁ దోభ్యుఁడు బరమానంద భావంబునం బ్రవర్తించుచుండె. 73

పేదపడి=దరిద్రులై; బిడియపడిన=అడుగుటకు సిగ్గుపడినవారి; భావము=అభిప్రాయము తెలిసి (దరిద్రులై అడుగవలసి యున్నను సిగ్గుచేత అడుగనివారిని తెలిసికొని) ఎవ్వంబునం గాన=తిరస్కరింపక (లేనియప్పుడు అడుగ సిగ్గుపడుట యెందుకు అని నొప్పింపక); అర్థము=ధనము వారికి కావలసినది ఇచ్చెను; దారిద్ర్య హతముగాగ=వారి పేదతనము నశించిపోవునట్లుగా; సత్కృపామూర్తియై=మంచి దయతో కూడినవాడై; ఎల్ల జనులుం గన=అందరు చూచుచుండగా.

71. రేయును=రాత్రియును, విదితంబుగన్=అందఱకు తెలియునట్లు; తలిమి=తొందరపడి (ఆలస్యము చేయక); విశేష కృత్యములు సల్పెడుచోఁ=మంచి పనులు చేయునప్పుడు, ఎడగలదు=కావలసిన కాలమున్నది యని; ఉత్తరనిమిషమైనన్=రెండవ నిముసమునైన నమ్మడు. (చేయుచున్న నిమిషముకంటె రెండవ నిమిషముదాక ఆ పనిని చేయకున్న నేమగునో యని నమ్మడు, అనగా మొదలు పెట్టినదానిని పూర్తిగా చేసి విడుచునుగాని యింకొకప్పుడు చేయవచ్చునని కొంత పని నిలుపడు.)

72. ఇల కంపించిన=భూమి వణకినను, తారకలు చెదరినన్=నక్షత్రములు రాలినను; కొండలు నిష్పచ్ఛమై=నాశనమై తలక్రిందు అయినను; భానుడు అస్తగిరి=సూర్యుడు పడమటి కొండమీద ఉదయించినను; వార్ధి ఆవలి=సముద్రముల సమూహమును ఏళ్లు అన్నియు ఇంకి యెండినను; మనః వాక్ కాయ కర్మము=మనస్సుతోను మాటలతోను శరీరముతోను పనులచేతను; అసత్యము పలుకం బూనడు=అబద్ధము చెప్పబోడు; మానడు ఆత్మ ధర్మ స్థితిన్=తాను చేయవలసిన పనియొక్క స్థిరత్వమును విడువడు.

73. సలోమాధీశ్వర ప్రతిష్ఠితంబైన=సలోమరాజు నిలిపిన; అనర్ఘ్య మణిగణ ప్రభాభాసమానంబు=వెలలేని రత్నరాసులయొక్క కాంతులచే వెలిగెడు సర్వేశ్వరునియొక్క ఆలయము కనుగొని; తదీయ విచిత్ర రచనా విలాసంబునకు=ఆ గుడియందలి చిత్రమైన పనులయొక్క అందమునకును; కాంతి విశేషమునకు=ఎక్కువైన వెలుగునకు; కౌతూహలమానసుండై=సంతోషము చెందిన మనస్సుగలవాడై; విగ్రహములను చూడనందుచేత; తత్ నిర్మాణకారణుడగు=ఆ గుడి కట్టుటకు హేతుభూతుడైన సలోముని యొక్క; నిర్గుణ ధ్యాన నిష్ఠా గరిష్ఠ భావంబునకు=గుణరహితుడైన దేవుని ధ్యానము చేయుట యను పట్టుదలతో గట్టితనముగల అభిప్రాయము కీర్తించుచు; అది తనకు విహారస్థానంబుగా కైకొని=ఆ స్థలము సంచరించుటకు తగిన చోటుగా అంగీకరించి అచ్చటి జనంబులకెల్ల; నిర్గుణ ధ్యాన సంధాన మార్గము తేటపడ కఱపుచు=గుణరహితుడగు సర్వేశ్వరుని ధ్యానించుటను సంపాదించుకొను విధము బాగుగా తెలియునట్లు నేర్పుచు; పరమ ఆనంద భావంబున=మిక్కిలి సంతోషముగల మనస్సుతో తోభ్యుడు ప్రవర్తించుచుండెను.

శా॥ నిత్యానందమయస్వరూప, త్రిజగన్నిర్మాణ రక్షాహత
ప్రత్యాసక్తమనస్క, నిర్భరకృపాపారీణ, సర్వామర
స్తుత్యాహ్లాద మహానుభావ విమల శ్రుత్యుక్త సంశీల స
ద్భృత్యాభీష్ట ఫలప్రదానచతురా, దివ్య ప్రభాభాసురా. 74

గద్యము॥ ఇది శ్రీమత్ జేసునాథ సద్గురు వరప్రసాదలబ్ధాష్ట విధకవిత్వప్రవీణ, వినయధురీణ, భారద్వాజగోత్ర పింగలినాగయామాత్యపుత్త్ర యెల్లనార్య ప్రణీతంబైన సర్వేశ్వర మహత్త్వంబునందుఁ గృతీశ్వరుండగు సర్వేశ్వరుని భజనంబును, సలోముని రాజ్యాధికారంబును, తదీయ గుణకీర్తనంబును, సర్వేశ్వరాలయనిర్మాణంబును, తద్భక్తిసమాచరణంబువలన ననేక జనంబులం గృతార్థులం జేసి, సలోమాధీశ్వరుండు పంచత్వంబు నొంది కృతార్థుం డగుటయుఁ, బిమ్మట దుశ్శీలుండగు సల్మనస్సరుండు తద్రాజ్యంబున కధీశ్వరుండై సర్వేశ్వరాలయోల్లంఘనంబు చేసి తత్ప్రతీకారంబుగా ననేక దేవాలయంబులు గట్టించి బహునామంబులం గనకవిగ్రహాదులం బ్రతిష్ఠించి, దైవంబులుగా వాని ననవరతంబును గొలువ నచ్చటి బ్రజలనెల్ల నియ్యకొలిపి శిక్షించుచుండుటయుఁ, దదవసరంబున జగదుపకారార్థంబుగా సర్వేశ్వరుండు శోభ్యునిఁ బుట్టించుటయు, నమ్మహాభక్తుని గుణకీర్తనంబును, తత్పరిణయంబునుఁ దత్కుమారోత్పత్తియుం దదీయోపదేశంబువలన నచటి జనంబులు సర్వేశ్వరు నారాధించుచుండుటయు నన్నది ప్రథమాశ్వాసము. 75

74. నిత్య ఆనంద మయ స్వరూప=నాశనములేని సంతోషముతో నిండిన ఆకారము గలవాడా, త్రి జగత్ నిర్మాణ రక్షాహత ప్రత్యాసక్త మనస్క=మూడు లోకములను సృష్టించుట కాపాడుట నాశము చేయుట (అను పనియందు) తగులుకొనియున్న శక్తిగలవాడా, నిర్భర కృపా పారీణ=భరించుటకు శక్యముగాని (విస్తారమైన) దయకు ఒడ్డు చేరినవాడా, (పారీణుడనగా, ఈ యొడ్డునుండి యా యొడ్డు చేరుట, పూర్తిగా బనిచేసినవాడనుట=దయ పూర్తిగా గలవాడా). సర్వ అమర స్తుత్య ఆహ్లాద మహానుభావ=అందరి సన్మనస్కులచేత కొనియాడబడిన సంతోషముగల గొప్పవాడా; విమల శ్రుతి ఉక్త సంశీల వత్ భృత్య అభీష్ట ఫల ప్రదాన చతురా=పరిశుద్ధ వేదమునందు చెప్పబడిన ఆచారముగల సేవకులకు కోరిన వస్తువులను దయచేయుటకు ఇష్టము గలవాడా; దివ్య ప్రభా భాసురా=శ్రేష్ఠమైన కాంతిచే ప్రకాశించువాడా.

75. శ్రీమత్=శోభనకరమైన; వరప్రసాదలబ్ధ=దయచేత కలిగిన; అష్ట విధ కవిత్వ ప్రవీణ=యెనిమిది విధముల కవిత్వము చెప్పుటలో సమర్థుడును; (ఆ ఎనిమిది విధము లేవనగా: బంధ, చిత్ర, ప్రాస, యమక, లాట, దేశీయ, ముక్తిపద, నియమక కవిత్వములు.) వినయధురీణ=వినయము గలవాడును అగు; యెల్లనార్య ప్రణీతంబైన=యెల్లనార్యునిచేత చేయబడిన; కృతీశ్వరుడు=ఈ ప్రబంధము అంకితముగా చేయబడినవాడు; తత్ భక్తి సమ్ ఆచరణము=దేవుని పూజించెడు అధికమైన నడతచేత; గృతార్థుల=భాగ్యము పొందినవారినుగా చేసి; పంచత్వము నొంది=మరణము పొంది (అనగ శరీరములోని పంచప్రాణములు అనెడు ప్రాణము అపానము సమానము ఉదానము వ్యానములు చెడిపోవుట); సర్వేశ్వర ఆలయ ఉల్లంఘనము చేసి=అతిక్రమించి; తత్ ప్రతికారముగా=దీనికి బదులుగా; జగత్ ఉపకార అర్థంబుగా=జనుల మేలుల నిమిత్తము.



# ద్వితీయాశ్వాసము.

క॥ శ్రీ చిన్మయ స్వరూప చ - రాచర నిఖిలేశ్వరుండ పరమ చరిత స
త్యాచారయుతజనావన - ప్రాచుర్యసమాఖ్య ఘనవిభవ విఖ్యాతీ. 1

తే॥ అవధరింపుము తదనంతరాభివృత్త - మనఘ చరితులు సర్వేశ్వరాంఘ్రి కమల
భక్తి నిష్ఠాగరిష్ఠు లాసక్తిఁ దనర - విన్నవించెద నెలమి సవిస్తరముగ. 2

ఉ॥ అంతట సన్మనస్సరుఁడు నాప్తులు దెల్పఁగఁ దోభ్యవర్తనం
బెంతయు నాలకించి యసహిష్ణుత, నేల యితండు మత్కృతిఁ
జింతయుఁ జీరికిం గొనక యిచ్ఛకుఁ దోఁచిన వెట్టి వెట్టి వే
దాంతము లెల్లఁ జెప్పుచుఁ బ్రజావళిఁ ద్రిప్పెను నిర్భయంబుగన్. 3

క॥ ప్రజ లెట్లొప్పిరి విగ్రహ - భజనము చాలించి శూన్యభావంబునకున్
నిజ మరసి వారిఁ బనిగొని - గజగజ లాడింతుమనుచుఁ గదలెన్వేగన్. 4

క॥ చని యచ్చటి దగు నడవడిఁ - గని యోర్వఁగలేక నృపతి కలుషాత్ముండై
జనులఁ గలంచుచుఁ దనసా - హిని కెంతయుఁ గొల్లవెట్టె నిశ్రేలెల్లన్. 5

క॥ భూరి భయాన్వితులై య - ప్పౌరులు దమ యిండ్లు విడిచి పరువులు వాఱన్
ధీరుండై నిశ్చలహృద - యారూఢిం దోభ్యుఁ డొకరుఁ డచ్చట నిలిచెన్. 6

---

1. శ్రీ చిన్మయ (చిత్ మయ) స్వరూప=శ్రీకరమైన జ్ఞానస్వరూపి; చర అచర నిఖిల=కదలునట్టి కదలనట్టి సమస్తమునకు కర్త; సత్యాచారయుత జన అవన ప్రాచుర్య సమాఖ్య=సత్యమార్గమున నడిచెడు జనులను రక్షించునట్టి ప్రసిద్ధమైన పేరుగలవాడా.

2. తత్ అనంతర అభివృత్తము అవధరింపుము=తర్వాతి జరిగిన చరిత్రము వినుము; అనఘ చరితులు=పుణ్యాత్ములును; సర్వేశ్వర అంఘ్రి కమల భక్తి నిష్ఠా గరిష్ఠులు=దేవునియొక్క పాదపద్మములయందు నిశ్చల భక్తిచేత గొప్పవారును; ఆసక్తి తనరన్=ఆశపడునట్లు సంతోషముతో పూర్తిగా చెప్పెదను.

3. సన్మనస్సరుడును ఆప్తులు=తన మిత్రులు తోభ్యునియొక్క నడవడికను తెలుపగా; అసహిష్ణుత=ఓరువజాలక; ఏల అతడు మత్ కృతము ఇంతయు చీరికి గొనక=నా ఆజ్ఞ రవంతైనను లక్ష్యము చేయక; తన మనస్సునకు తోచిన మిక్కిలి వెట్టియైన బోధనలను చెప్పుచు జనసమూహమును త్రిప్పుచున్నాడు (అనగా నా మతమునుండి జనుల మనస్సులను తన మతమునకు త్రిప్పుచున్నాడు.)

4. విగ్రహములను పూజించుట చాలించి; శూన్యభావమునకు=విగ్రహములు లేని పూజల చేయు తలంపునకు ప్రజలు ఎట్లు ఒప్పిరి; పనిగొని=పూనుకొని; గజగజలాడింతుము=ఈ జనులు భయపడి వణకునట్లు చేయుదుము అని వెళ్లెను.

5. అచ్చటి దగు నడవడి=ఆ తోభ్యుని దగ్గఱ జనులయొక్క ప్రవర్తనమును; నృపతి=రాజు, చూచి ఓర్వజాలక; కలుష ఆత్ముండై=పాపబుద్ధిగలవాడై; జనులను కలంచుచు=బాధపెట్టుచు; ఇశ్రేలెల్లన్=ఇశ్రాయేలుల పట్టణమంత (ఇశ్రాయేలులు అని వ్రాయుట నాడుక); తన సాహినికి కొల్లవెట్టెన్=ఆ పట్టణము దోచుటకు తన సేనకు సెలవు ఇచ్చినాడు.

6. అప్పౌరులు భూరి భయ అన్వితులై=ఆ పట్టణములోని జనులు పెద్ద భయముతో కూడినవారై; పరువులు వాఱన్=పాఱిపోగా; తోభ్యుడు ఒకరుడు ధీరుడై=ధైర్యముతో; నిశ్చల హృదయ ఆరూఢిన్=కదలని మనస్సుతో కూడినవాడై నిలిచెను.

ఆ॥ నిలువ నప్పు డతని నిశ్చల భావంబు - మనసులోనఁ దగలఁ జెనక నోడి
బెదరుపెట్ట వేగఁ బిలిపించి యిట్లనె - నయభయముల సల్మనస్సరుండు. 7

క॥ నీవేకద మా బంగరు - దేవర యల్పము లఁటంచుఁ దెలుపుదువఁట నీ
దేవర ఘన మందువు మా - దేవర నడుమంత్ర మనుచుఁ దెలుపు దఁట ప్రజకున్. 8

క॥ పెక్కండ్ర నడతె మఱి నీ - కొక్కనికిం గిట్టకున్న నోరసిలక నీ
విక్కడ నిలుతువె చనుమిఁకఁ - దక్కక యెందేని యైనఁ దత్త్వముఁ దెలుపన్. 9

క॥ నా యాజ్ఞ కొంతయును మఱి - నీ యాజ్ఞ యొకింత గల్గెనే ప్రజలకు నౌ
లే యిది మంచిది కడు మే - లౌ మెను దూరముగఁ దలఁగు మాత్మం దెలియన్. 10

వ॥ అని రాజు కోపింపఁ, దోభ్యుఁడు నిర్భయుండై నవ్వి యనెన్. 11

ఆ॥ ఆ జనంబు మొదట యాచారము వదలు - టెట్లు రాజశ్రేష్ఠ, యిలను బుద్ధిఁ
గఱప నీ వొకరుఁడు కర్తవా, యేటికి - నింత గర్వమిప్డు నీకుఁ బుట్టె. 12

క॥ భావింప మానవుండిలఁ - దా విశ్వేశ్వరునిఁ గొలిచి ధన్యతగనుఁ గా
కీవు బలాత్కారంబున - గావించిన బోధ లేమిగానగుఁ బ్రజకున్. 13

వ॥ అదియునుంగాక నీవు రాజువు, సమస్త జనంబులు నీకుం దల్లికి బిడ్డలట్ల; తత్ప్రతి పాలనంబు సేయునెడ ధర్మాధర్మంబు లేర్పరించి యర్హదండంబు సేయునది, తద్వ్యతిరిక్తంబైన యుగ్రదండంబువలన మహా నరకంబని చెప్పుదురు. మఱియు

7. అతని నిశ్చల భావము మనసులో తగలగా=తోభ్యునియొక్క కదలని ధైర్యము (రాజుయొక్క) మనస్సునకు తట్టగా; (సందేహము పుట్టించగా) చెనక ఓడి=కలియ బడుటకు (పట్టుకొనుటకు) వెనుక దీసి; బెదరు పెట్ట=భయము పుట్టించుటకు: నయభయములు=నీతి మార్గమున భయమార్గమున (మంచిమాటలు చెప్పుచు) సల్మనస్సరుడు ఇట్లనెను.

8. మాబంగరు దేవరలు అల్పములు=బంగారుతో జేయబడిన దేవతా విగ్రహములు నీచమైనవి యనుచు; నీ దేవర ఘనము=నీ దేవుడు గొప్పవాడు అందువు, నడుమంత్రము=మొదలు లేక తర్వాత నడుమ వచ్చినదే (తెచ్చిపెట్టినది కల్పించినది.)

9. పెక్కండ్ర నడత=అనేకులు కూడి చేయుచున్న పని; గిట్టకున్నన్=ఇష్టము లేకున్న; ఓరసిలక=తొలగిపోక; తత్త్వము దెలుపన్=నీ దేవుని స్వరూపమును బోధించుటకు; తక్కక ఎందేని=నిలువక ఎక్కడికైన చనుము.

10. నా యాజ్ఞ=నా యధికారము; నీ యాజ్ఞ=నీ యధికారము; ఔలే=అవును లెమ్ము (పరిహాసము) తలగుము=తొలఁగి పొమ్ము.

12. మొదట యాచారము వదలుట ఎట్లు=ఈ జనులు పూర్వమునుండి అనుసరించిన వేదకల్పనలను ఎట్లు విడుతురు; బుద్ధి గఱప=బోధించుటకు నీవు మాత్రము అధికారము గలవాడవా.

13. భావింప=విచారింపగా; మనుష్యుడు ఈ లోకములో దేవుని సేవించి ధన్యతగనున్=తరించును; లేమిగానగున్=వ్యర్థముగా పోవును.

14. తల్లికి బిడ్డలట్లు=తల్లికి బిడ్డ యెట్లో అట్లు సమస్త జనులు నీ బిడ్డలు; తత్ ప్రతి పాలనము సేయు నెడ=వారికి రక్షణము ఒసంగునప్పుడు; ధర్మ అధర్మములు ఏర్పరించి=పుణ్యము పాపము విడదీసి; అర్హ దండము సేయునది=తగిన శిక్షను చేయవలయును; తత్ వ్యతిరిక్తమైన యుగ్ర దండమువలన=దానికి వేఱు విధమైన కఠిన శిక్షవలన (నీవు తక్కువ నేరమునకు ఎక్కువ శిక్ష చేయునెడల) పెద్ద నరకము కలుగునని చెప్పుదురు. (పెద్దలు కర్త).

సప్తాంగంబులం గొదవపడక శక్తిత్రయ చతురుపాయ షడ్గుణాది లక్షణంబుల ధర్మంబు దప్పక రాజ్యంబు సేయునది. అందుఁ బారమార్థికవిచారుండేనియుఁ బంకంబునం బంకేరుహంబు చందంబున విషయంబులం జెందక నష్టానష్ట వివేచనంబు చేసి దృశ్యంబు లెల్ల నష్టంబులుగాఁ దెలిసి, యదృశ్యుండును నప్రమేయుండును నవికల్పుండును నవాఙ్మనసగోచరుండును నగు సర్వేశ్వరుం డొక్కరుండె శాశ్వతుండుగా నెఱింగి, యతనిం జేరుటకు వరప్రసాదంబు వడసి సత్సాంగత్యంబున శ్రవణ మనన ధ్యానంబులవలన సకల భూత దయాపరుండై, దానధర్మపరోపకారంబులు నడపుచు, జాతబాల్యకౌమారయౌవనవార్ధక్యమృత్యు దుఃఖంబులయెడ సమభావుండై, యింద్రియంబులం బరవశుండుగాక కామాద్యరిషడ్వర్గ

---

మఱియు సప్తాంగములతోను కొదవపడక=ఇందులో నేదియును తక్కువ కాకుండ; శక్తిత్రయముతోను చతురుపాయములతోను షడ్గుణములతోను మొదలైన లక్షణములతోను; ధర్మము తప్పక=న్యాయరీతిని రాజ్యము చేయవలెను.

సప్తాంగములు=రాజునకు ఏడు అంగము లుండవలెను. 1. స్వామి=రాజు, 2. అమాత్యుడు=మంత్రి, 3. సుహృత్తు=స్నేహితుడు, 4. కోశము=ధనము, 5. రాష్ట్రము=దేశము, 6. దుర్గము=కోట, 7. బలము=సేన, ఇవి సప్త అంగములు=ఏడు సాధనములు.

శక్తిత్రయ=రాజునకు మూడు శక్తులుండవలయును. 1. ఉత్సాహశక్తి=సంతోషము, 2. మంత్రశక్తి=మంత్రులు చెప్పు నాలోచన. 3 ప్రభుశక్తి=రాజు బలము.

చతురుపాయ=రాజునకు నాలుగు ఉపాయములు ఉండవలెను. 1. సామము=మంచి మాటలాడుట, 2. భేదము=వారిలో వారికి భేదము పుట్టించుట, 3. దానము=లోపడనివారికి ధనమిచ్చుట, 4. దండము=శిక్షించుట.

షడ్గుణములు=రాజునకు ఆరు గుణములు ఉండవలెను. అనగా, సంధి, విగ్రహము, యానము, ఆసనము, ద్వైధీభావము ఆశ్రయము.

అందు ఈప్రకారముగా రాజ్యము చేయుసమయమందు; పారమార్థిక విచారుడేనియు=సర్వేశ్వరుని తెలిసికొనునట్టి ఆలోచన గలవాడైనయెడల; పంకమున పంకేరుహము చందమున=బురదలో తామర రీతిగా (పంకే రుహము=పంకమునందు పెరుగునది అనగా తామర) విషయముల చెందక=ఇంద్రియ సౌఖ్యములను చేరక; నష్ట అనష్ట వివేచనము=ఏది నశించును ఏది నశింపదు అని ఆలోచనము చేసి; దృశ్యంబులెల్ల=కంటికి గనబడునవి అన్నియు నశించువానినిగా తెలిసి; అదృశ్యుడును=కనబడనివాడును; అప్రమేయుడు=వర్ణించుటకు వలనుగానివాడును; అవికల్పుండును=మార్పులేనివాడును; అవాఙ్మనసగోచరుడు (అ వాక్ మనస్)=మాటలకు మనస్సులకు అందనివాడును; అగు సర్వేశ్వరుడు డొక్కరుడె శాశ్వతుండుగా=ఎల్లపుడు నుండువాడని ఎఱిగి; వరప్రసాదము వడసి=దయను పొంది; సత్ సాంగత్యమున=మంచివారలతో స్నేహము కలిగి; శ్రవణ మనన ధ్యానంబులవలన=వినుటచేతను మనస్సులో చింతించుటచేతను ధ్యానము చేయుటచేతను; సకల భూత దయాపరుండై=సకల మనుష్యులమీద దయగలవాడై; దాన ధర్మ పర ఉపకారంబులు=పేదవారికి సహాయము చేయుట; పుణ్యకార్యములు చేయుట, ఇతరులకు ఉపకారము చేయుట, (ఇట్టి పనులు) నడపుచు; జాత బాల్య కౌమార యౌవన వార్ధక్య మృత్యు=పుట్టుట, పసితనము, బాల్యమునకును యౌవనమునకును నడిమి దశ, వయస్సు వచ్చినకాలము, ముసలితనము అను దుఃఖములయందు సమభావుడై=హెచ్చు తగ్గులు లేని తలంపుగలవాడై; (అనగా పుట్టిన నెట్టి సంతోషమో చచ్చినను అట్లే, యౌవనములో నెంత సంతోషమో ముసలితనములోను నంతటి సంతోషము ఇట్లు భేద బుద్ధి లేకుండుట;) పరవశుడుగాక=ఇంద్రియములకు లొంగిపోక; కామ ఆది అరి షట్ వర్గమున చి

బునం జిక్కఁబడక యహంకారంబు వదలి, శమదమాన్వితుండై వెలసి, కృతార్థుం
డు గావలయునని యానతిచ్చిన విని పశ్చాత్తాప్తుండై సల్మనసరుండు "మహాత్మ
బంధమోచనంబులైన భవదీయవచనంబులు శ్రవణానందంబుగా నాకర్ణించి ధన్యు
డ నైతి యుష్మత్ప్రభావం బెఱుంగనేరక యపరాధంబు చేసితిం గటాక్షిం
పవే" యని యనేక ధనకనకాంబరాభరణాదులు ముందట నిడి పరిగ్రహిం
చునంతకుం బాదంబుల వ్రాలి వీడ్కొలిపి కొన్నిదినంబులు ధర్మమార్గంబున రా
జ్యంబు సేసి పంచత్వంబు నొంది కృతార్థుండయ్యెన్. 14

సీ॥ ఇట్లు తోభ్యుం డమ్మహేంద్రునివలన న-యాచితంబై చేరినట్టి ద్రవ్య
మర్థులకై కొల్లలాడంగ నిసి తన-ప్రియబంధువైన గబేలు డచటి
కరుదేర నాతని కర్థులకును బోలె-నర్పింపఁ బోయిన నతఁడు తనకు
నుచితంబు బొసంగిన నొల్ల నప్పిచ్చిన-గైకొందునన నట్లుగాక యనుచు
తే॥ నడిగినంత వడ్డియులేక యప్పుగాఁగ-నొసఁగి పత్రంబు గైకొని యుర్విఁ దన్ను
నాశ్రయించిన వారికి దైవతత్త్వ-మింపుగాఁ దెల్పుచును జరియించుచుండె. 15

క॥ ఎల్ల జనంబులు తమ తమ-యుల్లము లలరంగ భక్తియుక్తి దలిర్పన్
జిల్లర వేల్పులఁ గొలువఁగ-నొల్ల మనుచుఁ దోభ్యుఁ జేరి యుండిరి కడకున్. 16

---

క్కు పడక=కామము మొదలగు పగోధులగు ఆరు చెడ్డ గుణములకు లోనుగాక; (అరిషడ్వర్గము లేవనగా: కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యములు) శమ దమ అన్వితుడై వెలసి=అంతరింద్రియముల నిగ్రహము బాహ్యేంద్రియముల నిగ్రహము పొందినవాడై ఉండి (అంతః ఇంద్రియములు=శరీరములోన నుండు ఇంద్రియములు అనగా, మనసు బుద్ధి అహంకారము చిత్తము; బహిః ఇంద్రియములు=శరీరము బైటనుండు ఇంద్రియములు అనగా చెవులు ముక్కు నాలుక నేత్రము చర్మము) కృతార్థుండు=తరించినవాడు (మోక్షము పొందినవాడు) అయిపోవలెనని తోభ్యుడు బోధించునది సల్మనసరుడు పశ్చాత్తాప్తుడై=(పశ్చాత్=చెడ్డ పని చేసినతర్వాత, తప్తుడు=అయ్యో తప్పు చేసితిని అని విచారపడువాడు) దుఃఖపడినవాడై చెప్పినదేమనగా; బంధ మోచనంబులైన భవదీయ వచనంబులు=సంసార బంధములు (కట్టిన కట్లు) విడి పోవునట్లు చేయు మీ మాటలు; శ్రవణ ఆనందంబుగా ఆకర్ణించి ధన్యుడను అయితిని=చెవులకు ఇంపుగా విని భాగ్యవంతుడనైతిని (నాకు కావలసిన వస్తువు దొరకినది); యుష్మత్ ప్రభావము ఎఱుగలేక=మీ గొప్పతనము తెలిసికొనలేక; అపరాధము=తప్పుపని చేసితిని. కటాక్షింపవే=దయ గలిగిన చూపుతో కరుణించుము; అని అనేక ధనకనక అంబర=వస్త్రములు ఆభరణ ఆదులు=మొదలైనవి ముందట నిచ్చి; పరిగ్రహించునంతకు=తోభ్యుడు ఆ ధనకనకాది వస్తువులను పుచ్చుకొనుదాక; పాదముల వ్రాలి=కాళ్లమీద పడి వీడ్కొలిపి=నీ ఇంటికి పొమ్మని పంపి; పంచత్వము=మరణము.

15. తోభ్యుడు ఆ మహేంద్రునివలన=రాజునుండి; అయాచితంబై చేరినట్టి=అడుగకుండా దొరకిన ద్రవ్యము; అర్థులకై కొల్లలాడగ=కోరినవారికి ఇచ్చివేయుచుండగా; విని తన బంధువైన గబేలుడు వచ్చినప్పుడు; అర్థులకు బోలె=బిచ్చగాండ్రకు నిచ్చినట్లే నతనికి; అర్పింపబోయిన=ధనమీయ బోగా; ఉచితంబు ఒసంగిన నొల్లను=ఊరకయే ఒసంగునెడల ఒప్పను; అప్పిచ్చిన గైకొందునన=అప్పుగా నిచ్చునెడల పుచ్చుకొందునని గబేలుడు చెప్పగా; అట్లుగాక=అలాగే కానిమ్ము అనుచు అడిగిన దంత వడ్డిలేక అప్పుగా నిచ్చి చీటికి వ్రాతమూలమున పుచ్చుకొని ఈ లోకములో తన్ను (తోభ్యుని) చేరిన వారలకు (జ్ఞానబోధకై వచ్చినవారలకు) సర్వేశ్వరుని నిజస్వరూపమును బాగుగా తెల్పుచు తిరిగిపోయెను.

16. ఉల్లము అలరంగ=మనసున సంతోషింపగా; భక్తి యుక్తి తలిర్పన్=భక్తి యోచనలు ప్రకా

ఉ॥ అంతట సల్మనస్సరున కాత్మజుఁడై తగు సెన్నకేరి దా
నెంతయు రాజ్యభారము వహించి తుదిం దన తండ్రి గన్న స
చ్ఛాంతి యెఱుంగలేక తొలిజాడ వహించుచు నంతకంబుఁ గా
లాంతక వృత్తిచేఁ బ్రజల నార్తిమెయిన్ దురపిల్లఁ జేయఁగాన్. 17

ఉ॥ సత్త్వరలీల నోడకుఁడి సాధ్వసమేటికి నంచు వారి దీ
నత్వ మెడల్చి యన్నవసనంబులఁ దృప్తులుగా నొనర్చి పం
చత్వము నొందినట్టి జనసంఘము నెల్ల సమాధి చేయుచున్
దాత్త్వికభావ మేమఱక ధార్మికవృత్తిని దోభ్యుఁ డుండఁగన్. 18

మ॥ తనచేఁ బీడితులైన యట్టి ప్రజలన్ దాక్షిణ్య భావంబునం
గని యూరార్చుట సెన్నకేరి విని వీఁకం గ్రోధరక్తాక్షుఁడై
యనుమానింపక యిల్లు సూఱగొని వే యా తోభ్యునిం బట్టి తె
మ్మనె నిమ్మాటలు కొన్ని పౌరతతిచే నాలించి భావంబునన్. 19

ఉ॥ ఇట్టి మహాపరాధి ఖలుఁ డింక జయింపఁడు కొద్దిప్రొద్దులం
గిట్టుట సిద్ధమైన మదికిం గినుఁ గోపము తొట్టినట్టి యి
ప్పట్టున వానికై నెదుగు పట్టఁ దటాలునఁ జావు పొందుదున్
గట్టిగ వానిఁ జూడఁ గొఱగాదని వేగ నిగూఢతాగతిన్. 20

శింపగా; అందరు మనుష్యులు చిల్లర వేల్పుల కొలువగ నొల్లము=ఇతర దైవములను పూజించుటకు ఇష్టపడము అనుచు.

**17.** అప్పుడు సల్మనస్సరునియొక్క ఆత్మజుండై=కొమారుడనతగిన సెన్నకేరి యనువాడు (పూర్వవేదగ్రంథములో ఈ రాజుయొక్క పేరు సెనకెరిబుడుగాని సెన్నకేరి యను పేరు కాదు.) రాజ్యభారము వహించి=రాజ్యము చేయు పని వహించి (సల్మనస్సరుడు మరణించిన పిమ్మట వాని కొడుకు రాజ్యమునకు రాజై) తన తండ్రి తుదిగన్న సచ్ఛాంతి (సత్ శాంతి)=తన తండ్రి చివరి కాలములో పొందిన సుఖమును ఎఱుగలేక; తొలిజాడ వహించుచు=పూర్వ రీతిని ప్రవర్తించుచు; అంతకంబుఁ=తన తండ్రికంటె; కాలాంతక వృత్తిచే=కాలాంతకుడు నటించినట్లుగా (కాలాంతకుడు=చావు రప్పించువాడు;) ఆర్తిమెయిన్=దుఃఖములచేత; ప్రజలు దురపిల్ల=బాధ పడునట్లు చేయగా.

**18.** తోభ్యుడు సత్త్వరలీల=మిక్కిలి వేగముతో; ఒడకుడి సాధ్వసమేటికి=భయపడవలదు, ఎందుకు మీకు భయము అంచు; వారి దీనత్వము ఎడల్చి=ఆ ప్రజల దుఃఖమును పోగొట్టి; అన్నవసనంబులన్ తృప్తులుగా ఒనర్చి=అన్నము వస్త్రముల ఇచ్చుటచేత జనులను తృప్తి పొందినవారినిగా చేసి; మరణము పొందిన జనుల సమూహము సమాధి చేయుచు; తాత్త్విక భావము ఏమరక=దేవసంబంధమైన మనస్సు విడువక; ధార్మికవృత్తిని=పుణ్యమార్గమున ఉండగా.

**19.** సెన్నకేరి అను రాజు తనచేత పీడితులైన=పీడింపబడిన ప్రజలను (తోభ్యుడు) దాక్షిణ్యభావంబున=దయ గలిగిన మనస్సుతో చూచి ఆదరించుట విని; వీకన్ క్రోధ రక్త అక్షుడై=కోపముచేత ఎఱ్ఱపడిన కన్నుల గలవాడై; సందేహింపక, తోభ్యుని ఇల్లు చూఱగొని=దోచుకొని వానిని పట్టి తెమ్మని చెప్పగా తోభ్యుడు ఆ మాటలు; పౌరతతిచే=పురములోని జనులవలన విని;

**20.** (తోభ్యుడు చెప్పునది:) ఇట్టి మహాపరాధి ఖలుడు=ఇట్టి పెద్ద తప్పు చేసినవాడైన దుర్మార్గుడు; ఇంక జయింపడు=ఇంకమీద బాగుపడడు; కొద్దిప్రొద్దులం గిట్టుట సిద్ధమైనను=నేను కొద్ది నాళ్లలోనే చ

క॥ కులసతిని సుతునిఁ గైకొని - తొలఁగినఁ బరికించి చూచి తోభ్యునిఁ గనలే
కిలు చూఱవెట్టి సుతుచే - నలువదియేనాళ్ల కతఁడు నష్టము నొందెన్. 21

చ॥ అటు వెనుకం దదాత్మభవుఁ డారయ వానికి వన్నె వెట్టువాఁ
డటమట మాఱి తోభ్యుఁడటు లల్గినచోఁ దన తండ్రి చేటు నొం
దుటఁ దెఱవంగ నాతనికి దోఁపు వెస న్మగుడంగ నిచ్చియుం
గుటిలత మానలేక యతిగూఢతఁ హింసలు సేయు నెంతయున్. 22

తే॥ ఆ దురాత్ముఁడు తుదఁ జెందిన నరకాది-దుఃఖము వివరింప నలవి మర్త్యునకు నగునె
చేసినప్పటివలె నుండ దా సుఖంబు-విస్తరింపఁగ నేటికిఁ బ్రస్తుతమున. 23

తే॥ అపుడు తోభ్యుఁడు పరులు మున్నపహరించి-మగుడ నొసఁగిన ధనము సనుస్త మరసి
ధర్మ మొనరింప కీఁక దీని దాఁపనేల-కోలుపోయినఁ జింతకు మూల మగును. 24

చ॥ అనియునుఁ గాక మున్ను బుధు లర్థ మనర్థక హేతు వంచుఁ బ
ల్కుదు రది సంగ్రహించునెడ గుప్తముగాఁ బదిలంబు సేయుచో
నరియు వ్యయంబు చేయుతఱి నగ్ని ధరాధిప చోర బాధలం
గదిసినవేళ నెక్కుడి సుఖంబు జనాళికి నట్లు గావునన్. 25

---

చ్చుట నిజమైనప్పటికిని; మదికి కడు కోపము తొట్టినట్టి యీ పట్టున=వాని మనస్సునకు మిక్కిలి కోపము కలిగినటువంటి యీ సమయమందు; వానికి ఏను ఎదురు పడ్డ=ఆ చెన్నకేరికి నేను కనబడినయెడల; ఇతటా లున=వెంటనే చావు పొందుదును; వానికి చూడ కొలగాదు=ఇష్టము లేదు అని వేగముగా; నిగూఢతాగతిన్ =ఎవ్వరికిని గనబడకుండ.

21. భార్యను కొడుకును వెంట వేసికొని పోయినపిమ్మట; చెన్నకేరి అను రాజు తోభ్యుని వెదకి చూడక; వాని ఇల్లు చూఱవెట్టి=దోచుకొని; 45 దినములకు తన కొడుకుచేత; నష్టము నొందెన్=చంపబడెను.

22. తత్ ఆత్మభవుడు=మరణము పొందిన రాజుయొక్క కుమారుడు; అరయ=విచారింపగా; వానికి వన్నె వెట్టువాడు=తండ్రికి మెఱుగు తెచ్చువాడు (తండ్రికంటె దుర్మార్గుడనుట); తోభ్యుడు అటమట మాఱి అల్గినచోన్=దుఃఖముచేత ఈ రీతిగా కోపపడినందున; తన తండ్రి చేటు నొందుట వెఱవంగ=తన తండ్రి పొందిన మరణము తాను పొందుదునని వెఱచుచుండగా; తోభ్యునకు దోపు వెసన్ మగుడగ=ఇల్లు చూఱపెట్టి దోచుకొనిన ధనము వేగముగా తిరిగి యిచ్చి; కుటిలత మానలేక=తన దుష్టచేష్టలు చాలింప చాలక; యతిగూఢతన్=మిక్కిలి రహస్యముగా; హింసలు=బాధలు కలిగించెను. (తాను తన తండ్రిని చంపిన లాగు తన్నును చంపుదురను భయముచేత రహస్యముగా బాధలను కలిగించెను.)

23. తుద చెందిన నరకాది దుఃఖము=కడపట పొందిన నరకము మొదలైన దుఃఖములను; ఆ సుఖము చేసినప్పటివలె నుండదు=ఏదైన తప్పు పని చేసినప్పుడు మనస్సునకు సంతోషముగా నుండును, గాని ఆ సంతోషము ఎల్లకాలము నుండదు; విస్తరింపగ నేటికి=ఏల అధికముగా చెప్పవలయును.

24. పరులు మున్ను అపహరించి మగుడ ఒసగిన ధనము=విరోధులు మునుపు దొంగలించి మగల నిచ్చిన ధనము అరసి; ధర్మము ఒనరింప=ధర్మకార్యములక్రింద వ్యయము చేయక; దాపనేల=ఈ సొత్తును దాచిపెట్టుట యెందుకు; కోలుపోయినను చింతకు మూలమగును=మగల ఎవ్వరైన దొంగలించునెడల దుఃఖమునకు కారణమగును,

25. అర్థము అనర్థక హేతువు=ధనము కీడునకు మూలమని పూర్వమున బుధులు చెప్పిరి; అది సంగ్రహించునెడ=ఆ ధనము సంపాదించునప్పుడును; గుప్తముగా పదిలంబు చేయుచోన్=ఎవ్వరికిని కనబడనట్లు భద్రపఱచునప్పుడును; అది వ్యయము చేయుతఱి=అది సెలవుచేసి ఖర్చుపెట్టునప్పుడును; అగ్ని ధరాధిప చోర బాధల గదిసినవేళ=నిప్పులో కాలినప్పుడును, రాజులు బలవంతముగా దీసికొనినప్పుడును, దొంగలవల్ల అపహరింపబడినప్పుడును జనులకు సుఖ మెక్కడిది.

చ॥ ఇహము గణింపలేని మన కీఁకల ద్రవ్యములోనఁ గానియు
న్నహి నిటు నిల్పరా దనుచు వర్తకులం బిలువంగఁ బుణ్యమా
నహమున బీదసాదలకుఁ దండుల సూపఘృతాదికంబులో
బహు విధ భోజ్యవస్తువు లపారముగాఁ గొని విందు చేయఁగా. 26

సీ॥ అలచొక్క సన్నబియ్యపు టోగిరములతో - బంగారు వన్నె సూపములతోడఁ
బచ్చఁ గందని శాకపంక్తులతోఁ బాయ - సములతో నిక్షుఖండములతోడఁ
బెక్కువిధంబుల పిండివంటలతోడఁ - జారులతో బంచదారతోడఁ
బరిపక్వ సహకార ఫలరసంబులతోడఁ - బానకంబులతోడఁ బాలతోడ

తే॥ వెన్నతోఁ బెర్గుతోడను జున్నుతోడ - నూరుఁగాయలతో సుగంధోదకముల
తోడఁ దాంబూలములతోడ వేడుకలర - నిత్య సంతర్పణంబులు నెఱపుచుండ. 27

తే॥ బహు పదార్థోత్కరములు భవనము సేరు - నంతలోఁ దోభ్యుఁడు నిజనందనుని జీరి
బంధు మిత్ర సుహృత్ జనులట్ల విందుఁ - గుడువఁగవలయు యాచకగోష్ఠి నేఁడు. 28

తే॥ సత్వరముగఁ జని పురము నందునందుఁ - గనిన యార్థుల నిందుల కనుపుమనఁగ 29
వల్లెయని దోభ్యకొమరుఁడు వడిగఁ బైలు - దేరి యన్వేషణము సేయఁ దిరుగుచుండ.

క॥ శిరమున రక్తము వెడలఁగ - ధరణిం బొరలుచుఁ బొరలుచుఁ దనదు యుసురులం
దొరఁగిన యిశ్రేలుం గని - పరితాపము నొంది యిరువు కరిగి గని పిత్రున్. 30

చ॥ అనుపమ వేగలీల భవదాజ్ఞ శిరంబునఁ బూని పోయి నేఁ

---

26. ఇహముఁ గణింపనట్టి=ఈ లోకసుఖమును లెక్కచేయని (ఇష్టపడని) మనకు ఈఁగల ద్రవ్యములోఁ గానిదబ్బుకూడ వహిఁ నిల్పరాదు=ఈ విధముగా వ్యయము చేయక ఉంచుకొనగాదు, అనుచు వర్తకులను=అంగళ్లు పెట్టి బియ్యము మొదలగు వస్తువులను అమ్మ వ్యాపారులను పిలిపించి; పుణ్యమా అహమున=పండుగ దినమునందు; తండుల సూప ఘృత ఆదికంబులో=బియ్యము పప్పు నేయి మొదలగు; అనేక విధములగు ఆహార వస్తువులను; అపారముగా కొని=ఎక్కువగా వర్తకులయొద్ద వెలకుకొని; విందు చేయుటకు.

27. అలచొక్క సన్నబియ్యపు ఓగిరములతోఁ=ప్రశస్తమైన మంచి సన్న బియ్యపు అన్నముతో; బంగారు వన్నె కలిగిన (పచ్చని) సూపములతో=పప్పులతో; పచ్చ కందని=శాకపంక్తులతో పసరు రంగు కంది (తగ్గి) పోని కూరగాయలతో; ఇక్షు ఖండములతో=చెఱకు ముక్కలతో; పిండివంటలతో=పిండితో వండిన గారెలు బూరెలు మొదలగు వానితో; చారులతో=చింతపండు రసముతో; పరిపక్వ సహకార ఫలరసములతో=చక్కగా పండిన తియ్య మామిడిపండ్ల రసములతో; పానకంబులతో=బెల్లము కరగించి కలిపిన నీళ్లతో; పెర్గు=పెరుగు; సుగంధోదకములతో=వట్టివేళ్లు మొదలగువానిచే పరిమళించు మంచి నీటితో; నిత్యసంతర్పణములు=ఎల్లప్పుడును తృప్తిగా అన్నము పెట్టుట (ఇంక నాకు వలదని తృప్తిపొందువఱకు. కావలసిన భోజనము పెట్టుట సంతర్పణము.) నెఱపుచుండ=చేయుటకు.

28. పదార్థ ఉత్కరములు=వస్తువుల సముదాయము; భవనము సేరునంతలో=తోభ్యుని యిల్లు చేరునప్పుడు; వాడు తన కుమారుని పిలిచి; బంధు మిత్ర సుహృత్ జనులట్ల=బంధువులును స్నేహితులును మంచివారలును తినునట్లు; నేఁడు యాచకగోష్ఠి కుడువఁగవలయును=ఈ దినము బీదవారల సమూహము భుజింపవలయును.

29. పురమున అందునందు=పురములో నక్కడక్కడ చూచిన; ఆర్థులను=బీదలను; ఇందులకు అనుపుము అనగా=ఇక్కడికి పంపుము అనగా; వలె=మంచిది; అన్వేషణము సేయ=వెదకుచు తిరుగుచుండగ.

30. శిరమున=తలనుండి రక్తము పారగా; దనదు ఉసురులను తొరగిన యిశ్రేలును గని=ప్రాణము విడిచిపెట్టు యిశ్రేలును చూచి; యిరువు కరిగి=ఇంటికి పోయి తండ్రిని చూచి.

గొనకొని చూడఁ జూడ నొక గొందిని నెవ్వఁడొ బల్మిఁ జంపి వై
చినఁ బడి యున్నవాఁ డనుచుఁ జెప్పినఁ జిత్తములోఁ గలంగి పా
యనిధృతిఁ దోభ్యుఁడే యరిగె నత్తఱి విందును మాని చెచ్చెరన్. 31

తే॥ వనపుచు నుపవాసము నుండి వినయ మొప్ప - శవము కడ కేగి గాంచియు వివిధగతులఁ
గడఁగి పాలకోద్యోగుల కంటఁబడక - యొంటిమెయిని గాత్రంబును గొనుచు వెడలి. 32

క॥ చనిచని వేగము దాఁచి - ఖననము గావించి వచ్చి కడు ధీరత మ
జ్జన భోజనాది కృత్యము - లొనరించి సధర్మవృత్తి నుండఁగ నంతన్. 33

ఉ॥ చుట్టము లెల్ల నీ తలఁపు చొప్పడ దింతయు రాజకృత్య మి
ప్పట్టున దీనికి న్వగచి పాతిడ నట్టి దురాత్మ కెంతయుం
గిట్టక గూఢతాగతి నకృత్యము సేయఁగ నేమి వానితో
నిట్టి విరోధ మేటికిది యిచ్చఁ దలంపకుమయ్య యిత్తఱిన్. 34

క॥ కైకొనుము మా మనవి నీ - వా కృత్యంబింక మానఁగా దగు నని వా
రేకముగఁ బలుక ననియెన్ - సాకల్యముగాఁగ బంధుజనములతోడన్. 35

శా॥ ఆ కష్టాత్ముఁ డెఱింగి మీఁద ననుఁ జేయం బూను కృత్యంబు నా
యీ కష్టంబుఁ దలంచి పల్కితిరి గాదే యీశ్వరాజ్ఞేతరం

---

31. అనుపమ వేగలీల=ఇంతటిదని చెప్ప వీలులేని వడితో; భవత్ ఆజ్ఞ శిరంబున పూని=నీ సెలవును తలమీద దాల్చి (సెల వేర్చుటకు పోయి); ఒక గొందిని=ఒక్క పల్లములో ఎవ్వడో బలవంతముగా మరణమై పడియున్నాడని చెప్పగా; పెద్ద తోభ్యుడు చిత్తములో కలంగి=దుఃఖపడి; పాయని ధృతి=విడువని ధైర్యముతో (సాధారణముగా దుఃఖసమయములో ధైర్యముగలవారు ఉండరు, ఇతడట్లుగాక ధైర్యము వహించి.)

32. వనపుచు=దుఃఖపడుచు ఉపవాసముగానుండి; వివిధగతుల కడగి పాలక ఉద్యోగుల కంటపడక=అనేక విధములుగా యత్నించి రాజుయొక్క సేవకులకు కనపడకుండ; యొంటిమెయిని గాత్రము గొనుచు=ఒంటరిగా కళేబరము మోసికొని (ఆ మనుష్యుడు రాజు కట్టడప్రకారము చంపివేయ బడినందుచేత వానికి భూస్థాపనము లేదు, తాను రాజుచేత శిక్షింపబడుదునను భయముచేత రాజు నౌకరులకు కనపడకుండ తోభ్యుడు ఆ పీనుగను భూస్థాపనము జేయవలసియుండెను.)

33. ఖననము=భూస్థాపనము చేసి; కడు ధీరతన్=మిక్కిలి ధైర్యముతో; మజ్జన భోజన ఆది కృత్యములు=స్నానము భోజనము మొదలైన పనులు ఒనరించి; సధర్మవృత్తిన్=పుణ్యమార్గమున ఉండగా;

34. చుట్టములెల్ల=బంధువులు వచ్చి చెప్పినదేమనగా: నీ తలంపు చొప్పడదు=నీవు తలంచు పనులు సరిపడవు; ఇంతయు రాజకృత్యము=ఈ జరుగునది (మనుష్యుని చంపివేయుట) రాజు చేసిన పని; ఇప్పట్టున దీనికి వగచి పాతు ఇడన్ అట్టి దురాత్మకు ఎంతయు గిట్టదు=ఇప్పుడు నీవు దీనికి దుఃఖించి సమాధి చేయుట ఇట్టి దుర్మార్గునకు ఎంతమాత్రము సరిపడదు; గూఢతాగతిన్ అకృత్యము చేయగ ఏమి=రహస్యముగా తగనిపనిని చేయుట యెందుకు; వానితో ఇట్టి విరోధము ఏమిటికి=వానితో ఇట్టి వైరము యెందుకు; ఇది యిచ్చన్=ఇది (రాజునకు ఇష్టములేని పని) మనస్సులో తలంపవద్దు.

35. మా మనవి నాలకింపుము; ఆ కృత్యము=చంపబడినవారలను సమాధి చేయుట; ఇంక మానగా తగును=ఇక చాలించవలయును అని వారలు బలుకగా; తోభ్యుడు సాకల్యముగా=యావత్తు (ఏమియు మిగులకుండ) అనియెను.

36. ఆ కష్టాత్ముడు=ఆ చెడు బుద్ధిగల రాజు; మీద నను చేయ బూను కృత్యంబు=ఇంకమీద నాకు చేయబోవు పనిని; నా యీ కష్టము=నేను ఇప్పుడు పడిన కష్టము మీరు తలచి పల్కిరిగాని; ఈశ్వర ఆజ్ఞ

బాకల్లాఁడునె నన్నుఁ గీడ్పఱుప వాఁడా కర్త సత్కృత్యముల్
జోకం జేయుచు నెన్నఁగాఁ దగునె యాలో నాఁకలిం దప్పియున్. 36

వ॥ అనుచు యథాక్రమంబున గర్తవ్యంబుగఁ దలఁచిన కార్యంబుల నిర్వర్తించుచుండు
నెడ. 37

ఉ॥ కూర్పఁగలేదు వీసమును గొల్ల యొనర్చెను కాని యూహమై
నేర్పఱుపం దరంబె వ్యయ మింతని యంతని నిత్యభూరి సం
తర్పణ మొనర్పఁగ దినక్రమరీతిఁ బదార్థశూన్యమై
మార్పఁగ నింట నొక్క యణుమాత్రముఁ గన్పడదయ్యె నెంతయున్. 38

క॥ లేమి కడు మించెఁ దోభ్యున-కేమనఁగా వచ్చు దేవచిత్తంబునకున్
నేమంబు పరీక్షించును-స్వామి జగతి నెంత పుణ్యవర్తనులైనన్. 39

సీ॥ అటు పేదవడియుండియైనఁ-గల్గినమాత్ర-మతిథులతోఁ బంచి యారగించు
నలఘు ప్రియోక్తుల నాత్మరంజిలఁ బల్కుఁ-మది నెట్టి హీనునితోడనైన
సర్వేశ్వరధ్యాన సంధాన భావమే-మఱఁ దదొక్క నిమేషమాత్రమైన
నిత్యకర్మవిధాననియమంబుఁ దప్పక-నడుచును గాలంబు గడవనీక
తే॥ పరఁగ నొరులకునైన యాపదలు తనకు-నట్ల భావించి తొలఁగింప నాత్మఁ దలఁచు
నెంతయును బుణ్యశీలుఁడై సంతతంబు-నప్పురంబునఁ దిరుగు నహర్నిశంబు. 40

---

ఇతరాము=దేవుని సెలవులేనిది; ఆకు అల్లాడునే=చెట్టున నున్న యొక ఆకైనను కదలునా; నన్ను కీడు పఱుప వాడా కర్త=నాకు కీడు చేయుటకు ఆ రాజు కర్తగా నున్నాడా (కాదు, దేవుడే యేపనికైనను కర్త); సత్కృత్యముల్ జోకం=మంచి పనులు బాగుగా చేయుచు; ఆలోన్=ఆ మంచి పనులను చేయుచున్నపుడు ఆకలిని దప్పియు తలంపదగదు.

37. యథాక్రమంబున=తన వాడుకప్రకారమున; కర్తవ్యంబుగా=చేయవలసిన ధర్మములుగా తలంచిన కార్యములను చేయుచుండగా.

38. కొల్ల ఒనర్చెనుగాని వీసమును కూర్పగలేదు=పోరాశముగా దానమిచ్చెనుగాని వీసమంతయైనను కూడబెట్టుటలేదు (ఒక నాణెములో 16 వ వంతు వీసము. రూపాయలో అణా వీసమే); వ్యయము ఇంతని అంతని ఊహమైన్ ఏర్పఱుపం తరంబె=ఇచ్చిన ధనము ఇంతని అంతని ఆలోచించి లెక్క పెట్టుటకు సాధ్యమగునా; నిత్యభూరి సంతర్పణము ఒనర్పగా=ఎల్లప్పుడును గొప్ప అన్నదానము చేయుచురాగా; దినక్రమరీతిన్=దినముల వెంబడి; పదార్థ శూన్యమై=భోజనవస్తువులు లేకుండపోయి; ఇంట ఒక అణు మాత్రము=ఇంటిలో ఒక చిన్న వస్తువైనను; మార్పగ కన్పడదయ్యెన్=దానిని మార్చి సొమ్ము తెచ్చుటకు (కుదువ పెట్టుటకు) కనపడలేదు.

39. తోభ్యునకు లేమి కడున్ మించెన్=దారిద్ర్యము మిక్కిలి అతిశయమయ్యెను; దేవచిత్తమునకు ఏమి అనవచ్చును=దేవచిత్తమునకు విరోధముగా మాటాడవచ్చునా (దేవచిత్తముప్రకారము అంతే జరుగును గనుక దీనికి విరోధించకూడదు); ఎంత పుణ్యవర్తనులైనన్=మనుష్యులు ఎంత పుణ్యాత్ములై యుండినను దేవుడు ఈ జగతిని వారల నేమము పరికించును=విమర్శించును. (ఎంతమంది వచ్చినను లేదనక అన్నము పెట్టెదను, ఉన్న సొమ్మంత అన్నదానమునకై సెలవు చేసెదను అనునదియే తోభ్యుని నేమము, నియమము, వ్రతము.)

40. అటు పేదవడి యుండియైనను కల్గినమాత్రము=ఈ రీతిగా దరిద్రుడై యున్నను తనకు నున్న దానినే; అతిథులతో పంచి ఆరగించున్=తన యింటికి భోజనమునకు వచ్చువారితో భాగములు చేసికొని తినును; అలఘు ప్రియ ఉక్తులన్ ఆత్మ రంజిలన్=విస్తారమైన ప్రేమగల మాటలతో (వచ్చిన అతిథుల)

మ॥ విమలాచారవిచారమందుననిఁ దా నెవ్వేళ వర్తించుచున్
సమభావంబున నెచ్చుగాఁ దిరుగ నా సర్వేశ్వరుం డొక్కనాఁ
డు మనఃస్థైర్యముఁ గన్గొనం దలఁచినాఁడో ప్రేత సంస్థాపన
శ్రముఁడై యొక్క నిశీథమందుఁ గడు నిద్రాభారదుర్వారుఁడై. 41

క॥ తలవాకిటఁ దిన్నెపయిన్ - నిలుపోపఁగ లేక వ్రాలి నిద్రించి వెసం
దెలతెల వేగిన యంతటఁ - దెలివొందుచుఁ గన్నుదోయిఁ దెఱచినమాత్రన్. 42

ఉ॥ ఖేచరవీథినుండి యొక కిల్బిషజంతువు రెట్ట జాఱి రెం
డై చటులోగ్రనిష్ఠురవిభాగ్నికణంబులవోలె జివ్వనన్
వే చనుదెంచి చూపఱకు విస్మయమున్ భయముం దలిర్పఁ ద
ల్లోచనయుగ్మమం దటు చుఱుక్కనఁగాఁ బడె బోరుబోరనన్. 43

ఆ॥ నీరు వెడలి వెడలి నెఱి నల్లగ్రుడ్డుల - లోని పాప లణఁగి కానఁడయ్యె
నిచ్చ లోకధనము వీక్షింపనొల్లని - యతని జ్ఞానదృష్టి కనుగుణముగ. 44

ఉ॥ అంతటఁ దత్కులాంగనయు నాత్మజుఁడుం బరితాపమొంది యా
క్రందన మాచరింపఁగఁ బురంబు జనంబులు గూడి విస్మయం

---

మనస్సు సంతోషించునట్లు పలుకును; తుదిన్ యెట్టి హీనునితోడనైన=చివరకు ఎంతటి తక్కువవానితోనైనను; సర్వేశ్వర ధ్యాన సంధాన భావము ఏమఱదు=దేవుని ధ్యానదృష్టిలోనికి మరలించుకొను తలపును ఒక నిమిషకాలమైనను మఱచిపోడు; కాలము గడవనీక=వేళ తప్పకుండునట్లు; నిత్య కర్మ విధాన నియమము =దినదినము చేయు పనులయొక్క నియమమును: (ఏ వేళ నే పని చేయవలయునో ఆ యా పనులను ఆ యా సమయములలో తప్పక చేయును) ఒరులకునైన యాపదలు=ఇతరులకు కలిగిన కష్టములను; తనకునట్లు =తనకు కలిగినట్లే భావించి; తొలగింప నాత్మ తలఁచున్=తీసివేయవలయునని తలంచును; అహర్నిశంబు= పగలును రాత్రియు ఆ పురమున ఎంతయు పుణ్యశీలుడై తిరుగును.

41. విమల ఆచార విచారమందు=పరిశుద్ధమైన ఆచారమందలి తలంపుతో; ఎవ్వేళ=ఎప్పుడును; సమభావమున తిరుగ=ఎచ్చుతగ్గులు లేకుండ తిరుగుచుండగా; సర్వేశ్వరుడు ఒక్కనాడు మనఃస్థైర్యము గన్గొనం=తోభ్యుని దిట్టతనమును చూడవలెనని తలచినాడో; ప్రేత సంస్థాపన శ్రముడై=శవమును పాతిపెట్టిన కారణమున ఆయాసపడినవాడై; ఒక నిశీథమందు=ఒక రాత్రివేళ; కడున్ నిద్రాభార దుర్వారుడై =నిద్ర యను బరువును ఆపుకొనలేనివాడై.

42. తలవాకిట దిన్నెపయిన్=వీధి గుమ్మము అరుగుమీద; నిలుపు ఓపగలేక వ్రాలి=నిలుచుటకు శక్యముగాక పండుకొని; తెల తెల వేగిన యంతట=బాగుగా తెల్లవాఱిన పిమ్మట; తెలివి ఒందుచు=మేల్కొని రెండు కన్నులు తెఱచిన వెంటనే.

43. ఖేచరవీథినుండి=ఆకాశమార్గమునుండి; ఒక కిల్బిషజంతువు రెట్ట=ఒకానొక దుష్టపక్షియొక్క మలము; జారి రెండై=ఆకాశమునుండి జాఱి క్రిందపడుచుండగా రెండుభాగములై; చటుల ఉగ్ర నిష్ఠుర విభ అగ్నికణంబులు వోలె=తీక్ష్ణమైన భయంకర కఠినమైన కాంతిగల అగ్నియొక్క రవలవలె; జివ్వన వేగ చనుదెంచి=శీఘ్రమగు వేగముతో వచ్చి; చూపఱకు విస్మయము భయము తలిర్ప=చూచుచున్నవారికి ఆశ్చర్యమును భయమును కలుగగా; తత్ లోచన యుగ్మమందు=అతని (తోభ్యుని) రెండు నేత్రములయందు; అటు చుఱుక్కనగాన్=చుఱుక్కుమని యుండునట్లు; బోరుబోరనన్=బోరుమని (స్పష్టముగా) పడెన్.

44. నీరు వెడలి వెడలి=మిక్కిలిగా నీరు కాఱి; నెఱిన్ అణగి=మిక్కిలిగా పాపలు చెడిపోయి; కానడయ్యెన్=చూడలేకపోయెను; నిచ్చలోక ధనము వీక్షింపనొల్లని=తన మనస్సులో లోకధనములను చూడ ఇష్టములేని; యతని జ్ఞానదృష్టికి అనుగుణముగా=తోభ్యుని జ్ఞాననేత్రమునకు తగినట్టుగా

45. తత్కులాంగనయున్ ఆత్మజుడున్=అతని భార్యయు కుమారుడును దుఃఖమును పొంది; ఆక్రం

బంది కనుంగొనంగ సుహృదాప్త పురోహిత మిత్రబాంధవు
ల్కుందుచు దండఁబట్టికొని లోనికిఁ దోకొనిపోయి నిల్వఁగన్. 45

శా॥ చుట్టు న్మూఁగి తదాప్తు లిట్లని రతిక్షోభాత్ములై నెవ్వగల్
పుట్టం బుట్టిననాఁటినుండియు మహా పుణ్యంబులే చేయఁగా
నిట్టయ్యెం దఁక నింక దేవుఁ డనఁగా నెవ్వండు నీ భక్తికిం
గట్టా యీదురవస్థ మాన్పఁ దగదే కారుణ్యభావంబునన్. 46

క॥ సకలేంద్రియములలోపల - సుకరంబగు నింద్రియంబు చూడ్కి దొలఁగ మే
మింక నేమని యూఁగార్తుము - ప్రకటంబుగ నీదు పుణ్యఫల మిట్లుండెన్. 47

మ॥ అనుచుం దోభ్యుఁడు పల్కె నిట్లనుచు నాహా వెఱ్ఱులే మీరు కో
రిన సిద్ధించునె కానియర్థము ధరిత్రిం గోరకున్నంతమా
త్రనె సిద్ధింపకపోనె కావలయు నర్థంబైన నాభక్తి దొ
డ్డనఁగాఁ గూడునె సర్వనాయకుని సంకల్పంబు సిద్ధింపుతన్ 48

తే॥ అఖిలభూతదయాపరుం డైనయట్టి - యతఁడ నిర్హేతుక కృపాకటాక్షదృష్టిఁ
గాంచి రక్షింపవలెఁగాక కావు మనుచుఁ - బల్మి సేయంగఁ దగ దెట్టి భక్తులకును. 49

---

దనము ఆచరింపఁగ=ఏడుపులు చేయఁగా; పురజనంబులు=పట్టణములోనివారు ఆశ్చర్యపడి చూడఁగా; సుహృత్ ఆప్త పురోహిత మిత్ర బాంధవుల్=స్నేహితులు కావలసినవారు పురోహితులు మిత్రులు చుట్టములు (వీరు కర్తలు); కుందుచున్ దండ పట్టుకొని=దుఃఖించుచు భుజము పట్టుకొని; లోనికి=ఇంటిలోనికి తీసికొని నిల్వగా.

46. తత్ ఆప్తులు=ఆతోభ్యుని ప్రియమైనవారు; చుట్టున్ మూఁగి=వానిచుట్టును చేరి; అతిక్షోభాత్ములై =మిక్కిలి బాధపడుచున్న మనస్సు కలవారై; నెవ్వగల్ పుట్టం=విచారము కలుగఁగా ఇట్లనిరి: (ఇతఁడు) పుట్టిననాటినుండియు గొప్ప పుణ్యములను చేయఁగా; ఇట్టయ్యెం=ఇట్టి (కష్టము) కలిగెనే; ఇంక దేవుఁడనఁగా నెవ్వఁడు (దేవుఁడు లేడని చెప్పవచ్చును); నీ భక్తికిఁ=నీవు చేసిన దైవధ్యానమునకు (దేవుఁడనఁగా నొక్కఁడు ఉన్నయెడల); ఈ దురవస్థ కారుణ్య భావమునన్ మాన్పఁదగదే కట్టా=అయ్యో ఈ కష్టమును దయతో మానుపఁగూడదా.

47. అన్ని ఇంద్రియములలో సుకరంబగు=మేలైన యింద్రియము చూడ్కి=కన్ను; (ఈ కన్ను) తొలఁగ=పోయినయెడల మేము ఇంక నేమి ఊఁగార్తుము=ఓదార్పఁగలము; నీవు చేసిన పుణ్యకార్యములకు నీకు కలిగిన లాభము ఇట్లుండెనా?

48. అనుచున్=ఇట్లు చుట్టును మూఁగినవారలు దేవుని దూషించి చెప్పఁగా; (తోభ్యుఁడు) ఇట్లనుచు పల్కెను: ఆహా వెఱ్ఱులే మీరు=మీరు వెఱ్ఱివారా యేమి; కాని యర్థము కోరినను సిద్ధించునె=దొరకని వస్తువుల కోరినయెడల దొరకునా; కావలయు నర్థంబైనను కోరక ఉన్నంతమాత్రనె సిద్ధింపకపోనె=దొరకవలసి యున్న వస్తువు కోరక పోవుటచేత దొరకక పోవునా (రానిది రమ్మనినను రాదు, రానున్నదానిని వలదన్నను పోదు) నాభక్తి గొప్పది అని చెప్పఁగూడదు=నేను చేయు భక్తి యింత గొప్పది కాదు, (అనఁగా దేవుఁడు తానె వచ్చి యడ్డపడి నా కన్నుల బాధ తీర్చుటకు చాలినంత దేవభక్తి నాకు లేదు.) సర్వనాయకుని సంకల్పంబు సిద్ధింపుతన్=దేవుని చిత్తము జరుగునుగాక.

49. అఖిల భూతదయాపరుఁడు=అన్ని ప్రాణులమీఁదను దయగలవాఁడు; నిర్ హేతుక కటాక్ష దృష్టిన్=కారణములేని దయతోఁ గూడిన కరుణగల చూపుతో; రక్షింపవలెను=కాపాడవలయును; గాక= అంతేగాక; కావుమనుచు బల్మి చేయఁగా=కాపాడుమని బలవంతము చేయుట; ఎట్టి భక్తులకు=యెంత గొప్ప పుణ్యాత్ములకైనను తగదు. (దేవుని చిత్తము ఉండునెడల నన్ను రక్షింతురు గాని ఆతఁడు ఈలాగు ఆలాగున చేయవలెనని నిర్బంధము పెట్టుట ఎవరికిని తగదు.)

ఉ॥ ఆ పరమేశునాఢ్యు నఖిలాధిపుని న్మది నమ్మి కొల్వఁగా
నాపద లావహించిన మహావిభవంబులు సంభవించినన్
జాపలభావ మేర్పడిన జ్ఞానము గల్గినఁ గ్రూరుఁ డెన్నఁ బ్ర
జ్ఞాపరిపూర్ణుఁ డన్న విలసన్మణిభూషలె నాకు నియ్యెడన్. 50

ఉ॥ చంచలబుద్ధి మాని ధృతి సత్యదయాశుచిశాంతిదాంతుల
న్మించి విపత్పరంపరల నిష్ఠ తొలంగకయున్న స్వామి ర
క్షించునుగాని దుర్భరముఁ జెంది వృథామతి నెన్నియేని గాం
క్షించిన నేమి లాభము విశిష్టజనంబులు వాని మెత్తురే. 51

తే॥ అనిన నింతయు నిజమగు నైన మాకు - నంతమతి లేదుగాని నీ వంధకుండ
వై దరిద్రుండ వైనందు కాత్మ నోర్వఁ - గలమె యంచుఁ దదాప్తు ల్వెడలిరి వీడి. 52

ఉ॥ అంతటఁ దత్కులాంగన ప్రియంబు నయంబును దోఁప నప్పురిం
గాంతలు దన్ను వేఁడికొనఁగాఁ బనిపాటల నింపు సేయుచున్
మంతనముండి వారు తగుమాత్ర మొసంగిన భుక్తి పెట్టుచున్
సంతత మీగతిన్ జరుప సంశయ మందెను దోభ్యుతంత్రికిన్. 53

క॥ కడు నిడుమలొంది పుడమిని - గడియించిన వేతనమునకై గొదమం దాఁ
గడనం గొనివచ్చియు నొక - కడ గూఢంబుగఁ బడతుక గట్టి యునిచినన్. 54

---

**50.** ఆ పరమేశున్ ఆఢ్యున్ అఖిలాధిపున్=సర్వేశ్వరుని అధికారుని అందఱకు అధిపతియైనవానిని మదిలో నమ్మి సేవించుచుండగా; ఆపదలు ఆవహించినను=కష్టములు కలిగినను; మహా విభవంబులు సంభవించినను=పెద్ద యైశ్వర్యంబులు దొరికినను; చాపల భావము=చంచల మనస్సు ఏర్పడినను; జ్ఞానము కలిగినను; క్రూరుడనన్=నన్ను జనులందఱు వీడు దుర్మార్గుడనినను; ప్రజ్ఞాపరిపూర్ణుడన్న=తెలివిచే మిగుల పూర్ణుడని (జ్ఞానవంతుడని) చెప్పినను; ఇయ్యెడన్=ఇక్కడ నాకు (ఇవి యన్ని) విలసత్ మణి భూషలె=ప్రకాశించుచున్న రత్నములతో చేయబడిన నగలవంటి వగును. (తా॥ నేను సర్వేశ్వరుని పూజించుచుండగా నాకు కష్టములు రానిమ్ము, సుఖములు రానిమ్ము, తెలివితక్కువ కానిమ్ము, జ్ఞానము కలుగనిమ్ము, లోకులు నన్ను నిందించనిమ్ము, స్తోత్రము చేయనిమ్ము, ఇవి యన్నియు నాకు భూషణములే.)

**51.** చంచలబుద్ధి మాని=చపల (స్థిరములేని) మనస్సును విడిచి; ధృతిన్ సత్య దయా శుచి శాంతి దాంతులన్=ధైర్యముతో అబద్ధమాడకుండుట, కరుణ గలుగుట, ఆచారము గలుగుట, నెమ్మదిగా నుండుట, ధర్మము ఇచ్చుట; మించి=ఆ సత్కృత్యములను ఎక్కువగా కలిగి; విపత్పరంపరల=అనేక దుఃఖములు సంభవించినను; నిష్ఠ తొలగక=దేవునిమీది తలంపు విడిచిపెట్టక యుండువారల స్వామి రక్షించునుగాని; దుర్భరము చెంది=ఆయాసము పొంది; వృథామతిన్=వ్యర్థమగు బుద్ధితో; ఎన్నియేనిన్ కాంక్షించినన్=అనేకము కోరినను ఏమి లాభము; వాని విశిష్ట జనంబులు మెత్తురే=(ఇట్లు చేయు) వాని పెద్దలు మెత్తురా.

**52.** అనిన=తోభ్యుడు చెప్పగా (చుట్టు నిలిచిన వారలు చెప్పిన దేమనగా): ఇంతయు=నీవు చెప్పిన యిదియంతయు నిజమగును; అయినను మాకు అంతమతి=అంతవఱకు యోచించు జ్ఞానము లేదుగాని నీవు గ్రుడ్డివాడవై దరిద్రుడవుకూడ అయినందువలన; ఆత్మన ఓర్వగలమె=ఓర్వజాలము.

**53.** తత్ కులాంగన ప్రియంబు నయంబును దోప=ఆ తోభ్యుని భార్య ప్రేమయు నీతియు కనుబడునట్లు; ఆపట్టణములోని స్త్రీలు కోరగా, ఈమె పనులు బాగుగా చేయుచు; మంతనముండి=ఆలోచనతో (కావలయునని); తగుమాత్రము=ఆ స్త్రీలు కొంచెము ధనము ఇయ్యగా; భుక్తి పెట్టుచున్=మగనికి అన్నము పెట్టుచు; సంతతము=ఎప్పుడును ఇట్లు గడపుచు రాగా;

**54.** కడు నిడుమలు ఒంది గడియించిన వేతనమునకై=చాల కష్టములు పొంది సంపాదించిన కూలికై;

క॥ ఒంటిమెయి నుండఁగ వెఱచి - జంటఁ దలంచి యఱచెననఁ శ క్తి నడియ మి
న్నంటఁగ రావము సల్పఁగ - దంట కలిగెనంచుఁ దోభ్యుఁ డతి కంపముతో. 55
క॥ ఎయ్యడిది గొదము నీకే - యయ్య యొసంగె సఖియా బసధనమునంగా
నియ్యకయె హరించితివే - కయ్యములు గలుగక మున్నె కరుణం జెప్పుమా. 56
క॥ కడు లేమిం దగిలి వగచి - తడయక నేరం బిది యని దలఁపక నీ వీ
చెడు కార్యము చేసితివే - యడిగినఁ దెల్పంగరాదె యడకువతోడన్. 57
తే॥ ఎఱుఁగవే యహోరాత్రము లెన్నియైన - నన్నపానంబులు గొనక బ్రదుకువాఁడు
నీదు జననాథుఁడని యింత నియతిఁ దప్పి - నడచినం గనురాగంబు నాకు నున్నె. 58
క॥ నిరసనవ్రతంబుఁ బూనుదు - శరీరమె తొఱఁగుదు బాధ నచ్చెరు వారన్
ధర నోర్చు నెంతయేనియు, - హరిత గొదమ నంటఁజాల నాహారమునకై 59
క॥ ఏల కలిగించెఁ దనువును - బాలకుఁ డెందుకు నిలిపెను బ్రాణంబందున్
మేలుగ బోషణ సేసియుఁ - గాలము గడపుటకొ మిగుల గర్వితబుద్ధిన్. 60
క॥ ఇంచుకయైనఁ గొదమ నీఁట - నుంచక సత్వరగఁ దరల సొంతదఁటంచున్
నెంచుచు వచ్చిన నరునికి - వంచన సేయక యొసంగు వాలాయముగన్. 61
క॥ నాకిట్లు భుక్తి పెట్టగఁ - దేకువ నన్యాయరీతిఁ దెచ్చితొ చెప్పుమ
ట్టాకలిఁ గూలికి చేసితొ - యే కరణిఁ బదార్థము లివి నీకు దొరకెనో. 62

---

కొదమ గడన=కడపట ఒక మేకపిల్లను తీసికొని వచ్చి; గూఢంబుగ=పెనిమిటిని హెచ్చరింపక; పసనుక ఒక కడ=భార్య ఒకచోట కట్టియుంచగా;

55. ఒంటిమెయి నుండగ వెఱచి=(ఆ మేకపిల్ల) ఒకటిగా నుండుటకు భయపడి; జంట తలచి యఱచెను అన=తోడి మేకపిల్లను తలంచి అఱచినట్లుగా; శక్తిని అడియ మిన్నంటగా రావము సల్పగా=ఆకాశము అంటునట్లుగా బలముతో శబ్దము చేయగా; తంట కలిగెనని అతికంపముతో=కీడు కలిగెను అనుకొని తోభ్యుడు మిక్కిలి వణకుచు (చెప్పెను.)

56. ఎయ్యడిది కొదము=ఎక్కడిదీ మేకపిల్ల; నీకు ఏ యయ్య బసధనమనగా=ఎవ్వరు బహుమానముగా ఇచ్చినారు; ఒకరును ఇయ్యకొనకయుండగా నీవు దొంగలించినావా; కయ్యము=జగడము జరుగక మునుపు తెలియ చేయుము.

57. కడు లేమి తగిలి=నిండు దారిద్ర్యము పొంది, అందుకు భయపడి ఇది తప్పు అని తలంపక ఈ చెడ్డకార్యము చేసినావా, నేను అడిగినప్పుడు నీవు నిజము వినయముతో చెప్పవా.

58. అహోరాత్రము లెన్నియైనను=ఎన్నియో రాత్రింబగళ్లు అన్నము నీళ్లు లేక నీ భర్త బ్రదుకగలడని నీకు తెలియదా? నీతి దప్పి నీవు నడచినయెడల నాకు నీమీద ప్రేమ యుండునా?

59. నిరసన=అన్నము లేకుండుట అనెడు వ్రతము తీసికొనుదును; తొఱగుదును=నా శరీరము (నా ప్రాణము) విడిచిపెట్టుదును; అచ్చెరువు ఆరన్=ఆశ్చర్యము కలుగగ ఎంతటి బాధలైనను భరించెదను; గాని దొంగలింపబడిన మేకపిల్లను భోజనమునిమిత్తమై అంటుకొజాలను.

60. పాలకుడు ఏల తనువును కలిగించెను=ఎందుకు దేవుడు ఈ శరీరము సృష్టించెను; ఎందుకు దానిలో ప్రాణము నిల్పెను; బాగుగా భోజనము చేసి కాలము గర్వముగల మనస్సుతో వ్యర్థముగా గడపుటకా?

61. సొంతదటంచు నెంచుచు వచ్చిన నరునికి=(ఈ మేకపిల్ల) నా సొంతిది అని చెప్పుచు వచ్చు మనుష్యునకు నొసంగుము.

62. నాకు ఇట్లు భుక్తి పెట్టుచుండగా; తేకువ=ధైర్యముతో అన్యాయవిధముగా తెచ్చితివా; అట్టా కలిన్=కష్టపడి కూలిపని చేసినావా, ఏ విధముగా ఈ భోజనవస్తువులు నీకు దొరకెను?

క॥ కాయికలబ్ధంబైన మ - హా యోగ్యం బట్లు గాక యటమటమైనన్
ధీయుక్తిఁ దెలిసి మగుడ - న్వే యొసఁగుము వారి సొమ్ము వెట్టింబడకే. 63

చ॥ అనవుడు విన్నఁబాటు వదనాబ్జమునన్ గనుపట్ట బాష్పముల్
గనుఁగవ జాలు వాఱ విభుఁ గన్గొని గద్గదఖిన్నకంఠయై
కనలుచుఁ బల్కె నేఁమిటికిఁ గట్టితె నేరము నా పయి న్మహా
ఘనుఁడవు పుణ్యము ల్సలుపఁగా నిటు లాడఁగఁ దోఁచునే మదిన్. 64

ఆ॥ మన సెఱుంగ కిట్లు నను నెగ్గులాడితి - వనుచుఁ దూలనాడి యప్పుడె తెలిసి
మోసపోతి నీబుద్ధిచేఁ గననైతి - విభుఁడె ఘనుఁ డటంచు వెట్టినైతి. 65

సీ॥ అని వినయంబు భయంబును - భక్తియుఁ బెనఁగొన భర్తఁ గాంచి
యజ్ఞానమున రజ్జులాడితి నెంతయు - నెదిరించి కానక యింతవట్టు
నపరాధ ముడిపి కటాక్షించి ప్రోవవే - పరిపూర్ణ కరుణ మత్ప్రాణనాథ
నీవ నా పాలిటి నెఱదాత వధికుండ - వెయ్యెడ నీవు నా కేడు గడయు

తే॥ సత్యవేదంబు నీవాక్య సరణి యెల్ల - నీ తపస్స్ఫూర్తి కైవల్య హేతుకంబు
• నీ చరిత్రము లత్యంత నిర్మలములు - నీకు సరి పుణ్యజనుఁడేడి లోకమందు. 66

క॥ నీ యట్టి ధన్యునకును మ - హా యోగ్యత ధర్మపత్నినై యుండఁగ స

63. కాయికలబ్ధంబైన మహా యోగ్యము=నీవు కష్టపడి కూలిచేసి తెచ్చినదాయెనా ఆ ధనము శ్రేష్ఠమైనది (కాయము=శరీరము, శరీరము వంచి పని చేయుటచే వచ్చినది కాయికము) అట్లుగాక అటమటమైనన్=ఎవ్వరి సొమ్ము ఆశించి తెచ్చినయెడల; ధీయుక్తిన్ తెలిసి=బుద్ధిగలదానవై యజమానుని కనుకొని; మగుడ వే=వేగముగా తిరిగి నిమ్ము; వెట్టిపడక=ఒకరి సొమ్ముకొఱకు నీవు వెట్టియాశ పడవలదు.

64. అనవుడు=తన భర్త యిట్లు పల్కగా; విన్నబాటు వదన అబ్జమునన్ కనుపట్ట=దీనత్వము (దుఃఖము) తామరవంటి ముఖమునందు కనబడునట్లు; బాష్పములు కనుగవన్ జాలువాఱన్=కన్నీరు రెండు కన్నులనుండి కాలువలై పాఱగా; పెనిమిటిని కనుకొని; గద్గద ఖిన్నకంఠయై కనలుచు=వణకు పుట్టిన దుఃఖముగల గొంతుతో కోపపడి ఆమె చెప్పినది: యెందుకు నా మీద నింద మోపెదవు; మహా ఘనుడవు=నీవు గొప్పవాడవు; పుణ్యముల సలుపగా=పుణ్యకార్యముల చేయుచున్న కారణముచేత; ఇటులు ఆడగ మదిన్ దోచును=ఈ నిందలు పల్కుటకు నీ మనస్సులో దోచుచున్నవా. (నీవు పుణ్యకార్యములు చేయుచున్నందుకు ఫలమా ఇట్లు నాపై నిందలు మోపుట; గొప్పవాడవే అనుట యాక్షేపము.)

65. మనస్సు ఎఱుగక ఇట్లు నన్ను ఎగ్గులాడితివి=నా మనస్సును నీవు తెలిసికొనక నన్ను ఇట్లు నిందించితివి అనుచు; తూలనాడి=తేలికపఱచి; అపుడు తెలిసి=అయ్యో, భర్తను తేలికపఱచి మాటలాడితినిగదా యని తెలిసికొని; కననైతిని=తెలిసికొనలేక పోతిని; భర్త గొప్పవాడు అని (నిందించుచు) వెట్టినైతి=వెట్టిదానను అయితిని.

66. పెనగొన=చుట్టుకొనగా; అజ్ఞానమునన్ రజ్జుల ఆడితిని=తెలివి లేక ప్రేలితిని(వ్యర్థ సంభాషణము చేసితిని); కానక ఎదిరించి=తెలిసికొనక మీ మాటకు నెదురు మాటలాడితి; ఇంతవట్టు అపరాధము ఉడిపి కటాక్షించి=ఇటువంటి నేరమును ఓర్చి దయతో చూచి; నీవు నా పాలిటి నెఱదాతవు=నీవు నాకు గొప్ప ధనమిచ్చినవాడవు; అధికుండవు=నీవు గొప్పవాడవు; ఎయ్యెడ నీవు నాకు ఏడుగడ=ఎప్పుడును నీవు నాకు దిక్కు (ఏడు + కడ=ఏడుపుయొక్క ముగింపు=ఆధారము, దిక్కు); నీ వాక్య సరణి యెల్ల సత్యవేదము=నీ మాటలన్నియు నాకు సత్యవేదములోని మాటలవంటివి; నీ తపస్స్ఫూర్తి కైవల్య హేతుకము=నీ గొప్ప తపము మోక్షమునకు మూలమైనది; నీ చరిత్రములు అత్యంత నిర్మలములు=నీ నడవడి మిక్కిలి శుద్ధమైనది; నీకు సమానమైన పుణ్యాత్ముడు లోకములో నెక్కడ?

న్యాయార్జనమున కోర్తునె - కాయికలబ్ధమగు సొమ్ముఁగాక దయాబ్ధీ! 67

క॥ అని విభునిఁ దెలిపి సమ్మద - మునఁ దన భృతివలన జరుప మును దమ యింటం
గనుసన్న మెలఁగు జనులకుఁ - బనిసేయు తల్లిఁ గొమరుఁడు పరికించి యనెన్. 68

మ॥ అకటా! చేరెఁడు కూలిబియ్యమునకై యత్యంతనిత్యాన్నదా
నకళావైభవలక్ష్మికిన్నిలయమా నా తల్లి హస్తాబ్జ మిం
త కృశీభావము నొంది క్రిందుపడఁగా నా గుండె యెంతే వికా
వికలై ప్రీలక నిల్చియుండెఁ గఠినోర్వీభృద్విపక్షాసియై. 69

చ॥ అనుపమసౌఖ్యలీలలఁ బ్రయాస మెఱుంగని తల్లి నేఁడు నీ
పను లొనరింపఁ గష్ట మెడఁబాపఁగఁజాల నిఁకేమి సేతు హా
ననుఁ దెగఁజూడ రెవ్వరును నాది శరీరమె నాది జన్మమే
శునకములైనఁ జావఁ దినఁ జూచునె రోయక యిట్టి దేహమున్. 70

సీ॥ నేత్రనిరోధంబు నివ్వటిల్లిన తండ్రి - కే యౌషధక్రియ లేసెయువాఁడ
నొకవేళ దృక్చికిత్సకులు గన్పడిన వా - రల కేమి ఫల మిచ్చు నిలుపువాఁడ

---

67. నీయట్టి ధన్యునకు మహాయోగ్యత ధర్మపత్నినై యుండగ=నేను నీవంటి గొప్పవానికి మంచి వర్తనము గల భార్యనై యుండగా; అన్యాయ ఆర్జనమునకు ఓర్తునె=న్యాయమార్గమునరాని ధనమును సంపాదించుటకు నేను సహింతునా; కాయక లబ్ధమగు సొమ్ముగాక=ఇది శరీరమును కష్టపెట్టి సంపాదించిన ధనముగాని వేరు కాదు; దయాబ్ధీ=ఓ దయసముద్రమా.

68. విభుని తెలిపి=భర్తను సందేహము లేనివానినిగా చేసి; సమ్మదమున తన భృతివలన జరుప=సంతోషముతో తన్న కూలిపనివలన (భృతి=కూలి) సంసారము జరుపుచుండగా; మును=పూర్వము (తమకు ధనము ఉన్నయప్పుడు) కనుసన్నన్ మెలగు జనులకు=కన్నుతో సంజ్ఞ చేసి చెప్పిన పనులను చేసిన వారలకొఱకు; తల్లి పనిపాలల చేయుట కొమారుడు చూచి చెప్పిన దేమనగా.

69. అత్యంత నిత్య అన్నదాన కళా వైభవ లక్ష్మికిన్ నిలయమా=ఎల్లపుడును విడువకుండ అన్నదానమనెడు శోభనముచేత ప్రకాశించెడు సంపదకు వాసముగా నుండునట్టి నా తల్లియొక్క; హస్తాబ్జము=పద్మమువంటి మృదువైన చేయి; చేరెడు కూలి బియ్యమునకై=కూలి చేసి ఒక చేతితో పట్టెడు బియ్యముకొఱకు; ఇంత కృశీభావము నొంది క్రిందుపడగాన్=మిక్కిలి సన్నగిలి బలములేక క్రింద పడుచున్నందుచేత (ఇచ్చువారి చేయి మీదు, పుచ్చుకొనువారి చేయి క్రిందు, కాబట్టి=తల్లి క్రిందు పడిన దానిని గాంచి) నా గుండె యెంతే వికావికలై=నా హృదయము మిక్కిలి ముక్కముక్కలై చెదరి; ప్రీలక=బ్రద్దలుగాక; కఠిన ఉర్వీభృత్ విపక్ష అసియై=కఠిన పర్వతములకు విరోధియగు (ఇంద్రుని) కత్తివలె (ఇంద్రుని కత్తి వజ్రము) నిల్చియున్నది. (నా మనస్సు కఠినమైనది, దయలేనిది కాక మనస్సు మెత్తనిదైయైనయెడల నేనిట్లు నా తల్లి కష్టపడుట చూడగలనా అని విచారించును.)

70. అనుపమసౌఖ్యలీలల=సాటి చెప్పుటకు సాధ్యముకాని సుఖములను (పొందుచు); ప్రయాసము=కష్టమెట్టిదో ఎఱుగని తల్లి నేడు ఈ పనులను చేయుచుండగా, కష్టము ఎడబాపలేని నేను; ఎవ్వరును నను దెగజూడరు=ఎవ్వరైనను నన్ను చంపపోరేమి; నాది శరీరమే=(తల్లి కష్టములు తీర్పలేని) నా శరీరము శరీరమేనా (కాదు); నాని జన్మమే=నాదియు నొక్క మనుష్య జన్మమేనా (కాదు); ఇట్టి దేహము చావ=చచ్చినపిమ్మట; శునకములైనను రోయక తిన చూచునె=కుక్కలైనను అసహ్యపడక తినుటకు నిష్టపడునా.

71. నేత్రనిరోధము నివ్వటిల్లిన తండ్రికి=కన్నులకు అడ్డు కలిగిన తండ్రికి; ఏ ఔషధక్రియలు చేయవాడను=ఏ వైద్యము చేయుదును; ఒకవేళ దృక్ చికిత్సకులు=ఎప్పుడైన నేత్రములకు మందు చేయు వైద్య

వనయంబుఁ గూలిపా టొనరించు తల్లి కే - తెఱఁగునఁ గష్టంబుఁ దీర్చువాఁడ
గడలేని దారిద్ర్య మెడబాసి పోవంగ - నేమి యుపాయ మూహించువాఁడ
తే॥ సర్థు లేతెంచి వేఁడిన నరసి వారి - కెట్లు సమ్మతి చేసెద నిప్పు డహహ
యుర్విలోపల జననీ వయోలతాల - విత్ర మనఁగా జనించితి వేయు నేల. 71

క॥ మనుజునకును యౌవనమున - ధనహీనత కంటెఁ - గీడు దలఁపఁగ నేదీ
ధనహీనుఁ డగుటకంటెను - జనునకుఁ జచ్చుటయె మేలు చర్చింపంగన్. 72

వ॥ ఇట్లు కులాంగనయొక్క తిరస్క్రియను, నందనుని యాక్రందనంబును బురజనంబుల దైవదూషణంబును దోర్భ్యుం డవలోకించి విషణ్ణహృదయుండై కనుంగవ బాష్పంబులు తొరఁగ సర్వేశ్వరుం దలంచి, కరుణానిధీ, శరణాగత, సంశ్రిత దుఃఖహరణా, సత్య స్వరూపా, పాతకవర్తినైన ఫలంబున భవత్కృపాదూరుండనై పరితపించునెడ శత్రు విజృంభణ మత్యంతమైనను బరిహాస్యాస్పదునిం గావింప నిర్భర దుఃఖమునఁ గృశించువాఁడ, భవద్భృత్యుం డనంత క్లేశంబునఁ దగులునడి బొగలుటకంటెఁ బ్రాణంబుఁ బాయుట యుచితంబుగాదె, మహనీయా నేనిఁక మీకొనర్పఁగల సహకారం బెద్దియుం గలదె, యటుంగావున నా దీనాలాపంబు లాకర్ణించి సత్వర నీ సన్నిధిఁ జేర్చుకొనుమా, యార్తశరణ్యా సర్వేశ్వరా యని వేడుతఱిని నతనియొక్క యూరఁ బరమాత్ముని శరణుజొచ్చి కంట నీరొలికించుచు బ్రార్థించుచుండిన తఱుణి చరితం బెట్టిదన, 73

---

లు కష్టపడినను; వాగలకు (వైద్యము చేసినందుకు) ఏమి బహుమానము ఇత్తును; కడలేని=ఒడ్డు కనబడని (అంతములేని) దారిద్ర్యము వదలిపోవునట్లు ఏ మార్గము ఆలోచింపగలను? బీదలు వచ్చి అడిగినయెడల ఎట్లు వారిని అరసి=కావలసినది తెలిసికొని; సమ్మతి చేసెద=తృప్తిపఱచెదను; జనని వయః లతాలవిత్రము=తల్లియొక్క యౌవనమనెడు తీగను తెగగోయుటకు కొడవలిగా పుట్టితిని. తా॥ నా పుట్టుక వ్యర్థమైనది, ఏమియు మంచి కార్యము చేయలేని నా జన్మమే, నా తల్లియొక్క యౌవనము చెఱచుటకుమాత్రము పనికి వచ్చినది, (బిడ్డ పుట్టకమునుపు తల్లులు యౌవనమందుందురు. బిడ్డలు పుట్టినతర్వాత వారికి పడుచుతనముండదు.)

72. యౌవనమున ధనహీనతకంటె=మంచి వయస్సులో (అనుభవింపవలసిన దినములలో) ధనము లేకపోవుటకంటె కీడు ఎక్కడ నున్నది? చర్చింపంగ=బాగుగా ఆలోచించినయెడల.

73. ఆక్రందనము=చింత; అవలోకించి=తలపోసికొని; విషణ్ణ హృదయుండై=చింతతో కూడుకొనిన మనస్సు గలవాడై; కనుంగవ=రెండు కండ్లలో; కరుణానిధి=కరుణకు గనియైనవాడా; శరణాగత సంశ్రిత దుఃఖ హరణా=శరణు పొందుటకు జేరినవారి దుఃఖమును బోగొట్టువాడా; పాతకవర్తినైన ఫలంబున=పాపాత్ముడనైన ఫలముచేత; భవత్కృపాదూరుండనై=నీ దయకు దూరముగా పోయినవాడనై పరితపించునెడ=దుఃఖపడుచుండగా; శత్రువిజృంభణము అత్యంతమై=శత్రువుల అతిశయము అధికమై; నను; పరిహాస్యాస్పదునిం గావింప=నన్ను ఎగతాళికి స్థావరమైనవానివలె చేయగా; నిర్భర=భరింపరాని దుఃఖముచేత నశించి పోవుచున్నాను; భవద్భృత్యుండను=నీ సేవకుడను; అనంతక్లేశంబున దిగులుపడి=అంతములేని దుఃఖములో జిక్కుకొని; పొగలుటకంటె=చింతపడుటకంటె ప్రాణము విడిచి పెట్టుట మంచి దిగదా; మహనీయా=మహా నీతిగలవాడా; నేనింక మీకొనర్పగల సహకారం బెద్దియుం గలదే=ఇంక మీకు నేను చేయగల మంచి పని ఏదైనను గలదే; దీనాలాపము=నా వినయ వచనములు. విని. త్వరలో నన్ను నీ సన్నిధానమున చేర్చుకొనుము; యార్తశరణ్యా ఆపదలో నుండువానికి శరణమైనవాడా;

తే॥ పరగ రాఘ్వేలుని సుత నిర్మల గుణగణ-ధామ సారమ్మ జగదీశు ధ్యానము దన
చిత్తమున నిల్పి సంతాపమెంతఁ బొదలి-యున్న నిశ్చలమున నుండె గోమలాంగి. 74

క॥ ఆకోమలి నేడుగురిని మక్కువమీరఁగ వివాహమాడిన నిల వా
రొక్కరు దక్కక గడువడిఁ-జిక్కిరి మృత్యువుకరములఁ జింతయు నొదవన్. 75

క॥ పెనుభూతం బొకటి దనదు-ఘనక్రోధము దీర్చుకొనఁగ ఘాతుక కార్యం
బొనరించె నంత వారలు-తనువులఁ బాసిరి కడువడి తరుణి తపింపన్. 76

క॥ వారి మరణమునకుఁ దరుణి-కారణ మించుక దలఁపఁగఁ గాదట్లైనన్
బౌరులు సారమ్మ సలిపె-నేరములనుచు మదిలోన నెంచిరి యెంతేన్. 77

క॥ ఆయమ్మ మిగులఁ దలఁకుచు-పాయని వగతోఁ బొగలుచుఁ బరమాత్ముని సా
హాయము గోరుచు ఘన తప-మే యాదరవనుచు నమ్మె మీరిన భక్తిన్. 78

క॥ పరిచారిక పొరపాటు స-వరింప సారమ్మ దాని నదలింపంగన్
గరమలిగి యా కలికనియెఁ-బరికింపక నీ దురితము నడిగెద వేలా. 79

క॥ గనకున్నవారె నీ చరి-తను మఱి వినకున్నవారె ధాత్రిజనంబుల్
పనివడి వినిపింపవలెనె-యనువుగ నొనరించిన ఘన దైత్యకృతులిఁకన్. 80

క॥ సమసిరిగదె సప్తవరులు-భ్రమతో నిన్నుఁ బెండ్లియాడి పంతముతోడన్
దమకక దునిమితివిగదె ప-రమ పాతకురాల నన్ను నట్లుఁ జంపుదువే. 81

తే॥ శూలముల బోలి నాతి ప్రశ్నోత్తరంబు-కర్ణ రంధ్రంబుఁ జొచ్చిన నలుకఁ బూని
నించు కక్కడ సారమ్మ నిలువలేక-తనదు మందిరంబును జేరి తలఁచె నిట్లు. 82

---

74. నిర్మల గుణగణ ధామ=నిర్మలమైన గుణముల సమూహము స్థిరముగా గలదియైన; పొదలియున్న=కలిగి యుండినప్పటికి;

75. ఆకోమలి=ఆ స్త్రీ ఏడుగురిని అతిశయించిన ప్రేమతో పెండ్లి చేసికొనినను; చింతయు ఒదవన్=చింత కలుగునట్లు; ఒక్కరు దక్కక=ఒక్కరుకూడ బ్రతుకక; కడువడిన్ మృత్యువు కరములఁ జిక్కిరి=మిక్కిలి శీఘ్రముగా మరణముయొక్క చేతులలో తగులుకొనిరి (చనిపోయిరి.)

76. పెనుభూతము ఒకటి తనదు ఘనక్రోధము తీర్చుకొనగా=పెద్దదయ్యము గొప్ప పగ సాధించుటకు; ఘాతుక కార్యంబు ఒనరించె=క్రూరమైన పని చేసెను; అంతన్=అందువలన; తరుణి తపింపన్=ఆ స్త్రీ విచారపడునట్లు; కడువడి తనువుల బాసిరి=వేగమే వారు వారి శరీరములు విడిచిపెట్టిరి (చనిపోయిరి.)

77. వారి చావునకు ఆ స్త్రీ హేతువు ఎంతమాత్రము కాను, అట్లయినను పౌరులు సారమ్మ నేరమును కావించెనని మనస్సులో నమ్మిరి.

78. తల్లకుచు=భయపడుచు; ఆదరవనుచు=గొప్ప తపస్సు తనకు ఆదరవు అని నమ్మె;

79. పరిచారిక పొరపాటు సవరింప=పరిచారిక తప్పును చక్కచేయుటకై=అదలింపగ=బెదరింపగా; కరము అలిగి=మిక్కిలి కోపపడి; పరికింపక నీ దురితము=నీ తప్పును నీవు విచారించుకొనక; అడిగెద వేల=యెందుకు నన్ను అడిగెదవు (అని) ఆ కలికి అనియె.

80. ధాత్రి జనంబులు=ఈ లోకములోని జనులు; కనక యున్నవారె నీ చరితను=నీ నడతను తెలిసికొనక యుండువారలా; మఱియు వినక యుండువారలా; ఒనరించిన ఘన దైత్య కృతులు=నీవు చేసిన రాక్షస కార్యములను; అనువుగా=బాగుగా; పనివడి వినిపింపవలెనా=పూనికతో విశదముగా చెప్పవలయునా.

81. భ్రమతో=ఆశతో పెండ్లాడిన; సప్తవరులు=నీ యేడుగురు భర్తలు; సమసిరి=చచ్చిరి; తమకక దునిమితివి=బొంకక చంపితివి; గొప్ప పాపాత్మురాల.

తే॥ మాన మరయంగఁ బ్రాణసమాన మవని,
మానమె ధనము, వెలది సన్మానమొందు
మానమువలన, నొరఁగెడు మానహాని
కంటెఁ బ్రాణహానిని బొంద ఘనత కాదె. 83

క॥ అని మానమున నెంతయుఁ బొడ-మిన వగతో ధరణి వ్రాలి యేకాంతముగన్
దనువు కృశింపఁగ ఘన నిర-శన వ్రతమున నుండె నామె సంతాపముతో. 84

క॥ దురిత రహితమగు జీవిత-చరితమునఁ బరఁగిన దాన నవని నిరతమున్
నరులు బుధులైనను నొరులఁ-బరికింపఁగ బ్రజ్ఞగలదె వారికి నెంతేన్. 85

క॥ పరమాత్ముఁ డొకఁడె యెఱుఁగును-నరులకుఁ గల మర్మమెల్ల నంత దెలియనే
రరు జనులుగావున నేఁ-బరితాపము నొందనేల భయకంపితనై. 86

వ॥ అని. 87

సీ॥ ధైర్యంబు మతిఁ దోప దైన్యంబు విడనాడి-ధరనుండి వడి లేచి తగిన రీతిఁ
బటుతర భక్తితోఁ బరమాత్ముని దలఁచి-సర్వజ్ఞుఁడవు నీకు సాటిగలరె
జనన మాదిగ నిన్నె సర్వదా నెన్నుకొంటి-నాత్మ గురుఁడవని యాశ్రయించి,
కనలేక జనులెల్ల ఖండించు వారలె-దురితచరితనని కరుణఁ బాసి.

---

82. శూలముల బాతి=బాణములవలె; నాతి ప్రశ్నోత్తరంబు కర్ణరంధ్రంబు జొచ్చిన=ఆ స్త్రీయొక్క ప్రశ్నయును ఉత్తరమును చెవి రంధ్రములో గ్రుచ్చుకొనగా; అలుక పూని=కోపపడి; ఇంచుకక్కడ=కొంచెము నేనైనను సారమ్మ అచ్చోట నిలువజాలక;

83. మానము అరయంగ ప్రాణ సమానము అవని=విచారింపగ గౌరవము ప్రపంచములో ప్రాణముతో సమానమైయున్నది; మానమె ధనము=గౌరవము భాగ్యమైయున్నది; వెలది సన్మానమొందు మానము వలన=స్త్రీ మానమువలన ఘనము పొందును; తొరగెడు మానహానికంటె=సంభవించు గౌరవనాశనముకంటె; ప్రాణహాని పొంద=మరణము పొందుట ఘనముగా నుండదా.

84. పొడమిన వగతో=కలిగిన దుఃఖముతో; ధరణి వ్రాలి=భూమిమీద పడి; తనువు కృశింప=దేహము క్షీణింపగా; నిరశనవ్రతము=ఉపవాసముగా (నిర్ అశనము=భోజనము లేక).

85. దురిత రహితమగు జీవిత చరితమున=పాపములేని జీవితముయొక్క నడతతో; అవని నిరతమును=భూమిలో నెల్లప్పుడు; పరగినదాన=ప్రకాశించెడుదానను; నరులు బుధులైనను=మనుష్యులు జ్ఞానులైనను; వారికి ఒరుల బరికింపగ ఎంతేన్ ప్రజ్ఞ గలదే=ఇతరుల నుంచి చెబ్బరలనుగూర్చి విమర్శించుటకు ఎంతైనను శక్తి గలదా?

86. నరులకు గల మర్మములెల్లనంత=మనుష్యులలో గల రహస్యములనెల్ల దేవుడొకడుమాత్రమె ఎఱుగును; తెలియనేరరు=జనులు తెలిసికొనజాలరు; భయకంపితనై=భయముచే వణకెడుదాననై -అటుగా చింత పడనేల?

88. ధైర్యంబు మతిన్ తోప దైన్యంబు విడనాడి=మనస్సులో ధైర్యము కలుగగా చిన్నవోయినతనము విడిచిపెట్టి; ధరనుండి వడి లేచి=భూమినుండి తత్క్షణమే లేచి; పటుతర భక్తితో=నిశ్చలమైన మనస్సుతో సర్వేశ్వరుని దలంచి; సర్వజ్ఞుడవు=అంతయు దెలిసినవాడవు; నీకు సాటిగలరే=నీకు సమానులు గలరా?; జనన మాదిగ=పుట్టినది మొదలు; ఆత్మ గురుడవని ఆశ్రయించి=ఆత్మరక్షకుడవని; నిన్నె సర్వదా నెన్నుకొంటిని=నిన్నె ఎల్లప్పుడు ఎన్నుకొంటిని; కరుణబాసి=దయలేక; కనలేక=గ్రహింపజాలక; జనులందఱు; దురిత చరితనని=చెడు నడవడిక గలదాననని; ఖండించువారలె=దూషించువారలే.

తే॥ స్వాంత మందున నీనామస్మరణ సల్పఁ
దలఁపులేని ఖలుఁడు గష్టములు గలుగఁగ
నీదు కృప నపేక్షింపఁగ నెనరుఁ జూపఁ
గల్గు దయానిధీ కరుణింప వలదె నన్ను. 88

క॥ ఘనతర తపంబున నెపుడు - నినుఁ బహు పూజించుచుంటి నిశ్చల భక్తిన్
గనఁజాల కిదియు జగతిని - జను లవమానముగఁ బిలువ శ్రమ గలిగెడున్ 89

సీ॥ సత్యోపదేశంబు సర్వదా మదిఁ బెట్టి - సత్ప్రవర్తనమునె సంపదనఁగఁ
బాటించి సర్వేశ్వ రానుమతి నెఱింగి - సజ్జన గోష్ఠికి సమ్మతంబు
గావించి పిన్నలఁ గరుణతోఁ బరికించి - బ్రతికియుండఁగ నాదు పగఱులెల్ల
దూరీకృతంబగు దోషంబుఁ బైమోపి - దుఃఖాబ్ధియందున ద్రోచినారు.

తే॥ ఘన రహస్యార్థప్రాజ్ఞుండ కరుణతోడఁ
బరుషవాక్యంబు వినకుండ పరము జేర్చు
కల్మషంబును గనకుండ కన్ను మోడ్చు
తగిన ఫలము ననుభవింపఁ దాపు జేర్చు. 90

వ॥ మనిన నేక తరుణమందు నిర్మల చిత్తులగు తోభ్యుఁడును సారన్ముసు కడు వినయమున
జేసిన మనవి భక్తవత్సలుండగు సర్వేశ్వరుఁ డెఱింగి తన యసంఖ్యాత గణంబుల
లోన రఫేలుండనెడు నామంబు గల ప్రమథు నొక్కనిం జీరి, తోభ్యుని దారాసుత

స్వాంతమందున నీ నామస్మరణ సల్ప దలపులేని ఖలుడు=హృదయములోనైనను నీ నామమును స్మరించుటకు తలంపులేని పాపి; కష్టములు గలుగగ=కష్టములు వచ్చినప్పుడు; నీదు కృప నపేక్షింపగ=నీ దయను కోరగా; నెనరు జూపగల్గు దయానిధి=కరుణ జూపు దయ అను సముద్రమా; కరుణింపవలదె నన్ను=నన్ను దయతో జూడరాదా?

89. ఘనతర తపంబున=గొప్ప తపస్సులో; నిశ్చల భక్తితో=చలింపని భక్తితో; నిను పూజించుచుంటిని గనజాలకిదియు జగతి జనులు అవమానముగ బిలువ=ఇదియంతయు జనులు తెలిసికొనజాలక నిందింపగా; శ్రమను గలిగెడున్=మనస్సునకు బాధ కలుగుచున్నది.

90. సత్యోపదేశము ఎల్లప్పుడును మనస్సులో పెట్టుకొని; సత్ప్రవర్తనమునె సంపదనగ పాటించి=మంచి నడవడిక భాగ్యముగా తలంచి; సర్వేశ్వరానుమతి నెఱిగి=దేవుని ఇష్టము తెలిసికొని; సజ్జన గోష్ఠికి సమ్మతంబు గావించి=పెద్దల సమూహమునకు సమ్మతము కలిగించి; పిన్నల పరికించి=చిన్నవారలను దయతో జూచి నేను బ్రతికియుండగా; నాదు పగఱులెల్ల=నా పగవారలు; దూరీకృతంబగు=తగని నేరమగు దోషము నా మీద మోపి నన్ను దుఃఖమనెడు సముద్రములో త్రోసిరి.

ఘన రహస్యార్థప్రాజ్ఞుండ=గొప్ప రహస్యముల అర్థమును తెలిసినవాడా; పరుషవాక్యంబు వినకుండ పరము జేర్చు=నేను కఠిన వాక్యములు వినకుండులాగున నన్ను మోక్షమున చేర్చుకొనుము; కల్మషంబు గనకుండ కన్ను మోడ్చు=నేను పాపము చూడకుండ కన్నులు మూసికొనునట్లు జేయుము; (అనగా మరణము కలిగించుము) తగిన ఫలంబు ననుభవింప=అర్హమైన ఫలము పొందుటకు; దాపు జేర్చు=దగ్గర జేర్చుకొనుము.

91. భక్తవత్సలుండు=భక్తులమీద నిండు ప్రేమ గలిగినయట్టి దేవుడు; తన అసంఖ్యాత గణంబులోన=తనయొద్ద నున్న లెక్కలేని (సేవకుల) సమూహములో; ప్రమథు నొక్కనిం జీరి=రఫేలుడు అను సన్మనస్కుని పిలిచి; తోభ్యుడు దారాసుత=తోభ్యుడు భార్య కుమారుడు అను వీరినికూడ కాపాడుటకు నిర్ణయించితిని; కొన్ని వత్సరములు ఇహ సౌఖ్యములు=ఇంక కొన్ని సంవత్సరములు (తోభ్యుడు) ఈ లోకములోని సుఖములు

సమేతంబుగ రక్షింప నవధరించితి మింకఁ గొన్ని వత్సరంబు లిహ సౌఖ్యంబు లనుభ
వింపఁగలండు: ఇదియునుంగాక మఱియొక్క భక్తురాలిం గటాక్షింపవలయు నెట్లనిన,
రాగెస్సారిలోని రాగ్వేలుఁ డను నధీశ్వరుని కూఁతురు సారమ్మ యనం గలదు. తజ్జన
కుండు దానిం బరిణయంబు సేయం గోరిన, వరు లేడ్వురును గ్రమంబున నొక్క
భూతంబుచేతంజచ్చిన విఫలమనోరథయై యత్యంత దుఃఖంబున నైదువతనంబభిలషించి
యతిశయ నిష్ఠాగరిష్ఠభావంబున నన్ను భజియించుచున్నయది. దాని యైదువతనం
బభివృద్ధిగాఁ దోభ్యునకుఁ గోడలగునట్లు సంఘటింపవలయుం గావున నీవు మర్త్యం
బున కరిగి తత్సహకారిత్వంబు పాటించి వారల కార్యము సేయవలయుం బొమ్మని
యానతిచ్చిన మహాప్రసాదంబని తత్పార్షదుండు మర్త్యలోకమున కరుగుదెంచి
యచ్చటచ్చట నిచ్ఛావిహారంబు సేయుచుండెనంత, 91

క॥ తన విన్నపంబును గడప - ఘన దేవుం డాలకించెఁ గరుణం దాఁ గో
రిన మరణంబిఁకఁ గల్గన - ని నమ్మి తోభ్యుఁడు సుతుఁ గని యిట్లని చెప్పెన్: 92

సీ॥ భార్యన్ సుతుని మఱిఁ బ్రాణము సర్వస్వ - మును డించి పరపురంబునకుఁ బోవ
నున్నాఁడ వరపుత్ర చెన్నుగ నా పల్కు - లైకొమ్ము, నియమిత కార్యమెల్ల
నతి ప్రీతిఁ ధర్మ మనఁగ నెంచి తగ సల్పు - దిక్కుమాలితివని యే దిక్కు లేద
ని వగపుఁ జెందక నిశ్చల మతితోడ - దైవభక్తి గలిగి తనరు మనిన,

తే॥ దొరఁగె బాష్పధారలు మోము దొప్పఁదోఁగ - వగలు మిగుల నేడ్పు గలిగె నంత గ్రుందు
కొమరుని శిరముపై వ్రాలి కొంతసేపు - బుజ్జగించి తోభ్యుఁడు ప్రీతిఁ బొల్చెనగఁగ. 93

---

అనుభవించును; కటాక్షింపవలయును=దయతో రక్షింపవలయును; తజ్జనకుడు=ఆ సారమ్మ యొక్క తండ్రి ఈమెకు పెండ్లి చేయుటకు కోరినప్పుడు; వరులు ఏడ్వురు క్రమంబున=ఏడుగురు పెనిమిటులు ఒకరి తర్వాత నొకరు ఒక పిశాచముచేత చచ్చినప్పుడు; విఫల మనోరథయై=తన కోరిక వ్యర్థము కాగా; అత్యంత దుఃఖమున ఐదువతనంబు అభిలషించి=మిక్కిలి విచారముతో తన పెనిమిటి బ్రతికి యుండవలయునని కోరి; అతిశయ నిష్ఠాగరిష్ఠభావంబున =ఎక్కువయైన నియమముతో కూడిన మనస్సుతో నన్ను ప్రార్థించుచున్నది; ఐదువతనము=సువాసినీత్వము; (ఐదు + వ=అయిదు వన్నెలు గలిగియుండునది; మంగళసూత్రము, పసుపు, కుంకుమను, గాజులు, చెవ్వాకులు, ఇవి భర్త బ్రతికియున్నదానికే గాని విధవకు నుండగాదు, ఈ ఐదు వన్నెలు గల స్త్రీని ఐదువ యందురు;) అభి వృద్ధిగాన్=ఎక్కువ యగునట్లు; తోభ్యునకు కోడలు అగునట్లును=నీవు ఆ స్త్రీని తోభ్యుని కొడుకునకు పెండ్లి చేయవలయును; మర్త్యంబు=భూలోకమునకు; తత్ సహకారిత్వము పాటించి=గబేలుని పురమునకు వెళ్లు తోభ్యుని కొడుకునకు సాయముగా నుండి; మహాప్రసాదమని=ఇది గొప్ప దయ యని (దేవుడు తనకిట్లు పని చెప్పుట ఘన కార్యమని); తత్పార్షదుడు=ఆ సన్మనస్కుడు; ఇచ్ఛా విహారంబు=తనకు తోచిన తావులందు తిరుగుచున్నప్పుడు.

92. తన మనవిని కడపట దేవుడు ఆలకింపగ తాను కోరుకొనిన మరణము ఇంక కలుగునని తోభ్యుడు నమ్మి సుతునితో నిట్లు అనెను.

93. సర్వస్వము డించి=కలదాని నంతటిని విడిచిపెట్టి; పరపురమునకు=ఇతర లోకమునకు పోవుచున్నాను; వరపుత్ర=వరమువలన జనియించిన కుమారుడా; చెన్నుగా=బాగుగా నా మాట వినుము; నియమిత కార్య మెల్ల= నియమించిన కార్యము లన్నిటిని; అతి ప్రీతిన్ ధర్మమనగా=మిక్కిలి ప్రీతితో ధర్మము అని దలచి; తగ సల్పు=తగినట్లుగా చేయుము; దిక్కులేనివాడవైతివి (అయినను) ఏ దిక్కు లేదని వగపుచెందక=చింతపడక; నిశ్చల మతితో=చలింపని మనస్సుతో; దేవునియందు భక్తి కలిగి తనరుము=వర్ధిల్లుము; అనగా మోము దొప్పదోగ =ముఖము తెగవాచి; బాష్పధారలు దొరగె=కంటినీళ్లు వచ్చెను; వగలు మిగుల=చింత అధికముకాగా ఏడ్పు

వ॥ సతని కనియె. 94

క॥ విను సుఖ దుఃఖములు నరుల - కనువై యుండవు మఱి యవి యాధీనములౌ
ఘన సర్వేశ్వరునికి నింక - మన క్లేశముఁ బాప శక్తి మనకుం గలదే. 95

క॥ వగపొందక యాత్మజ నే - జగతిని విడనాడ నాదు శవమును బదిలం
బుగ గొని వేద్యుక్త క్రియల - మొగి జేసి సమాధియందు నుంచుము మమతన్. 96

తే॥ నాదు ప్రాపున నున్నట్టి నీదు మాత - మేది దిక్కుమాలి జనక మిగుల వగచి
నీ కడ బ్రదుకునట్లుగ నియతితోడ - మాతృసౌహార్దమె దలంచి మనుము పుత్ర. 97

సీ॥ మొదలఁ దొమ్మిది మాసములు గర్భభారంబు - దాల్చి తత్ప్రసవవేదనకు నోర్చి
ముదముతో నినుఁ గని ముద్దుగాఁ బెంచుచు - వేఁకి వెచ్చలఁ పట్ల వెతలనొంది
మాన్పుచుఁ గరుణమై మఱియు నాఁకొననీక - తన నోటి కడియైన దాఁచిపెట్టి
కినిసినయెడ బుజ్జగించి సమ్మతిఁ జేసి - కల తప్పులన్నియుఁ గ్రమ్మపుచ్చి
తే॥ యెప్పుడు సంధ్యల నిలుఁ వెళ్లనీక మిగులఁ - బ్రేమఁ దనరారఁ గంటికి ఱెప్ప కరణిఁ
బ్రోచెఁ బరపీడ లేమియుఁ బొదవనీక - తల్లి నీకు నెప్పుడుఁ గల్పవల్లి యయ్యె. 98

వ॥ గనుక తల్లి ఋణముఁ దీర్చి యీమె జీవించునంతకుం బోషించి పిమ్మటఁ దత్కాయంబు మత్సమాధియంద నిక్షేపించి విధ్యుక్తప్రకారంబున సుత్తరక్రియలు నిర్వర్తింపుము. సత్యప్రవర్తకుండవై యఖిల భూతదయాపరుండును సత్యస్వరూపుండును

కలిగెను (అనగా బిగ్గరిగా ఏడ్చెనని భావము); అంతట గ్రుంచు కొమరుని శిరముపై వ్రాలి=చింతపడెడు కుమారుని తలమీద వంగి; పొలుపు ఎసగగ=ఒప్పునట్లు; బుజ్జగించి=ఓదార్చి.

95. అనువై యుండవు=అనుకూలముగానుండవు; ఆధీనములౌ=ఘన సర్వేశ్వరునికి స్వాధీనమై యుండును; ఇంక=ఇట్లుండగా.

96. ఆత్మజ=కుమారుడా; వగపొందక=చింతపడక; విడనాడ=నేను లోకము విడిచిపోగ; వేద్యుక్త క్రియల మొగి చేసి=వేదము నియమించిన సాంగ్యములను పూనికతో చేసి; మమతన్=ప్రేమతో.

97. నాదు ప్రాపున నున్నట్టి=నన్ను ఆశ్రయించిన నీ తల్లి; వగచి=చింతపడి; దిక్కుమాలి జనక=అండ లేదని పోకుండ; నీకడ బ్రదుకునట్లుగా=నీ యొద్ద జీవించునట్లు; మాతృసౌహార్దమె తలచి=తల్లియందు ఉండగల స్నేహభావమునే తలంచి; మనుము=జీవించుము.

98. తత్ప్రసవ వేదనకు నోర్చి=ఆ కానుపు బాధకు సహించి; వేకి వెచ్చలపట్ల=జ్వరము తగిలి వేడిమి పడినప్పుడు, వెతల ఒంది=కష్టపడి మాన్పుచు; ఆకొననీక=నిన్ను ఆకలిచే బాధపడనీయక; తన నోటి కడియైనన్=తన నోటిలో పెట్టుకొను ముద్దయైనను దాచిపెట్టి; కినిసినయెడన్=నీవు కోపగించినపుడు బుజ్జగించి; సమ్మతి చేసి=బతిమాలి సమాధానపఱచి; కల తప్పులన్నియు క్రమ్మపుచ్చి=కలిగిన తప్పులు అన్నిటిని కనబడకుండ దాచి; సంధ్యన్ ఇలు వెళ్లనీక=సంధ్యాకాలములయందు నీవు ఇల్లు దాటి యావలకు వెళ్లకుండ; కంటికి ఱెప్ప కరణి=కన్నులను ఱెప్ప యెట్లు కాపాడునో; ప్రేమ తనరారగన్=దయ గలుగునట్లు; పరపీడలు ఏమియు బొదవనీక=ఇతరులవలన కలుగు బాధలను కలుగకుండ జేసి; కల్పవల్లియయ్యె=తల్లి నీకు కల్పవృక్షమువంటిదయ్యెను (ఏమి కోరినను దాని నిచ్చును.)

99. తల్లి ఋణము దీర్చి=తల్లి పడిన కష్టములనెడు అప్పును తీర్చి (అనగా తల్లిని సుఖము పెట్టి) తత్కాయంబు=ఆమెయొక్క శరీరము; మా సమాధిలోనే నిక్షేపించి=పెట్టి; విధ్యుక్తప్రకారంబున=వేదములో చెప్పినరీతిగా; ఉత్తరక్రియలు నిర్వర్తింపుము=చచ్చిపోయినతర్వాత చేయవలసిన పనులు చేయుము; సత్యప్రవర్తకుండవై=సత్యమార్గమున నడచుచు; అఖిల భూత దయాపరుండును=సమస్తప్రాణులయందు దయ గలవాడును; నిర్ ఆకారుండును=రూపములేనివాడును; నిర్ అంజనుడు=దోషములేనివాడును అగు దేవుని సేవించి

నిరాకారుండును నిరంజనుండు నగు సర్వేశ్వరుని భజించి బ్రతుకుము. మృషాభాషణంబు లుడిగి పరుష వాక్యంబుల మాని పరోపకారుండవై యుండుము, భవద్గృహకృత్యంబునం గాయక్లేశంబు నొందిన జనుల కష్టం బెఱింగి యొక్క నిమిషం బెడఁబాయక తద్భృతి నొసంగుము. 99

తే॥ ధర్మమే భూషణము మొగి దల్ప ముక్తి - సాధనంబు గానఁ దెలిసి సంతసమున
నార్జిత కలిమి యాచకులకు నొసఁగు - దీనఁ బుణ్యంబు పెరుగు సత్కీర్తి వెలుఁగు. 100

మ॥ అదనంబౌ గ్రతువు ల్తటాకములు ధ్యానంబు ల్కరు ల్ధేనువుల్
మదిరాక్షుల్ చదువుల్ ధనంబు గృహముల్ మాన్యంబులున్ గ్రామముల్
తుది నెన్నేనియు నన్నదానమునకుం దుల్యంబు గావంచుఁ బ
ల్కుదు రాలాగు నొనర్చుమయ్య మది నాలోచించి వేగంబునన్. 101

సీ॥ అఘ మకాలమృతియు నంటఁజాల వవని - ధర్మంబు సల్పెడు దాత నెప్డు
దలఁప ధర్మాలంకృతులె కరుణకు నాస్ప - దులగు దురంత్యమందున కుమార
యన్యస్త్రీ గమనంబె యంకురింపక యుండ - నర్ధాంగిపై రాగ మధికపఱచు
గర్వోక్తిలోలుఁడై యడకువ దిగనాడి - నర్తింపఁగ వలదు ప్రజలముందు. 102

తే॥ మఱి గజేలుఁడు మొహరీలు పదియుఁ గొనుచు - నప్పు పత్రంబునందుకై వ్రాసియిచ్చె
నదియుఁగొంపోయి చూపంగ నతఁ డొసంగు - ధనము నందుకొని మనుము ధాత్రిలోన.

---

బ్రతుకుము; మృషాభాషణంబులు ఉడిగి=అబద్ధపు మాటలు విడిచి; పరుష వాక్యంబులు=ఎవ్వరితో గాని కఠినముగా పలుకుట విడిచి పరులకు ఉపకారము చేయువాడవై ఉండుము; భవత్ గృహకృత్యంబున=నీయొక్క ఇంటిలోని పనులు చేయుటచే; కాయక్లేశంబు=శరీరమునకు ఆయాసమును పొందిన జనుల; కష్టం బెఱిగి=నీవు చెప్పిన పనులు శ్రమపడి చేయు వారివారి శ్రమ ఎఱిగి; ఎడబాయక=ఒక నిమిషము ఆలస్యము చేయక; తత్ భృతి=వారు పడిన కష్టమునకు తగినట్టి కూలి నొసంగుము.

100. మొగిదల్ప=పూని యోచింపగా; ధర్మమే భూషణము=ధర్మమే ఆభరణము; ముక్తి సాధనంబు=మోక్షము సాధించునది; కాన తెలిసి=ఈ విషయము గ్రహించి; ఆర్జిత కలిమి యాచకులకు=సంపాదించిన భాగ్యము భిక్షగాండ్రకు ఒసగుము; దీనన్=ఇట్లు చేయుటచేత; పుణ్యము పెరుగును; మంచి కీర్తి ప్రకాశించును.

101. అదనంబౌ=మిక్కిలియైన; క్రతువుల్=పూజలు చేయించినను; తటాకములు=చెఱువులు త్రవ్వించినను; ధ్యానములు=జపములు చెప్పినను; కరుల్ ధేనువుల్=ఏనుగులను ఆవులను దానము చేసినను; మదిరాక్షుల్=పడుచులకు పెండ్లి చేసినను (కన్యాదానము); చదువుల్=చదువు చెప్పించినను (విద్యాదానము); ధనంబు=సొమ్ము నిచ్చినను (ధనదానము); గృహముల్=ఇండ్లు కట్టించినను (గృహదానము); మాన్యంబులు=భూములు మాన్యముగా నిచ్చినను (భూదానము); గ్రామముల్=ఊళ్లు ఇచ్చినను (రాజ్యదానము); తుది ఎన్నేనియు=చివరకు ఎన్ని కార్యములు చేసినను; అన్నదానమునకు తుల్యంబు గావు=ఆకలి గొన్నవారికి అన్నము పెట్టుటతో సమానము గావు అని పల్కుదురు (కర్తలు పెద్దలు); ఆలాగు నొనర్చుము=ఈ ప్రకారము చేయుము.

102. అఘము అకాలమృతియు=పాపమును దుర్మరణమును; ఎప్డు ధర్మము సల్పెడు దాతను=ధర్మము నెపుడును చేయువానిని; అంటచాలవు=తాకజాలవు; ధర్మాలంకృతులె=ధర్మముచేత అలంకరింపబడినవారలు; అంత్యమున=కడన; కరుణకు ఆస్పదులగుదురు=దయకు పాత్రులగుదురు. అన్యస్త్రీ గమనంబె యంకురింపక=పరస్త్రీపై మనసు కలుగకుండునటుల; అర్ధాంగిపై రాగము=సొంత భార్యపై ప్రేమను హెచ్చు చేయుము; గర్వోక్తిలోలుడై=గర్వముగల మాటలలో నిచ్ఛగలవాడవై; అడకువ దిగనాడి=వినయమును విడిచిపెట్టి; వర్తింపగవలదు=నడువవద్దు.

అదియు గొంపోయి=ఆ పత్రము తీసికొనివెళ్లి చూపగా; అందుకొని మనుము=తీసికొని జీవింపుము (ద్వితీయాశ్వాసము 15 వ పద్యము చూడుము).

క॥ కడు దారిద్ర్యమున మనము - పడెడు నిడుమల నిఁకఁ జెప్ప నలవిగ నున్నే
యిడుమలఁ బరాత్పరుని దరిఁ - గడవలకు మఱువక యుండి యందుము ముక్తిన్. 103

క॥ దౌర్గత్య హేతు రిపు ష - డ్వర్గామయ వైద్య సుజనవందిత చరణా
సర్గ స్థితి లయ కారణ - నిర్గుణ తత్త్వాభిధాన నిరుపమకరుణా! 104

గద్యము॥ ఇది శ్రీమత్ సునాథ సద్గురుప్రసాదలబ్ధాష్టవిధకవిత్వప్రవీణ వినయధురీణ భారద్వాజగోత్ర పింగళి నాగయామాత్యపుత్ర యెల్లనార్యప్రణీతంబైన సర్వేశ్వర మహాత్మ్యంబను మహాప్రబంధంబునందు సల్మనసరుం డిశ్రేలునకు దాడి వెట్టుటయుఁ, దోభ్య సల్మనసరుల సంభాషణంబును, సల్మనసరుండు శాంతిం బొంది యనేక ధనం బొసంగుటయుఁ, దోభ్యుని ధర్మవ్యయంబును, గబేలుం డతనిచే నప్పుగా ధనంబుఁ గొని పత్రం బొసంగుటయుఁ, బిమ్మట సల్మనసరుని కుమారుండగు సెన్నకేరివలనఁ బ్రజ లార్తిం బొందఁ దోభ్యుని మఱుఁగు సొచ్చుటయు, నతండు వారల నాదరించుటయుఁ, దోభ్యుని సర్వంబునుం గొని నలున దేనవ దినంబున సెన్నకేరి మృతినొందుటయుఁ, నతని మాఁగుండు తోభ్యుని ధనంబును గ్రమ్మఱ నొసంగియుం గూడుండై హింసలు చేయుటయుఁ, దోభ్యుని యన్నదానంబును, బిమ్మట దరిద్రుండై యంధత్వంబు నొందుటయుఁ, దంపతీసుతుల విలాపంబును, తోభ్యుఁడు దేవుని ప్రార్థించుటయు, నొక్క దాసురాలు సారమ్మను నిందించుటయు, నీమె దేవుని శరణు చొచ్చుటయుఁ, సర్వేశ్వరుండు సన్మనస్సరుని మూర్తిబంబున కనుపుటయు దోభ్యుండు కుమారుననునయించి గబేలునివలని ధనంబుఁ దెచ్చుకొమ్మనుటయు నన్నది ద్వితీయాశ్వాసము. 105

103. ఇడుముల=కష్టమును; నలవిగ నున్నే=సాధ్యముగా ఉండునా;

104. దౌర్గత్య హేతు రిపు షడ్వర్గ ఆమయ వైద్య=నరకమునకు కారణమైన విరోధులగు ఆరు గుణములనెడు రోగమునకు వైద్యుడా; (అరి షడ్వర్గము లేవనగా: కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యములు) సుజన వందిత చరణా=మంచివారిచే నమస్కరింపబడిన పాదములు గలవాడా; సర్గ స్థితి లయ కారణ=పుట్టించుటకు కాపాడుటకు నాశనము చేయుటకు హేతువైనవాడా; నిర్గుణ తత్త్వ అభిధాన=గుణరహితమైన నిజస్వరూపము గల పేరుతో నున్నవాడా; నిరుపమ కరుణా=సాటిలేని దయగలవాడా.

# తృతీయాశ్వాసము.

క॥ ఆరంభ కారణా యశ - రీరా సకల సుగుణనిధి యేకోనాథా
మేర విదూర స్వయంభువ - చారిత్ర రహిత యనాది సర్వేశ్వరుఁడా. 1

తే॥ అవధరింపుము తదనంతరాభివృత్త - మనఘచరితులు సర్వేశ్వరాంఘ్రికమల
భక్తినిష్ఠాగరిష్ఠు లాసక్తిఁ దనర - విన్నవించెద నెలమి సవిస్తరముగ. 2

ఉ॥ అత్తఱిఁ దోభ్యుఁ డీకరణి నాత్మతనూజు ఋణార్థమైన య
వ్విత్తము గాంచి నీ నెగులు వీడు మటన్న గబేలు వీటి కే
నిత్తఱి నొంటిగాఁ జనుట యెట్లొనగూడు నరణ్యభూమి నే
యుత్తముఁడైనఁ దోడుపడఁడో యని యాతఁడు చింతనొందుచున్. 3

ఆ॥ ఇల్లు వెడలి నగర మల్లనఁ గడచి పోఁ - దలఁచుచుండఁ జూచి యులుకు సత్త్వ
భీతి నలుకుఁ బోయి యింటికి మగుడుచు - యరుగు వెలికి మది సహాయ మరయ. 4

సీ॥ ఇట్లు సందేహింప నెంతేయుఁ దోఁప కొ - క్కరుఁడును నగరోపకంఠభూమిఁ
దచ్చాడుచును దత్పథక్షేప మగపడు - జనముల నరసెడు సమయమునను
నాజానుబాహుఁ డుద్యద్భానునిభ తేజుఁ - డతులిత ఘన సుందరాంగుఁ డనఘుఁ
డత్యంత శాంతియుక్తాంగుఁ డనాచార - దూరుఁ డామ్రేడితస్తూయమాన

---

1. ఆరంభకారణా=ఆదికారణమైనవాడా; అశరీరా=శరీరము లేనివాడా; సకల సుగుణనిధి=అన్నిమంచిగుణములకు గనియైనవాడా; మేర విదూర=ఎందును వ్యాపించి యున్నవాడా; స్వయంభువ=తానై యున్నవాడా; చారిత్రరహిత=చరిత్రలేనట్టి (మార్పులేని).

2. ద్వితీయాశ్వాసము రెండవ వచనము చూడుము.

3. అత్తఱిన్=తోభ్యుడు తన కుమారునితో మాటలాడినప్పుడు; ఋణ అర్థమైన ఆ విత్తము గాంచి నీ నెగులు వీడుము అటన్న=అప్పుక్రింద నిచ్చిన ఆ ధనము పొంది నీ దుఃఖము విడిచిపెట్టుము అని చెప్పగా; గబేలు వీటికి ఏను=గబేలుడు ఉన్న పట్టణమునకు నేను ఒక్కడను పనుట; ఎట్లు ఒనగూడును=సాధ్యపడును; ఆగణ్యభూమిన్ ఏ యుత్తముడైనను తోడుపడడో=ఆ యడవులలో ఏ పుణ్యాత్ముడైనను తోడుగాడా?

4. నగరము అంత గడచి పో తలచుచుండగా; చూచి యులుకు=అడవి మార్గమును చూచి బెదరెను; సత్త్వభీతిన్ అలుకును=దుష్టమృగముల భయముచేత భయపడెను; ఇంటికి తిరిగి పోయెను వెలికి=బైటికి పోయెను; సహాయము అరయ=తోడు వెదకుటకు (చిన్న తోభ్యుడు యేమి చేయ తెలియక ఇటునటు తిరిగెను.)

5. ఎంతయు తోపక=ఏమియు తోచక; నగర ఉపకంఠ భూమిన్=పట్టణము సమీప ప్రదేశమందు; తచ్చాడుచును=తోపక ఇటునటు తిరుగుచు; తత్పథక్షేపము అగపడు జనముల=ఆ మార్గము గడచుటకు కనబడు మనుష్యులకొరకు; అరసెడు సమయమున=వెదకుచున్నప్పుడు; ఆజాను బాహుడు=మోకాళిమీదికి వ్రాలిన భుజములుగలవాడు; ఉద్యత్ భాను నిభ తేజుడు=ఉదయించుచున్న సూర్యుని కాంతివంటి కాంతిగలవాడు; అతులిత ఘన సుందర అంగుడు=సాటిలేని అందమైన పెద్ద దేహము కలవాడు; అనఘుడు=పాపము లేనివాడు; అత్యంత శాంతి యుక్త అంగుడు=మిక్కిలి శాంతమైన (కోపము తొందరలేని) శరీరము కలవాడు; అనాచార దూరుడు=చెడ్డ అలవాటును దూరముగా వదలినవాడు; ఆమ్రేడితస్తూయమాన చరితుడు=రెండు మూడు మారులు స్తోత్రము పొందదగిన చరిత్రము కలవాడు; అయినట్టి యొక మహా పురుషుడు ముందట కనబడగానే; అతనిన్ కదసి=దగ్గఱకు వెళ్లి భక్తితో; అగ్ర దండ ప్రణామమున్ ఆచరించి=ఆ మహా పురుషునకు తగినట్లు నమస్కారములు చేసి; వినయ వైఖరిన్=అడకువతో.

తే॥ చరితుఁడైనట్టి యొక మహా పురుషుఁ డెదుటఁ - గానఁబడుటయు నాతనిఁ గదిసి భక్తి
నష్టాదండప్రణామంబు లాచరించి - వినయవైఖరి దీనుఁడై వీక నిలిచి. 5

తే॥ దైవపంపున దివినుండి ధరకరిగిన - సన్మనస్కుండగు రఫేలుఁ డతఁడని గన
లేక చిన్నతోభ్యుఁడు ప్రాంజలియగుచుఁ గడు - వినయమునఁ జేరి వానితో ననియెనిట్లు 6

ఉ॥ ఎచ్చటినుండి నేఁ డెచటి కేగుచు నిచ్చటి కేగుదెంచినా
రెచ్చట నుందు రేది కుల మెయ్యది నామ మెఱుంగఁ జెప్పరే
సచ్చరిత ప్రభావ గుణ సంపద లియ్యెడఁ దోఁచుచున్న వే
నిచ్చట నొండుచో సరుగ నెంతయుఁ దోఁపక యుంటి నొంటిమై. 7

చ॥ అనవుడు భక్తరక్షణకు నై యరుదెంచిన యమ్మహాత్ముఁ డా
తని హృదయం బెఱింగి విదితంబుగ నిట్లని పల్కె నిజ్జగం
బునఁ జరియించు జ్ఞానులము పూర్వముఁ దెల్పిన లాభమేమి యేఁ
జనియెద నియ్యెడ న్వడి రగెస్సను వీడు గబేలుఁ జూడఁగా౯. 8

ఉ॥ నా విని సంతసించియు మనంబునఁ దోభ్యతనూభవుండు నా
భావము నీకుఁ దెల్లము నీ ప్రభావము గాంచియు నేను శిష్యవ
ద్భావము నొంది వచ్చెద ముదంబునఁ దోకొని పొందు నన్ను నీ
తావలమైన తావులనుఁ దండ్రికిదే వివరించి వచ్చెద౯. 9

క॥ అని చని తద్వృత్తాంతము - జనకున కెఱిఁగించ జనితసంభ్రముఁడై యా
తనియెడకు నన్నుఁ దోకొని - చను మన రాఁ బోవ నీవశక్తుఁడ వనుచు౯. 10

---

6. దివినుండి=మోక్షమునుండి ధరకు అరగిన; అతడు అని కనలేక=రఫేలుడు అతడే యని తోభ్యుడు తెలిసికొనలేక; ప్రాంజలి అగుచు=చేతుల కట్టుకొన్నవాడై;

7. నేడు మీరు ఎక్కడనుండి ఎక్కడకు వెళ్లుచు; ఏగుదెంచినారు=ఇచ్చటికి వచ్చినారు; సచ్చరిత ప్రభావగుణ సంపదలు ఈయెడ౯ తోచుచున్నవి=మంచి నడవడి మహత్త్వముయొక్క విశేషములు ఈ మీయందు కనబడుచున్నవి; ఏ౯ ఒంటిమై=నేను ఒక్కనిగా; ఒండుచో౯=ఇంకొక తావునకు అరుగ; తోపక ఉంటిని=తలంచలేదు.

8. అనవుడు=అని చెప్పినంతట; భక్తరక్షణకునై అరుదెంచిన=దేవభక్తులను రక్షించు నిమిత్తమై వచ్చిన ఆ మహాత్ముడు; అతని హృదయము ఎఱిగి=చిన్నతోభ్యుని అభిప్రాయము తెలిసికొని (గబేలుని పట్టణమునకు పోవుటకు తోభ్యునికి ఒక తోడు కావలెనని తెలిసి) ఇట్లు పల్కెను: మేము ఈ లోకములో తిరుగుచుండు జ్ఞానులము; పూర్వము తెల్పిన=నా వెనుకటి చరిత్రము నీకు చెప్పినయెడ లాభము లేదు; ఇయ్యెడ౯=ఇప్పుడు గబేలుని చూచుటకు త్వరగా రగెస్సు అనెడు పట్టణమునకు వెళ్లుచున్నాను. (ఆ పట్టణము పేరు రాగెసుగాని రగెస్సు కాదు; ఛందస్సు నిమిత్తమై కవి యట్లు వ్రాసినాడేమో.)

9. ప్రథముడు అనగా; తోభ్యతనూభవుడు=తోభ్యుని కొడుకు (చెప్పిన దేమనగా;) నా భావము నీకు తెల్లము=నాతలంపు నీకు స్పష్టముగా ఉన్నది; ప్రభావము= నీ గొప్పతనము చూచి; నేను శిష్యవత్ భావము౯ ఒంది=మీకు శిష్యునివలె కూడ వచ్చెదను, నన్ను తీసికొని వెళ్లుడు; నీ తావలమైన తావులను=మీరు వెళ్లవలసిన చోటు; ఇదే=ఇదిగో ఇప్పుడు.

10. తద్వృత్తాంతము=ఆ సంగతిని తండ్రికి ఎఱిగించగ; జనిత సంభ్రముడై=పుట్టిన తొందరగలవాడై (చూచుటకు ఆశగలవాడై;) అతని దగ్గరకు నన్ను తీసికొని పొమ్మనగా; (కొడుకు చెప్పెను) రాబోవ నీవు అశక్తుడవు=వచ్చుటకును పోవుటకును శక్తి చాలనివాడవు అనుచు.

సీ॥ తడయక పోయి యామౌనిఁ గాంచి నా తండ్రి - కడు వృద్ధు కన్నులఁ గానఁ డిప్పుడు
సర్వేశ భక్తినిష్ఠాపరాయణుఁ డాత్మ - తత్త్వవిజ్ఞుఁడును ధన్యమూర్తి
తొలుత నైశ్వర్యవంతుఁడు ధర్మములు పెక్కు - లొనరించి సత్కీర్తిఁ గనియె జగతి
నిప్పుడ దారిద్ర్య మినుమడించి కృశత్వ - మొదవి మందిరమున నున్నవాఁడు
తే॥ మీరు వచ్చుట విని తన్ను మీ సమీప - మునకుఁ గొంపొమ్మటన్నఁ గైకొనక యతని
నందు నిల్లన నడుపుచు నాలసింప - రామి వచ్చితి నే నసఁ బ్రమథుఁ డనియె. 11

ఉ॥ ఆతని వృద్ధు నంతయుఁ బ్రయాసము నొందఁగఁ జేసి తోడి తే
వైతివి మేలు చేసితివి యచ్చటికే మనమేగు టొప్పు నీ
రీతిని సంతసం బతని కెచ్చును నాకది యెంత దొడ్డ వి
ఖ్యాత యశస్కుఁడై తనరు నాతనిఁ జూచుట ధర్మ మారయన్. 12

క॥ అని కదలిన వెసఁ దానా - తనికంటెను మున్ను పోయి తండ్రికిఁ దెలుపన్
మన యింటికి వచ్చెనె యా - ఘనుఁడని భయవిస్మయములు గడలుకొనంగన్. 13

క॥ పదపద మని సుతు గైకొని - హృదయము రంజిలఁగ వీధి కెదురేగుచుఁ ద
త్పదములఁ బడి దీవన గొని - సదనమునకుఁ దోడి తెచ్చి సమ్యక్ఫణితిన్. 14

తే॥ అర్ఘ్యపాద్యాది పూజనం బాచరించి
భోజనము పెట్టి మృదుశయ్యఁ బొసఁగ నునిచి
తాను నుచితాసనమున నాసీనుఁడగుచు
వినయముఁ బ్రియంబుఁ దోఁప నిట్లనుచుఁ బలికె. 15

**11.** చిన్న తోభ్యుడు ఆలస్యము చేయక ప్రమథుని చూచి (చెప్పెను;) నాతండ్రి కడువృద్ధు=మిక్కిలి ముసలివాడు; సర్వేశ భక్తి నిష్ఠాపరాయణుడు=సర్వేశ్వరునియందు భక్తి నియమముచేత దృఢమైనవాడు; ఆత్మతత్త్వ వివిజ్ఞుడు=జ్ఞానమార్గము తెలిసినవాడు; ధన్యమూర్తి=పుణ్యము చేయువాడు; తొలుత ఐశ్వర్యవంతుడు=కొంతకాలముక్రిందట ధనము గలిగినవాడు; పుణ్య కార్యములను ఎక్కువగా చేసి; సత్కీర్తి కనియెను=మంచి పేరు పొందినవాడు; ఈ ఎడ=ఇప్పుడు; దారిద్ర్యము ఇనుమడించి=ఎక్కువయై (రెట్టించి;) కృశత్వము ఒదవి=నీరసపడి ఇంటిలో నున్నాడు; అతని అందున్=గ్రుడ్డివాడగు అతని మెల్లగా నడిపించుచు ఆలస్యము చేయక నేనొక్కడనే వచ్చితిని అనగా ప్రమథుడు చెప్పెను:

**12.** అతని వృద్ధు=ముసలివాడగు మీ తండ్రి; ప్రయాసము నొందగ చేసి తోడి తేవైతివి=కష్టపడునట్లు చేసి నీవు తీసికొన రాలేదు; ఏగుట ఒప్పున్=అక్కడికి మేము పోవుట మంచిది, ఈ విధముగా సంతోషము ఆయనకు హెచ్చుగా అవును; నాకు అది యెంత గొప్ప=నీ తండ్రియొద్దకు పోవుట నాకు ఎంత గొప్ప పని అవును; విఖ్యాతయశస్కుడై తనరు=అందఱకు తెలియునంతటి మంచి కీర్తిని గడించిన వానిని చూడ పోవుట ధర్మమగును.

**13.** అని కదలిన వెస తాన్=అని ప్రమథుడు కదలగానే చిన్న తోభ్యుడు అతనికంటె ముందుపోయి తండ్రికి తెలుపగా; ఆ ఘనుడు మన ఇంటికి వచ్చెనా అని తండ్రి భయమును అచ్చెరపాటును పొందగా;

**14.** పదపదమని=నడువుము నడువుము అని సుతుని చేయి పట్టుకొని మనసు సంతోషపడునట్లు వీధిలోనికి ఎదురు వెళ్లుచు ఆ ప్రమథుని పాదములమీద పడి (వానివలన) ఆశీర్వాదము పొంది; సమ్యక్ ఫణితిన్=మంచి రీతిగా (బాగుగా;)

**15.** అర్ఘ్యపాద్య ఆది పూజనము=పూజ నిమిత్తము పాదములు కడుగుట మొదలైన సపర్యలు చేసి; మృదు శయ్యన్=మెత్తని పానుపుమీద చక్కగా పరుండ పెట్టి; తాను ఉచిత ఆసనమున ఆసీనుడు=తాను (తోభ్యుడు) తనకు తగిన పీఠముపై కూర్చుండినవాడై; వినయమును ప్రేమమును పుట్టునట్లు ఇట్లు పలికెను.

ఉ॥ దేవర పాదపద్మముల దివ్యపరాగము రాలినంతనే
పావనమయ్యె మద్గృహము భాగ్యము సేకుఱె మోక్షలక్ష్మికిం
దావలమయ్యె నా తపము ధన్యత నొందితి మీ తెఱంగు ప్ర
స్తావము సేయఁ జొప్పడఁగ సత్కృప నానతి యిచ్చి ప్రోవవే
నావుడు సమ్మదంబు వదనంబున లేనగ వీన నిట్లనన్. 16

తే॥ పరమ సర్వేశ దివ్యకృపాకటాక్ష-కలన భావజ్ఞతావాప్తి గలదొకింత
మీకు నావల్లఁ గాదగు మేలొసర్తుఁ-గొమరుఁడును నీవు మదిలోనఁ గోరినట్లు 17

క॥ నీయాత్మభవుని దోడ్కొని-పోయి గబేలునకు నీవు మున్నిడినధనం
బాయ మొనరించి మగుడ-న్వే యొసఁగెద నీ సుతునికి విత్తముతోడన్. 18

చ॥ సకల శుభంబు లబ్బు నిఁక సంశయ మేటికి భక్తినిష్ఠ త
ప్పక యిఁక నుండుమయ్య నినుఁ బొల్పడి రక్షణసేయు మాకు నిం
తకుఁ దడయంగఁ బోలదటుఁ దాఁ జనువార మనుజ్ఞ యిచ్చి పం
పక మొనరింపు మన్న విని భావములోఁ గడు విస్మయంబునన్. 19

ఉ॥ భావము తేటతెల్లముగఁ బల్కె నితండు మహాత్మునిన్ మహా
దేవుఁడు పంపె నన్నుఁ గడతేర్పఁగ నీయెడ ధన్యు నీతనిం
గేవలమర్త్యుఁ డన్న తలఁ గిల్బిష మందు నటంచు సంతసం
బావహిలంగఁ జూడ్కి వినులాంబు కణంబులు జాఱుచుండఁగన్. 20

---

16. దేవర పాదపద్మముల దివ్యపరాగము రాలినంతనే=దేవరవారి పద్మములవంటి పాదములయందలి మంచి పుప్పొడివంటి పాదధూళి పడినవెంటనే; మత్ గృహము=నా ఇల్లు పరిశుద్ధమైనది; భాగ్యము చేకూరెన్=ఐశ్వర్యము పట్టినది; నా తపము మోక్షలక్ష్మికి తావలమయ్యెన్=నేను చేసిన తపస్సు ముక్తియనెడు సంపదకు నివాసనమైనది; ధన్యత నొందితిన్=నేను పుణ్యాత్ముడనైతిని; మీ తెఱగు ప్రస్తావము చేయ చొప్పడగ సత్కృపన్ ఆనతిచ్చి=మీ చరిత్రము స్తోత్రము చేయుటకు అర్హమైనయట్లు చెప్పి నన్ను రక్షింపుము; నావుడు=అని తోభ్యుడు పలుకగా, సమ్మదము వదనమున లేనగవు ఈన=సంతోషముచే ముఖమున లేతనవ్వును కలుగ చేసినట్లు ప్రసమథుడు ఇట్లు పలికెను:

17. సర్వేశ దివ్య కృపాకటాక్ష కలనన్=సర్వేశ్వరుని గొప్ప దయగల చూపు కలిగియుండుటచేత; భావజ్ఞత అవాప్తి ఒకింత=ముందు జరుగబోవు (మనస్సులో నున్న) దానిని తెలిసికొను జ్ఞానమును కొంచెము కలిగియున్నది; నీవును నీ కొమారుడును మదిలో తలంచుకొన్నట్లు; మీకు కాదగిన=కావలసిన మేలును చేసెదను.

18. ఆత్మభవుని=నీ కొమారుని; మున్ను ఇడిన=పూర్వము ఇచ్చిన ధనమును; ఆయము ఒనరించి=రాబట్టి (మగల పుచ్చుకొని); మగుడ=తిరిగి; వే=వేగముగా; విత్తముతోడ=ధనముతోడ

19. శుభంబులు అబ్బు=సమస్తమైన మేళ్లు కలుగును; భక్తి నిష్ఠ తప్పక=దేవునిమీద దృఢమైన భక్తిని విడువక; నిను పొల్పడి=నీ పక్షము పూని; రక్షణసేయు=రక్షింప బోయెడు మాకు; ఇంతకు తడయంగ బోలదు=ఇంతకంటె ఆలస్యము చేయుట (ఇక్కడ నూరక కూర్చుండుట) తగదు; తేన్ జనువారము=మేము వెళ్లెదము; అనుజ్ఞ యిచ్చి=మాకు సెలవు ఇచ్చి; పంపకము ఒనరింపుము=పంపివేయుము; భావములో=మనస్సులో (తోభ్యుడు) మిక్కిలి విస్మయముతో (తలంచుకొనెను.)

20. ఇతడు భావము తేటతెల్లముగా పల్కె=ఇతడు నా మనస్సులో నున్న తలంపును మిక్కిలి స్పష్టముగా చెప్పెను. (కాబట్టి) నన్ను కడతేర్పగన్=నన్ను తరింపచేయుటకు (మోక్షము పొందుటకు, తోభ్యుడు మరణము పొందవలెనని దేవుని ప్రార్థించెను.) దేవుడు ఈ మహాత్ముని పంపెను; ఈ యెడన్=ఈ సమయములో (దేవుడు

వ॥ పునః పునః ప్రణామంబు లాచరించుచు మహాత్మా యుష్మదాగమనం బస్మాదృశ పరిపాలన కారణంబగా నెఱింగినవాఁడనయ్యును భవదనుగ్రహలబ్ధంబగు మద్విజ్ఞానం బునకుం గొఱంతవడనట్లుగా నన్నుఁ గటాక్షించి రక్షింపుమని వేఁడికొనంగలవాఁడ, నని యట్లుండనిమ్ము మీర లిప్పుడు ప్రయాణోన్ముఖులరై యున్నవారలు. అట్లగుటం జేసి భవదీయపునర్దర్శనం బవిలంబకాలంబున నభిలషించితి. మీరు మగుడ నేతెంచుటకు సూర్యాస్తమయానంతరంబున ముకుళీభావంబు నొందిన పంకేరుహంబునడుమం జిక్కువడి తన్మిత్రోదయంబుం గాంక్షించు పుష్పంధయంబు చందంబున నుండఁగలవాఁడ నని విన్నవించునవసరంబునం దత్కులాంగనయు నుభయప్రసంగోచిత వాక్యంబు లాకర్ణించి యభ్యంతరమందిరంబు వెడలి గంధసింధురంబు చందంబున మందయానంబునం జనుదెంచి భర్తకుం బిఱుంద నిజముఖమండప స్తంభంబు మఱుంగున నిల్చి చెఱంగున శిరస్సు గప్పుకొని నిజాంచల ప్రభాజాలంబులం గెలంకుల నలంకరింపం జేయు తన కర్ణాంత విశాల విలోల విలోచన మధుపంబులం దరుణారుణకిసలయసుకుమారంబునైన యతని సుందరచరణారవింద నిష్యంద మకరందబిందు సందోహంబులం గ్రోలుచు నిటలతటంబున నంజలిపుటంబులు ఘటియించి దంతకాంతు లధరబింబంబునం దేజరిల్ల నల్లన నిట్లనియె. 21

నా నిమిత్తమై మహాత్ముని పంపిన సమయములో) ధన్యుని ఈతని కేవల మర్త్యుడు అన్నతఱి=ఈ ఘనుని అందఱి వంటి మనుష్యుడే అని చెప్పునెడల; కిల్బిషము అందు=పాపము వచ్చును; అటంచు; సంతసము అవహిలగా=వేడుక పుట్టగా; చూడ్కిన్ విమల అంబు కణంబులు=నేత్రములనుండి తేటయైన నీటిబొట్లు జాఱుచుండగా;

21. పునః పునః ప్రణామంబులు=మరల మరల నమస్కారములు చేయుచు; (తోభ్యుడు ఈ విధముగా చెప్పెను.) మహాత్మా; యుష్మత్ ఆగమనంబు=మీరు వచ్చుట; అస్మాదృశ పరిపాలన కారణంబు కా=మావంటివారిని రక్షించుటయే కారణము గలదని నేను ఎఱిగినను; భవత్ అనుగ్రహ లబ్ధంబు=తమ దయచేత దొరకినది అగు; మత్ విజ్ఞానంబునకు=నా తెలివికి; కొఱత పడనట్లు=తక్కువకాని విధముగా; వేడికొనంగలవాడ=ప్రార్థించుచున్నాను; ప్రయాణ ఉన్ముఖులరై=వెళ్లుటకు సిద్ధముగా ఉన్నారు; భవదీయ పునః దర్శనంబు=మీయొక్క రెండవసారి దర్శనము (మిమ్ము నేను ఇంకొకసారి చూడవలయును;) అవిలంబ కాలంబున=శీఘ్ర కాలములోనె; అభిలషించితి=కోరితి; మగుడన్ ఏతెంచుటకు=మీరు మరల వచ్చుటకు (తిరిగి యెప్పుడు వత్తురో యని) సూర్య అస్తమయ అనంతరంబున=సూర్యుడు క్రుంకిన తరువాత; ముకుళీభావంబు నొందిన=ముడిచికొనిపోయిన; పంకేరుహంబు నడుమ=పద్మములో చిక్కుపడి; తత్ మిత్ర ఉదయంబు కాంక్షించు=ఆ సూర్యుడు ఉదయించుటకై కోరుచున్న; పుష్పంధయంబు చందమున=తుమ్మెద రీతిగా; అని (తోభ్యుడు) విన్నవించునప్పుడు; తత్కులాంగన=అతని భార్య; ఉభయ ప్రసంగోచిత వాక్యంబులు ఆకర్ణించి=వారిద్దరు మాటలాడుకొనుటలో జరిగిన పలుకులు విని; అభ్యంతర మందిరము=అంతఃపురము వెడలి; గంధసింధురము చందమున=మదించిన యేనుగువలె; మందయానంబున=మెల్లగా నడచుచు; భర్తకున్ పిఱుంద=తన మగని వెనుకప్రక్కను; నిజముఖ మండప స్తంభంబు మఱుంగున=తన ముఖము మొగసాలయొక్క స్తంభమునకు చాటున నిలిచి; చెఱంగున=పైటకొంగుతో తల కప్పుకొని; నిజ అంచల ప్రభాజాలంబులన్=తన అంచులనుండి వెడలు వెలుగులను; కెలంకులన్ అలంకరింప చేయు=ప్రక్కప్రక్కలను అలంకారముగా నుండునట్లు చేయు; తన కర్ణాంత విశాల విలోల విలోచన మధుపంబులు=తన చెవిదాక వచ్చిన విశాలమై చలించుచున్న నేత్రములనెడు తుమ్మెదలచేత; తరుణ అరుణ కిసలయ సుకుమారంబునైన=లేత యెఱ్ఱని చిగురులవలె మృదువైన; అతని=ప్రమథుని; సుందర చరణారవింద నిష్యంద మకరంద బిందు సందోహంబులన్=అందమైన పాదములనెడు పద్మములనుండి బైలుదేరు తేనె బొట్టులయొక్క సమూహమును; క్రోలుచు=త్రాగుచు; నిటలతటంబున=నొసటిమీద (నొసలు=నుదురు) అంజలిపుటంబులు ఘటియించి=దోసిళ్లు

ఉ॥ చూడమె తత్త్వవేదులను జూడమె మౌనుల సిద్ధవర్యులం
జూడమె మీ మహామహిమ చొప్పడు ధన్యులఁ జూడ మెన్నఁడుం
జూడఁగ నబ్బెనేఁడు పరిశుద్ధమనస్కుల మిమ్ముఁ గన్నులన్
వేడుక పుట్ట వీనులకు విందులొనర్చెను వాక్యవైఖరుల్. 22

క॥ ఈ తెరువున మీ రిచ్చటి - కేతెంచినకతనఁ జింత లెడచనియెఁ బదా
ర్థాతురుఁడై మీ వెంబడి - యేతెంచుట కుబ్బుచు[illegible] 23

తే॥ చెడ్డయింటికి చెదార మీ బిడ్డ యొకఁడు
కంటఁ బడుచుండ బ్రతికితిఁ గాని యొండు
గోర నేమియు మది నొక్క కొడుకు కొడుకు
గాఁడు మఱి యొక్క కన్నునుఁ గన్ను గాదు. 24

ఉ॥ బాలుఁడు వీని నింతకును బాముల నొందఁగ నీక పెంచితిం
దాళఁగఁజాల డాఁకటికి దప్పికి వేళ యతిక్రమించినన్
మేలొనరింపఁ గైకొనిన మిమ్ముఁక నేమని వేఁడుకొందు నా
జాలి తొలంగు టెట్లు మునిసత్తమ సత్కృప నానతీయవే. 25

క॥ అనవుడు ప్రమథుం డిట్లను - వనజేక్షణ యింత వంత వలవదు నీకున్
ఘను నఖిలేశ్వరు నమ్మిన - జనులమతం బెఱుఁగవలదె చర్చింపంగన్. 26

---

గూర్చి; దంతకాంతులు=దంతపు కాంతులు; అధర బింబంబునన్=బింబము (దొండపండు)వంటి పెదవిపైన; తేజరిల్లన్=ప్రకాశింపగా; అల్లనన్=మెల్లగా ఇట్లనియెను.

22. తత్త్వవేదులను చూడమె=వేదాంతులను ఎందఱనో చూచినాము; మౌనుల సిద్ధవర్యులను=మునులను యోగసిద్ధులను ఎందఱనో చూచినాము; కాని; మీ మహామహిమ చొప్పడు ధన్యుల=మీవంటి గొప్ప మహాత్త్వము కల్గిన పుణ్యాత్ములను; ఎన్నడును చూడలేదు; పరిశుద్ధమనస్కులన్=పరిశుద్ధమైన మనస్సుగల మిమ్ము నేడు కన్నులతో చూచుట అబ్బెన్=దొరికినది; వాక్యవైఖరుల్=మీ మాటలతీరు; వీనులకు విందులొనర్చెను=చెవులకు పండుగ చేసినవి; వేడుక పుట్ట=సంతోషము పుట్టునట్లు.

23. ఈ తెరువున=ఈ దారిన మీరు వచ్చుటచేత; నా చింతలు ఎడచనియెన్=నా దుఃఖము దూరముగా తొలగి పోయినవి; పదార్థ ఆతురుడై=వస్తు సామగ్రియందు ఆశగలవాడై (ఇతరులయొద్దనున్న ధనము తీసికొనవలెనను తొందర కలవాడై) మీతో ఏతెంచుటకు ఉబ్బుచున్న=సంతోషపడుచున్న; ఇతని కనుడి=ఈ నా కుమారుని దయతో చూడుడు.

24. ఈ బిడ్డ చెడ్డయింటి=చెడిపోయిన మా యింటిలో చెదారము (స్వల్పమైన గడ్డి పఱకవంటివాడు;) ఒక్కడు=ఒక్కడే కలడు (నాకు రెండవవాడు లేడు;) కంట బడుచుండన్=కనబడుచుండుటచేతనే బ్రతికితిని గాని; ఏమియూ ఒండు గోరను=నాకు ఇతరమేమియు వలదు; "ఒక్క కొడుకు కొడుకుకాడు ఒక్కకన్ను కన్ను కాదు", ఇది సామెత. ఒక్క కొడుకున్నాడని సంతోషింపగాదు, ఏలననగ వాడు చచ్చిన నింక రెండవవాడు లేడు, అట్లే ఒక కన్నును పోయిన నింక నేమి లాభము.

25. బాలుడు నింతకును బాములు ఒందగనీక=ఇంతవరకు కష్టములను పడనీయకుండ పెంచితిని; వేళ అతిక్రమించిన=వేళ మించినయెడల ఆకలి దప్పి తాళజాలడు; మేలు ఒనరింప కైకొనిన=మాకు మేలు చేయుటకు వానిని తీసికొనిన; ఏమని వేడుకొందును; నాజాలి తొలంగుట ఎట్లు=నా దుఃఖము విడిచి పోవుట ఎట్లో; మిక్కిలి దయతో సెలవిమ్ము; మునిసత్తమ=మునివర్యా.

26. ప్రమథుడు చెప్పెను: వనజేక్షణ=పద్మములవంటి నేత్రములుగల ఓ అమ్మా; ఇంత దుఃఖము నీకు తగదు; ఘనుడైన దేవుని నమ్మిన; జనుల మతము=మా వంటివారియొక్క అభిప్రాయమును తెలిసికొనవలదా.

ఆ॥ ఈ విచార ముడుగు మిపుడు నీ పుత్రున - కైన కొదవ యేమి యేను గలుగ
ధనికుఁ జేసి తెచ్చి తడయక యర్పింతు - వింత సేయకమ్మ వెఱ్ఱితల్లి. 27

క॥ అని యూఱడిలం బలికిన - విని మనమునఁ దెలిసి నొంది వెస నా యమ వం
డిన భుక్తి నొసఁగి మెనిమిటి - యనుమతమున సుతుని నతని కర్పణ చేసెన్. 28

ఆ॥ చేసి మగుడి యెన్ని వాసరములలోన - నేగుదెంతు రనిన నిట్లు వలికె
నతఁడు మితము సేయ నగునె యింతటికిని - గార్యమైన కొలఁదిఁ గాక తల్లి. 29

క॥ అని పోయి వత్తు నిలువుం - డని వారల నిలిపి చనియె నతఁ డంతటఁ ద
జ్జననియు దినదినసంగతి - మనమున దోదూయమానమగ్నత గదురన్. 30

ఉ॥ ఎన్నఁడు వచ్చు నా తనయుఁ డేమిటి కంపితి మౌనివెంట నా
కన్నుల కఱ్వుదీర నెసకంబున నెన్నఁడు వానిఁ గాంచెదన్
మున్నె యెఱుంగనైతిఁ గడు మోసము నొందితి నేమిసేతు నే
నెన్ని దినంబు లింక మఱి నీగతి జాలి దొఱంగ కుండెదన్. 31

ఆ॥ సుతుఁడె తోడునీడ చుట్టంబుఁ జెలికాఁడు - సుతుఁడె యేడుగడయు సుతుఁడె ధనము
సుతవిహీనమైన బ్రదు కేటిబ్రదు కది - జగములోన నెవ్వ జనులకెల్ల. 32

క॥ అని మందిరంబు వెలువడి - చని తెరువున నిలిచి సుతుఁడు చనుదెంచు నొకో
యని కనుఁ గానక మగుడం - జనుదెంచున్ సదనమునకు జడత వహించున్. 33

---

**27.** విచారము ఉడుగుము=దుఃఖము విడువుము; నేను కలుగ నీ పుత్రునకు ఐన కొదవ యేమి=నేను ఉండగ నీ కుమారునికి ఏమి తక్కువ; ఆయనను ధనవంతునిగా చేసి ఆలస్యము చేయక నీ కొప్పచెప్పెదను; వింత చేయకమ్మ=నన్ను క్రొత్తవానినిగా తలపకుము.

**28.** ఊఱడిలం బలికిన=ఓదార్చినప్పుడు; ఆ అమ వండిన=ఆ యమ్మ సిద్ధము చేసిన భోజనము ఇచ్చి

**29.** మగుడన్=తిరిగి; ఎన్ని వాసరములలో=ఎన్ని దినములలో వచ్చెదరు అనగా అతడు (ప్రమథుడు) చెప్పెను; మితము చేయనగునె=ఇన్ని దినములని గడువు పెట్ట వీలగునా; కార్యమైన కొలదిగాక=పని తీరిన తర్వాత (పని తీరినగాని ఇన్ని దినములలో వత్తునని యిప్పుడు చెప్పుట కెట్లు సాధ్యము.)

**30.** తత్ జననియు=ఆ తల్లి; దిన దిన సంగతి=ఒక దినముతో నింకొక దినము కలసికొనుచుండగా (ఒక నాటికి ఒకనాడు పెరుగుచుండగా) మనమున దోదూయమాన మగ్నత కదుర=మనస్సులో దుఃఖముచేత మునుగుట కలుగగా (మనస్సు దుఃఖముతో మునుగుటచేత దినములు లెక్క పెట్టుకొనుచున్నదని తాత్పర్యము.)

**31.** నా కొడుకు ఎన్నడు వచ్చును; మౌనివెంట=ప్రమథునితో ఏల పంపించితిని; ఎన్నడు వానిని నా కన్నుల కఱవు దీఱునట్లు; ఎసకమున=సంతోషముతో చూచెదనో; కడు మోసము నొందితిని; ఏమి చేయుదును; ఇట్టి మోసము జరుగునని మున్నె యెఱుంగనైతిన్=మొదటనే తెలిసికొనలేకపోయితిని; జాలి దొఱంగక=దుఃఖము విడువకుండ; ఇంక నెన్ని దినంబు లుండెదను.

**32.** ఎవ్వరికైనను సుతుడె తోడునీడ=తనతోగూడ వచ్చు తన నీడవంటివాడు (తన నీడ తన్నెప్పుడును విడువదు అట్లే కుమారుడు తల్లి దండ్రులతో నుండును.) ఆ సుతుడె చుట్టము చెలికాడు; ఏడుగడ=దిక్కు; ధనము=ధనమువంటివాడు; జనులకెల్లన్ ఎల్లజగములో సుతవిహీనము=కొడుకు లేని; బ్రదుకు=జీవితము; అది యేటి బ్రదుకు=ఆ బ్రదుకు బ్రదుకే కాదని యర్థము.

**33.** మందిరము వెలువడి=ఇంటిలోనుండి యీవలకు వచ్చి; తెరువున నిలిచి=దారిలో నిలువబడి; సుతుడు చనుదెంచునొకో=వచ్చుచున్నాడా యని; కనున్=చూచును; కానక; మగుడం జనుదెంచున్=మరల (సదనమునకు) వచ్చును; జడతవహించున్=భయముచేత క్రుంగిపోవును;

వ॥ ఇట్లు పుత్రవియోగశోక నిమగ్నాంతరంగ యగు నిజాంగన నుద్దేశించి తోభ్యం డిట్లనియె: 34

పంచచామరము॥

అలంఘ్యమైన మోహవార్ధియందుఁ జిక్కి యీగతిన్
విలంబశోక మగ్నవౌట వెఱ్ఱివైతి వక్కటా
బలాబలా యిదే వివేక పంథ నీకు నేఁడు మ
త్కులాంగనత్వ మొందఁబట్టి కోరి చెప్ప నయ్యెడున్. 35

ఉ॥ ఏల విచార మందెదవు వేగమె చేతిని బట్టి బాలునిన్
బోలుఁగ వెంటఁ దోడుకొని పోయిన ధన్యుఁడు నిర్దయాత్ముఁడే
మేలొనరించి నీ సుతుని మెల్లనఁ దోడ్కొని వచ్చు నింటికి
న్నాలుగునేను ప్రొద్దులకు నమ్ము త్రిశుద్ధిగఁ బద్మలోచనా. 36

ఆ॥ అనుడుఁ దెలిసి భర్త కర్ఘ్యోపచారముల్ - సలుపుచుండెఁ గొంత జాలి మాని
యెలమితోడఁ దోభ్యుఁ డెప్పటి నిష్ఠ యే - మఱక యుండెఁ దత్కుమారుఁ డపుడు 37

వ॥ ఇట్లు గురుజనంబులచే ననుజ్ఞాతుం డై యప్పారిషదుని వెంట నంటి పురంబు వెలువడి, బహువిధ సస్యసమృద్ధంబులగు క్షేత్రంబులు నేత్రంబులకుఁ బ్రియంబు వాటింపం గతిపయదూరంబు చని, సింహ శరభ వ్యాఘ్ర భల్లూక మహిష వరాహాద్యనేక సత్త్వసం

---

34. పుత్రవియోగ శోక నిమగ్న అంతరంగ=కొడుకును విడిచిపెట్టి యుండుటచే గలిగిన దుఃఖములో మునిగిన మనస్సుగల; నిజాంగనన్=తన భార్యను; ఉద్దేశించి=గుఱించి తోభ్యుండు ఇట్లు అనియెన్.

35. అలంఘ్యమైన=దాట శక్యముగాని; మోహవార్ధియందున్ చిక్కి=పుత్రప్రేమయను సముద్రములో తగులుకొని; యీగతిన్=ఈ ప్రకారము; విలంబశోక మగ్నవు అగుట=విస్తారమైన దుఃఖమందు మునిగి పోవుటచేత నీవు వెఱ్ఱివి ఐతివి; బలాబలా=సరిసరి (వహవ్వా) నీకు ఇది ఏ వివేక పంథ=దుఃఖించుట నీకు ఎట్టి తెలివిగల మార్గము; నీవు మత్కులాంగనత్వము=నాకు భార్యవుగా; ఒందబట్టి=ఉండుటచేత; కోరి చెప్పనయ్యెడున్=మిగుల ఇష్టముతో చెప్పవలసి వచ్చినది.

36. బాలుని పోలగన్=బాగుగ; వెంట దోడుకొని పోయిన; ధన్యుడు=పుణ్యాత్ముడు; నిర్దయాత్ముడే=దయలేనివాడా? (నీ బాలుని బాధించునా?) మేలు చేసి నీ కుమారుని తోడుకొని వచ్చును. నాలుగు ఏను ప్రొద్దులకు=నాలుగు లేక అయిదు దినములలోనే; త్రిశుద్ధిగ నమ్ము=త్రికరణశుద్ధిగ నా మాట నమ్ముము; త్రికరణములు=మూడు అవయవములు 1. మనస్సు 2. వాక్కు=నోరు 3. కర్మము=పని; ఈ మూడింటియొక్క స్వచ్ఛత చేత నమ్ముము. మనస్సులో నమ్ముము. మాటలలో నమ్ముము. పనిలో నమ్ముము; శుద్ధిగ=సందేహము లేకుండ నమ్ముము; పద్మలోచన=తామరమువంటి కన్నులు గలదానా.

37. అనుడున్=ఇట్లు చెప్పగా; తెలిసీ=తెలివి తెచ్చుకొని; భర్తకు; అర్ఘ్యోపచారము=అర్హమైన సేవలు; సలుపుచుండెన్=చేయుచున్నది; కొంతజాలి=దుఃఖమును మానినది; తోభ్యుడు ఎప్పటి నిష్ఠ=తన యెప్పటి ఆచారమును; ఏమఱక=మఱుపులేకుండ; ఉండెన్=దేవుని యెడ భక్తి గలిగియుండెను; అపుడు తత్కుమారుడు=వానికొడుకు.

38. గురుజనంబులచే=గురువులగు తల్లిదండ్రులచే; అనుజ్ఞాతుండై=సెలవుపొందినవాడై; ఆపారిషదుని వెంట అంటి=ఆ ప్రమథునితో కూడి; సస్య సమృద్ధంబులు=అనేక రీతులయిన పంటలతో నిండిన; క్షేత్రంబులు=పొలములు; నేత్రంబులకు సంతోషము వాటింప=కలుగ చేయగా; కతిపయదూరంబు=కొంతదూరము చని; శరభ=ఎనిమిదికాళ్ల మృగములు; వ్యాఘ్ర=పులులు; భల్లూక=ఎలుగుగొడ్డులు; మహిష=అడవినున్న పోతులు; వరాహ=పందులు; ఆది అనేక=మొదలైన ఎక్కువగు; సత్త్వ=జంతువులు; సంకులంబై=వ్యాపించినదై; ఇన కిరణంబు

కులంబై యినకిరణాంబులం జొరనీక దట్టంబై నెట్టుకొనిన యంధకారంబున దినంబు
ను రాత్రియునుం దేటపడని యరణ్యంబుఁ దరిసి యందు జంబు జంబీర నారికేళ రసాల
తమాల తాలహింతాల ఖదిర బదరీ కోవిదార కరవీర ఖర్జూర కుంద చందన పిచుమంద
మందార కదళీ కపిత్థాశ్వత్థ కదంబ నింబ కురవక తిలక బిల్వామలక పూగ పున్నాగ
కౌశికార్జు నాశోక దేవదారు తింత్రిణీ ప్లక్ష పలాశ పనస పాటలీ శాల్మలీ వకుళ పారి
భద్ర వంజుల వట కుటజ శిరీష సిందువార కందరాళ జంతుఫల క్షీరి కాంగారవల్లరీ శ
మీసు షేణ దీర్ఘవృంత హింగు లవంగ మాతులుంగ మాలతీ మల్లి కారోహి తాద్యనేక
వృక్ష విశేషంబు లరసి కనుంగొనుచు విలస ద్వసంత లక్ష్మీ మనోహరావయవంబు
లనఁదగు తత్తత్ప్రవాళ ముకుళప్రసూన ఫలలతావితానంబు లుల్లంబు పల్లవింపం
జేయఁ దన్నీడంబులం గ్రీడించు శుకపికనికరంబుల మృదులరవంబు లాలించుచుం జని
చని ముందర.

మ॥ కనియెం దోర్భ్యకుమారుఁ డొక్క నది వేడ్క న్వార్ధిగంభీరమున్
వనజాతాంచితగంధలుబ్ధ మధుపవ్రాతైక ఝుంకారమున్

లన్=సూర్యుని కిరణములను; చొరనీక=దూరనీకుండ; దట్టంబై=చిక్కగ; నెట్టుకొనిన=నిలిచియున్న; అంధకారం బున=చీకటిచేత; దినంబును=ఇది పగలని; రాత్రియు=ఇది రాత్రియని; తేటపడని=తెలియని; అరణ్యంబున్= అడవిని; దరిసి=చొచ్చి; అందున్=ఆ యడవియందున్న; జంబు=నేరేడు; జంబీర=నిమ్మ; నారికేళ=కొబ్బరిచె ట్లులు; రసాల=తియ్యమామిడి; తాల=తాటిచెట్లు; హింతాల=గిఅకతాటిచెట్లు; ఖదిర=చండ్రచెట్లు; బదరీ=రే గుచెట్లు; కోవిదార=కాంచనవృక్షము; కరవీర=గన్నేరు; ఖర్జూర=పేరీదుచెట్లు; కుంద=మల్లెతీగలు; చందన= గంధపుమ్రానులు; పిచుమంద=వేపచెట్లు; మందార=ఒకానొక కల్పవృక్షము (బాడిసచెట్టు;) కదళీ=అరటి; కపి త్థ=వెలగమ్రాకులు; అశ్వత్థ=రావిచెట్టు; కదంబు=కడిమిచెట్టు; నింబ=వేము (ఇది వలకొక్కసారి పిచుమందమని వచ్చినది;) కురవక=ఎఱ్ఱగోరంట; తిలక=బొట్టుగచెట్టు; బిల్వ=మారేడు; ఆమలక=ఉసిరికచెట్టు; పూగ=పోక మ్రాను; పున్నాగ=పొన్నచెట్టు; కౌశిక=గుగ్గిలపుచెట్టు; అర్జున=మద్దిచెట్టు; అశోక=కంకేళి; దేవదారు=దేవదా రు; తింత్రిణీ=చింతచెట్టు; ప్లక్ష=జువ్విచెట్టు; పలాశ=మోదుగుచెట్టు; పనస=పనసచెట్టు; పాటలీ=మొక్కపు చెట్టు; శాల్మలీ=బూరుగచెట్టు; వకుళ=పొగడచెట్టు; పారిభద్ర=దేవదారు; వంజుల=ప్రబ్బచెట్టు; వట=మఱిచెట్టు; కుటజ=కొండమల్లెతీగ; శిరీష=దిరిసెనచెట్టు; సిందువార=వావిలిచెట్టు; కందారాళ=కలజువ్విచెట్టు; జంతుఫల=మేడి చెట్టు; క్షీరికా=పాలచెట్టు; అంగారవల్లరీ=నిప్పువలె వన్నెలగల గుత్తులకానుకచెట్టు; శమీ=జమ్మి; సుషేణ=కలివి చెట్టు; దీర్ఘవృంత=దుండిగముచెట్టు; హింగు=ఇంగువచెట్టు; లవంగ=లవంగములచెట్టు; మాతులుంగ=మాధీఫలపు చెట్టు; మాలతీ=జాజితీగ; మల్లిక=మల్లితీగలు; రోహిత=ములుమోదుగచెట్టు; ఆది మొదలగు; అనేక వృక్ష విశేషంబులు=వివిధములైన చెట్లలోని భేదములను; అరసి కనుంగొనుచు=పేరులు తెలిసికొని చూచుచు; విలసత్ వసంతలక్ష్మీ మనోహర అవయవంబులు=ప్రకాశించుచున్న వసంతలక్ష్మీ (వసంతము=చైత్రవైశాఖ మాసములతో చేరిన ఋతువు, ఈ ఋతువు వసంతము, ఈ వసంతఋతువులో వృక్షములన్నియు పూచి మనోహరముగా నుం డును) వసంతఋతువునందలి సౌందర్యమనెడు లక్ష్మీ=లక్ష్మీదేవియొక్క మనోహర=అందమైన అవయవంబులు= శరీరభాగము లనఁదగు; తత్ తత్ ప్రవాళముకుళ ప్రసూన ఫలలతావితానంబులు=ఆ యా చెట్లయొక్క లేత చిగుళ్లు మొగ్గలు పువ్వులు పండ్లు మొదలైనవానియొక్క సమూహములు; ఉల్లంబు=మనస్సును; పల్లవింపం జేయన్=చి గురెత్తినట్లు (సంతోషము) చేయుచుండగా; తత్ నీడంబులన్=ఆయా చెట్లమీద; క్రీడించు=విహరించుచున్న శుకపిక నికరంబుల=చిలుకలు కోయిలలు (వీనియొక్క) సమూహములయొక్క; మృదుల రవంబులు=మృదు వైన ధ్వనులను; ఆలించుచు=వినుచు; చని చని ముందర=ఎదుట.

39. వార్ధిగంభీరమున్=సముద్రమువలె లోతై; వనజాత అంచిత గంధలుబ్ధ మధుపవ్రాత ఏక ఝుంకార మున్=పద్మములయందలి మంచి వాసనకు ఆశపడి వచ్చు తుమ్మెదలగుంపుచేత ఎక్కువగా ధ్వని చేయబడునదియై;

ఘనపాఠీన విహారముం దటలసత్కాదంబ కాంతారముం
గనకోద్యచ్ఛద హంసవారము వియద్గంగా సదృఙ్నీరముఁ. 39

ఆ॥ అమృతమయము పూర్ణ మద్వితీయమును హం - సాళిహృద్య మమల మనుపమంబు
సర్వసమము నగుచు నానందదాయకం - బైన తటిని గాంచి యాత్మలోన. 40

సీ॥ తన నీల కచభారమున కోడి విభ్రాంతి - నొందిన మధుకర బృందములను
దన బెళ్కుఁ జూపులకును భయంపడి జడ - క్రమగతి నుల్కెడు గండు మీలఁ
దన ఘన నినదంబునకుఁ జంకి విడివడి - జతవాసి పొగిలెడి జక్కవలను
దన మందగతులకుఁ దలఁకి తరంగడో - లాయి తమతులైన హంసతతుల
తే॥ నాదరించి యథోచిత హాసములను - జీవనము లిచ్చి తన్పి దీనావనైక
కంకణాంకిత విఖ్యాతిఁ గాంచె నౌర - యీనదీలక్ష్మి యని మోద మినుమడింప. 41

లయగ్రాహి॥
అల్ల ముని వెంబడిని బల్లవితవృక్షముల చల్లనగు నీడలను మెల్లనఁ జనంగాఁ
దెల్లమగు నీటను గరుల్లపడిఁ దారసిలి పెల్లుమని ముత్తియపు జల్లు లవలీలం
గ్రేళ్లుఱికి శీకరములెల్లఁ బయిఁ బర్వి పరిఫుల్ల ముకుళంబులగు మల్లియలవెంటన్
సల్లలితగానముల నుల్లసిలు షట్పదము లుల్ల మలరింప నది యొల్లువలె డాసెన్. 42

ఘనపాఠీన విహారముఁ=పెద్ద చేపలచేత తిరుగబడుచున్నదియై; తట లసత్ కాదంబ కాంతారముఁ=ఒడ్డున యందు సుందరమైన కడిమిచెట్లచేత ప్రకాశ్యముగానిదియైన పెద్ద యడవిగలదై; కనక ఉద్యత్ ఛద హంసవారముఁ=తళతళమను బంగారువన్నెవంటి ఱెక్కలుగల హంసలుగలదియు; వియత్ గంగా సదృక్ నీరముఁ=ఆకాశమునందు ప్రవహించు గంగానదిలోని నీటికి తుల్యమైన నీళ్లుగలదియునైన; వేడ్కన్=సంతోషముతో కనియెన్.

40. అమృతమయము=నీటితో గూడినది; పూర్ణము=నిండినది; అద్వితీయము=రెండవది దీనికి సాటిరానిది; హంసాళి హృద్యము=హంసలబాగుచే సుందరమైనది; అమలము=తేటయైనది; అనుపమంబు=సాటిలేనిది; (ఇట్టిదని పోల్చుటకు దగనిది) సర్వసమము=అంతట నొక్క విధముగా చదును గానున్నది అగుచున్; ఆనందదాయకంబైన=సంతోషము కలిగించెడు; తటినిన్=నదిని కాంచి;

41. ఈ నదీలక్ష్మి=ఈ నదియనెడు లక్ష్మీదేవి; తన నీల కచభారమునకు=తనయొక్క నల్లని కొప్పునకు; ఓడి=బెదరి; విభ్రాంతినొందిన=తెల్లపోయిన; మధుకర బృందములను=తుమ్మెదల గుంపును; తన బెళుకు చూపులకును=తనయొక్క చలించునట్టి చూపులకు భయపడి; జడక్రమగతిన్=మెల్లగా నడచుచు (జడ=నీటియందు; క్రమ=నడుచుటయొక్క; గతిన్=రీతిచేత) ఉల్కెడు=భయపడెడు (ఎగిరిపడెడు); గండుమీలన్=పెద్ద చేపలను; తన ఘన నినదంబునకు=తన గొప్ప మ్రోతకు జంకి; విడివడి=విడిపోయి; జతవాసి=జోడు విడిచి; పొగిలెడి=దుఃఖించెడు; జక్కవలను=చక్రవాక పక్షులను; తన మందగతులకున్=మెల్లనినడకలకు; తలఁకి=భయపడి; తరంగ డోలాయితమతులైన=అలలనెడు కుదురులేక ఉయ్యాలలలో నూగినట్లున్న; హంసతతులన్=హంసగుంపును; ఆదరించి=(పైనాలుగింటిని) దగ్గఱ దీసికొని బెదరుదీర్చి; యథోచిత హాసములను=వానికి వానికి దగినట్లు చిఱునవ్వుతో; జీవములు=ఉదకము (బ్రదుకుటకు దగిన ఆధారమును) ఇచ్చి: తన్పి=తృప్తిపొందించి; దీనావన ఏక కంకణ అంకిత విఖ్యాతిన్=దీనులను రక్షించుటయే ముఖ్యమైన కంకణమును కట్టుకొన్నది అను ప్రసిద్ధిని (అలసియున్నవారిని రక్షించుటకైన ఉదకబిందువులు కలిగినదను ప్రఖ్యాతిని) కాంచెను ఔరా అని మోదమును=సంతోషము ఇనుమడింపన్=రెట్టింపగా.

42. అల్ల మునివెంబడిని=ఆ మునివెనుకనే; పల్లవిత వృక్షముల=చిగిరించిన చెట్లయొక్క; చల్లనగు నీడలలో మెల్లగా చనంగా తెల్లము అగు నీటను=స్వచ్ఛమైన నీళ్లలో; కరుల్లపడిన్=అలల వేగముచేత; తారసిలి=దగ్గఱకు జేరి; పెల్లుమని=పెల్లుమని విఱిగిన చప్పుడుతో; ముత్తియపు జల్లులు=ముత్యముల సరములు; అవలీలన్=తేటాలున

క. దాసి పులిన స్థలంబున - నాసీనుండగుచు శీతలానిలవిగతా
యాసుండై యించుక తడ - వా సరసీతటమునందు ననుమోదమునన్. 43

ఉ॥ విరిచి యఘము తన్నిర్మలతోయంబు - గ్రోలం దలంచి లేచి కొలను జొచ్చి
కరపదములు గడిగి గండూష మొనరించు - నవసరమునం జూడ నద్భుతముగ. 44

మ॥ మిడిగ్రుడ్లున్ గడున్ గోగమీసములపై మిన్నుల్ దువాళింప నొ
ప్పెడు కోఱల్ వికటాననంబు సితభూభృత్సన్నిభాంగంబుతో
వడిఁ దోయంబులఁ ద్రుళ్లుచుం బొరలుచు న్నోరు విచ్చి తన్మ్రింగఁ బా
ల్పడి యేతెంచెడు దాని నొక్క బలవత్పాఠీనముం గాంచుచున్. 45

ఆ॥ తలఁకి వచ్చె వచ్చె దాఁకొనె మఱియును - గదిసె మ్రింగె మ్రింగెఁ గావు కావు
మనుచు వెఱవ మునియు భయమిడి చేపను బట్టి తెమ్మనంగ బాలుఁడంత. 46

చ॥ ఎదుటికి మీను పట్టుకొని యీడ్చి తీరము సేర్పఁ బ్రాణముల్
వదలిన దాని గ్రుడ్లను వక్త్రము దాని మెఱుంగు కోఱలు
న్నుదరము మేనుఁ జూచి తల యూఁచుచు దేవుని కృత్య మింతయున్
మది నెఱుఁగంగఁ దోభ్యుని కుమారునిఁ గన్గొని మౌని యిట్లనున్.

(తేలికగా); క్రేళ్లు ఉరికి=ఎగిరిపడి; శీకరములు=నీటితుంపరలు; ఎల్లన్ పయిన్ పర్వ=మీద బడ; పరిఫుల్ల ముకుళంబులు=బాగుగా వికసించిన మొగ్గలు గలవియైన; మల్లియల వెంటన్=మల్లెపొదలలో; సల్లలిత=మిక్కిలి యింపైన; గానములన్=పాటలచేత; ఉల్లసించు=సంతోషించు; షట్పదములు=(ఆఱు పాదములు గలిగిన) తుమ్మెదలు; ఉల్లము అలరింపన్=మనస్సును సంతోషపెట్టుచుండగా; నదిన్=ఆ యేఱును; ఇల్లువలెన్=తన గృహము వలెను; డాసెన్=సమీపించెను.

**43.** డాసి పులిన స్థలంబునన్=చేరి ఇసుక తిన్నెలమీద; ఆసీనుండు=కూర్చున్నవాడై; శీతల అనిల విగత ఆయాసుండు=చల్లని గాలిచేత తగ్గిపోవు కష్టము కలవాడై; (దారి నడచి వచ్చిన ఆయాసము తీఱి) ఇంచుక తడవు=కొంచెము సేపు; ఆ సరసీ తటమునందున్=ఆ నదియొక్క ఒడ్డున; అనుమోదమునన్=సంతోషముతో.

**44.** తత్ వినిర్మల తోయంబున్=ఆ నదిలోని తేటయైన నీరును; క్రోల దలచి=త్రాగవలెనని యెంచి; కొలను చొచ్చి=కొలనులోనికి దిగి; (పై పద్యములో సరసి అని, యిక్కడ కొలను అని చెప్పుచున్నాడు, తక్కిన తావులలో నది యని చెప్పుచున్నాడు) కర పదములు=చేతులు కాళ్లు కడిగి; గండూషము=నోటిలో నీళ్లు పోసికొని పుక్కిలించుట; ఒనరించు నవసరమున=చేయు సమయమున; చూడన్ అద్భుతముగన్=చూచుటకు ఆశ్చర్యముగా.

**45.** మిడిగ్రుడ్లున్=మీదికి ఉబికిన కనుగ్రుడ్లును; కడున్=పెద్ద; కోగమీసములపై=సన్నని పొడుగైన మీసములమీద; మిన్నుల్=ఆకాశముమీదికి; దువాళింపన్=దుముకునట్లు; ఒప్పెడు కోఱలు=నోటిలోని కోఱలును; వికట ఆననంబు=భయంకరమైన నోరును; సిత భూభృత్ సన్నిభ అంగంబుతో=తెల్లని పర్వతముతో సమానమైన శరీరముతో; తోయంబులన్=నీటిలో; ద్రుళ్లుచున్=ఎగిరిపడుచు; పొరలుచున్=దొరలుచు; నా=నోరు; విచ్చి=తెఱచి; తన్ మ్రింగన్=తనను మ్రింగుటకై; పాల్పడి=పనిపూని; ఏతెంచెడు=వచ్చుచున్న దానిని ఒక్క; బలవత్ పాఠీనమున్=బలముగల పెద్దచేపను; కాంచుచున్=చూడగనే;

**46.** తలకి=భయపడి; దాకొనెన్=దగ్గఱకు వచ్చినది; మఱియును గదిసెన్=ఇంకను దగ్గఱకు వచ్చినది; మ్రింగె మ్రింగెను కావు కావుము=కాపాడుము కాపాడుమనుచు; వెఱవన్=తోభ్యుడు భయపడగా; ముని=సన్మనస్కుడు; భయమిడి=భయము విడిచి.

**47.** తీరము సేర్ప=ఒడ్డున చేరవేయగనే; ప్రాణముల్ వదలినన్=చచ్చిపోగా; దాని గ్రుడ్లులును; వక్త్రము=నోరును; దాని మెఱుగు కోఱలును=వాడియైన దంతములును; ఉదరము=కడుపు; మేను=శరీరమును చూచి;

క॥ నిన్నది మ్రింగ న్వచ్చుట-యు న్నిజముగ దాని నీవు నోర్చుటయును గా
దన్నిఖిలేశ్వరుఁడు భయా-పన్నత యొండొరులవలనఁ బాపఁగఁ దలఁచెన్. 48

క॥ తగు సర్వేశ్వర భక్తుఁడ-వగు నీ హస్తంబులోన నసువులు విడుటన్
సుగతి ఘటియించె నను మనసా-నగు నీకుం దీనివలన నభిమత మనుడున్. 49

చ॥ ఇది మృతినొందె నింక ఫల మెట్లొనగూడును నాకు దీనిచే
నది యెఱిఁగింపు మన్నను గణాధిపుఁ డత్తఱి నీవు వేగన
య్యుదరము వ్రచ్చి గుండెయును గుత్తిగఁ బిచ్చును దీయుమయ్య నా
నగి విని బాలుఁ డేగి రయమారఁగ దీసెను వాని గ్రక్కునన్. 50

వ॥ అంత నప్పారిషదుం డవ్వస్తుద్వయం బుపలక్షించి యీపిచ్చు జాత్యంధునకైన దివ్యదృష్టి నొసంగంజాలును, గుండెయు సమస్త భూతప్రేత పిశాచ ప్రముఖ దుష్టగ్రహ నివారణ కారణంబౌ ధూపవస్తువగును; ఈ రెంటివలన నీకుఁ గార్య సాధనంబగు, వీని సమ్యగ్రక్షణంబు సేయుమని యానతిచ్చిన రెండవ యిద్దాని వలన నేమి కార్యసాధనం బనవుడు నగ్గణాధీశ్వరుండు వత్సా! మనమేగెడి పురం బున మీకుఁ బ్రియబంధుండగు రాగ్వేలునికి నతిశయ సౌందర్య రేఖా విలాస విభ్ర మసారంబై సారమ్మ యనందగు నొక్క కుమారికారత్నంబు గలదు, దానికి నీకుం బరిణయంబు సేయ నిశ్చయించినవారము, పాణిగ్రహణానంతరంబున ద్వితీయవస్తు వినియోగం బుపదేశించెద ననవుడు మహాత్మా! యేతద్వృత్తాంతం బొక్కింత మున్నె

దేవుని కృత్యమింతయు=ఇది యంతయు దేవుడు చేసిన పని; ఎఱిగి;

48. నిన్ను ఇది మ్రింగన్ వచ్చుటయును, నిజముగ దానిని నీవు ఓర్చుటయును=ఈడ్చి యొడ్డున వైచి చంపుటయును గాదు, అది నిన్ను మ్రింగ లేదు, నీవు దాని నీడ్చి చంపలేవు; ఆ నిఖిలేశ్వరుడు=ఆ సర్వేశ్వరుడు; భయ ఆపన్నత=భయమును దుఃఖమును ఒండొరులవలనన్=ఇతరులనుండి; పాపగన్=పోగొట్టుటకు తలచి నాడు.

49. తగినట్టి సర్వేశ్వర భక్తుడవు అగు నీ హస్తంబులోన=నీ చేతిలో; అసువులు=ప్రాణములు; విడుచు టన్=విడుచుటచేత (చచ్చుటచే) సుగతి ఘటియించెన్=మనసు భాగ్యము దొరకినది; దీనివలన=ఈ చేపచేత; నీకు అభిమతము=కోరిన కోరిక తీరుట అగును; అనుడున్=అనగా.

50. (కుమారుడు) ఇది మృతినొందెన్=చచ్చినది; ఇంక ఫలము దీనిచే నాకు ఎట్లు ఒనగూడున్=ఎట్లు అభిమతము సిద్ధించును; అనగా గణాధిపుడు అత్తఱిన్=ఆ సమయమున; నీవు వేగముగా ఆ ఉదరము వ్రచ్చి=దాని పొట్టను చీల్చి;

51. ఆ పారిషదుడు=ప్రమథుడు; ఆ వస్తుద్వయము ఉపలక్షించి=ఆ రెండు వస్తువులను (గుండెయు పిచ్చును) చూచి; జాత్యంధునకైన=పుట్టు గ్రుడ్డివానికైనను; దివ్యదృష్టి=మంచి చూపును ఒసగజాలును; గుండె సమస్త భూతములను ప్రేతములను, ప్రముఖ దుష్టగ్రహ=మొదలగు చెడ్డ కీడులను; నివారణ=అడ్డగించుటకు; కారణంబగు ధూపవస్తువు=హేతువైన ధూపమగును; కార్యసాధనమగును=నీ పని సాధింపబడును; సమ్యక్ రక్షణము=జాగ్రత్తగా గాచిపెట్టుమని; (బాలుడు) రెండవ ఈ దానివలన=ఈ గుండెచేత; ఏమి కార్యసాధనంబు= ఏ పని జరుగును, అని అనగా; ఆ గణాధీశ్వరుడు=ఆ ప్రమథగణశ్రేష్ఠుడు చెప్పుచున్నాడు: వత్సా=కుమార; అతిశయ సౌందర్య రేఖా విలాస విభ్రమసారంబై=మిక్కిలి చక్కదనము కాంతి రూపము వీనియొక్క చేష్ట లకు మిన్నయైన; కుమారికారత్నంబు=ఒక రత్నమువంటి కూతురు కలదు; పాణిగ్రహణ అనంతరమున=(నీవు ఆ కన్యయొక్క) చేయిపట్టుకొన్న తరువాత (=పెండ్లి చేసిన పిమ్మట) రెండవ వస్తువుయొక్క (గుండె) ఉపయో గము చెప్పెదను (అని సన్మనస్కుడు చెప్పి నప్పుడు తోభ్యుడు చెప్పినదేమనగా): ఏతత్ వృత్తాంతము ఒక్కింత =ఈకథ కొంచెము; మున్నె=మీరు చెప్పుటకు ముందు విన్నాను; ఆ కన్య ఈ తలచి=పెండ్లికి ఈయ నెంచి,

బిగి యున్నవాఁడ నెట్లనిన రాఘ్వేలుం డక్కన్నియ నీఁదలంచి తెచ్చిన వరులేడ్వురుం గ్రమక్రమంబునం జచ్చినారంట మజ్జననీజనకుల కేనొక్కరుండనై యుండి యక్కన్నియ నెట్లు పరిగ్రహింపగలవాఁడనైన భవదీయ కృపావిశేషంబున బ్రతికితినేనియు మీఁద మత్పితృనియోగంబుగాని యీకార్యంబున కొడంబడిన యపఖ్యాతి నెట్లు భరింపఁగలవాఁడఁ గావున మీర లీకార్యంబు దలంపవలదని విన్నవించినఁ బ్రమ ఘుం డిది పరమేశ్వరేచ్ఛాకృతంబు దీనికి నొండు పలుకరాదు: దీన నెగ్గు పుట్ట దస్మన్నియోగంబు భవత్పితృనియోగంబుకంటె విశేషంబుగాఁ దెలిసి యక్కన్నియం బరిగ్రహింపుము; తత్పూర్వవృత్తాంతంబును నేతద్వస్తువినియోగంబును నిప్పుడు తేటపఱిచెద: నా వరులేడ్వురు నొక్క పిశాచముచేత మడిసిరి; యది సుజ్ఞానులం జెఱుపఁజాల దజ్ఞానుల నొక్క నిమిషమాత్రంబునం జెఱచు నెట్లనం దజ్జనకుండు మున్న దానిం బరిణయంబు సేయ నేర్పఱచిన వరులేడ్వురుం గేవల మూఢత్వంబున నింద్రియ పరవశులై ఖరమృగాశ్వాది జంతుసమానులై కామోద్రేకంబునం గవయంగోరు నజ్ఞానమలిన భావంబునం జెందుటయుం దత్క్షణంబ తదధిష్ఠానభూతంబగు భూతంబుచేతం బరిహృతులైరి, నీవు సుజ్ఞానివి సర్వేశ్వరేంద్రియ సంధానత్వంబు మీ తండ్రివలనఁ గొంత తెలిసినవాఁడ వగుట నిన్నది జెఱుప వెఱచు, నేమఱక యీ గుండె యొక్కింత వహ్నిం బడవైచినం దద్ధూపప్రసారంబునం బలాయనంబై మగుడ రానేర దంతట వంశాభివృద్ధికరులై సుఖింతు రదియునుంగాక యనేక ధనకనకాంబర మణిభూషణాదు లరణం బొసంగెదరు, రాఘ్వేలుని దత్పరిణయ కార్యంబున కొడంబ

తీసుకొని వచ్చిన వరులు=పెండ్లి కొడుకులు ఏడుగురు; మత్ జననీజనకులకు=నా తల్లిదండ్రులకు; నేను ఒక్కరుండనై=ఏక పుత్రుడనై ఎట్లు ఆ కన్యను పెండ్లి చేసికొందును; అయినను; భవదీయ కృప విశేషంబున=తమ దయ యొక్క అతిశయముచేత; బ్రదికితినేనియు=చావకుండినను; మత్ పితృనియోగముగాని=నా తండ్రి సెలవులేని ఈ పెండ్లికి; ఒడంబడిన అపఖ్యాతి=సమ్మతించిన చెడ్డ పేరు ఎట్లు భరింపగలవాడను; ఇది పరమేశ్వర ఇచ్ఛాకృతంబు=సర్వేశ్వరుని చిత్తము ప్రకారము జరుగుచున్నది; దీనికి ఒండు పలుకరాదు=మాఱుమాట యాడగూడదు; దీనన్ ఎగ్గు పుట్టదు=ఈ పనివలన కీడురాదు; అస్మత్ నియోగము=నా సెలవు; భవత్ పితృనియోగముకంటే=నీ తండ్రిగారి సెలవుకంటెను; విశేషంబుగా=ఎక్కువయైనదని తెలిసి; తత్ పూర్వ వృత్తాంతమును=దానికి ముందు జరిగిన చరిత్రము; ఏతత్ వస్తు వినియోగంబును=ఈ వస్తువు (గుండె) ఉపయోగించు విధమును తేటగా చెప్పెదను; అది సుజ్ఞానులన్=బుద్ధిమంతులను పాడు చేయజాలదు; అజ్ఞానులన్ తెలివిలేనివారని ఱెప్పవేసిన కాలములో చెఱచును; తత్ జనకుడు=ఆ కన్య తండ్రి పెండ్లి చేయవలయునని నిశ్చయించిన భర్తలు ఏడుగురు; కేవల మూఢత్వమున=మిక్కిలి అజ్ఞానముచే; ఇంద్రియ పరవశులై=పంచేంద్రియములకు లొంగిపోయి; ఖర మృగ అశ్వ ఆది జంతు సమానులై=గాడిదలు లేళ్లు గుఱ్ఱములు మొదలగు జంతువులతో సమానులై; కామ ఉద్రేకంబున=ఇంద్రియ సుఖములచే పెచ్చు పెరిగి ఆ కన్యను గూడుటకై కోరునట్టి; అజ్ఞానమలిన భావంబున=బుద్ధిలేని దోషపు తలంపుచేత; చెందుటయు=ఆవరింపబడుటచే; తత్ క్షణంబు=ఆ సమయముననే; తత్ అధిష్ఠాన భూతము=అక్కడ నివసించు ఒక పిశాచముచేత; పరిహృతులైరి=ద్రోసివేయబడినవారు అయిరి; నీవు బుద్ధిమంతుడవు; సర్వేశ్వర ఇంద్రియ సంధానత్వంబు=దేవుడు ఇంద్రియములను ఎందుకు కల్పించినాడో కొంత తెలిసినవాడవు అగుటచేత; నిన్ను అది=పిశాచము; చెఱుప వెఱచును; ఏమఱక=మఱచిపోక; వహ్నిం బడవైచినం=నిప్పుమీద వేయునెడ; తత్ ధూప ప్రసారంబున=ఆ పొగ వ్యాపించుటచే; పలాయనంబై=(పిశాచము) పరుగెత్తిపోయి మరల రాజాలదు; వంశ అభివృద్ధికరులై=మీ వంశము సంతానముచేత వృద్ధిఅగుచు (బిడ్డలను కని) సుఖింతురు; ధన కనకాం

అపుడు దత్పురంబుఁ బ్రవేశింప నేటికిం బ్రొద్దుచాలదు, ఇచ్చట నీరేయి వసియింతమని తత్తటినీతీరంబున నొక్క మనోహర స్థలంబునం బ్రవేశించి యుండునంత. 51

క॥ వాడెం దమ్ములు మొగ్గలు - వీడెం దొగ లరుణకాంతి వెలసె రవియున్
నీడములు సేరెఁ బక్షులు - వేఁడిమి సెడె నరుణకాంతవితతులయందున్. 52

మ॥ అరుణోర్వీశుఁ డనంత దంతిగమునుం డై స్రుక్కి యస్తాద్రిగ
న్నగజోన్యాప్తిని బశ్చిమాబ్ధి నుఱుకన్ ఘుట్టస్థసంధ్యారుణాం
బరముక్తేభ మనం దమం బడరెఁ శుంభత్కాలభృత్సంజ్ఞఁ ద
త్పరితోత్పాత సముద్గతాంబుకణభావం బందె నక్షత్రముల్. 53

చ॥ తమ మెడలించి యాత్మగురుతత్త్వము సార్థకమై తనర్పఁగా
నమరుఁడు సన్మనస్కయుతి సంయమి సంతతిఁ బొందు నంధకా
రముఁ దొలఁగింపఁ బూనునెడ రమ్యకృపామృత మెల్ల ముద్దయై
యమరె మనోభ్రమందున మృగాంకుఁడు భాసిలె తేజమూర్తియై. 54

బగ మణి భూషణ ఆళులు=పన్న్యము సరిగబట్టలు రత్నభూషణములు; అరణంబు=(పెండ్లిలో మామగారు నిచ్చు) కానుకగా ఇచ్చెదను. తత్ పరిణయ కార్యమునకు ఒడఁబడఁ=రాఘవులుని ఈ పెండ్లి కార్యమునకు సమ్మతిపడఁజేయ, ఆ పట్టణమునకు పోవుటకు; వసియింతము=ఉండెదము; తత్ తటినీ తీరమున=ఆ నది యొడ్డున; ఒక్క మనోహర స్థలమున=అందమైన చోట; ప్రవేశించి యుండగా.

52. తమ్ములు మొగ్గలు వాడెన్=పద్మములు మొగ్గలుగా వాడిపోయినవి; తొగలు వీడెన్=కలువలు వికసించినవి; రవియున్ అరుణకాంతిన్ వెలసెన్=సూర్యుడు ఎఱ్ఱనికాంతితో కనబడియెను; పక్షులు నీడంబులు సేరెన్=పిట్టలు గూళ్లలోనికి బోయినవి; అరుణకాంతవితతులయందున్=సూర్యకాంతియనెడు సమూహములో; వేడిమి చెడెను=వెచ్చదనము తగ్గెను; (సాయంకాలమై సూర్యుడు అస్తమించుచున్నాడని తాత్పర్యము).

53. అరుణ ఉర్వీశుడు=సూర్యుడను రాజు; అనంత దంతిగమునుండై=ఆకాశమనెడు ఏనుగు నెక్కి తిరిగి; స్రుక్కి=వాడి; అస్తాద్రి గ న్నగజోన్యాప్తిని=పడమటి కొండయందలి ఎఱ్ఱని కాంతియను రక్తము పట్టుకొనుటచే; పశ్చిమ అబ్ధిన్ ఉఱుకన్=పడమటి సముద్రములో దుమికిపడగా; ఘుట్టస్థ సంధ్యారుణ అంబర ముక్త ఇభము అనంగన్=ఒడ్డున నుండిన సంధ్యారాగము విడచిపెట్టిన ఆకాశము మీదనుండి పడిన ఏనుగు అనునట్లు; తమంబు=చీకటి (ఏనుగును చీకటివలె చెప్పినాడు); అడరెన్=వ్యాపించెను; శుంభత్ కాలభృత్ సంజ్ఞన్=ప్రకాశమానమైన కాలము ధరించిన (రాత్రికాలమను పేరుగలవాని); సంజ్ఞన్=చేసిన సంజ్ఞచేత నక్షత్రములు; తత్ పరిత ఉత్పాత సముద్గత అంబుకణ భావంబున్—ఆ సూర్యుడు గుభేలున ఉఱికినందుచేత మీఁదికి లేచిన నీటిబిందువులరీతిని; అందెన్=పొందెను (ఉండెను).

తా॥ సూర్యుడను రాజు ఏనుగునెక్కి తిరిగి పడమటి కొండమీద సంధ్యారాగము నెత్తురంటుకొనగా దానిని కడుగుకొనుటకు సముద్రములో నుఱికినట్లును అపుడాకాశము మీదనుండి దిగి యొడ్డుననున్న యేనుగువలె చీకటి యాక్రమించినట్లును, సూర్యుడు నీళ్లలో దుమికినపుడు మీదికి చిందిన నీటిచుక్కలవలె నక్షత్రములు వచ్చినవని తాత్పర్యము.

54. తమము=చీకటి(అజ్ఞానమును); ఎడలించి=పోగొట్టి; ఆత్మ గురుతత్త్వము=తన గురువు నేర్పిన జ్ఞానము; సార్థకమై=అర్థముతో గూడినదియై; తనర్పన్=ప్రకాశింపగా; అమరుడు=నాశనము లేనివాడు (దేవుడు); సన్మనస్కయుతిన్=మంచి మనసుతో గూడిన; సంయమి సంతతిన్=మునుల వంశమును; పొందు=అర్పించునట్టి; అంధకారము=చీకటి; తొలగింప పూనన్=తొలగించివేయుటకు ప్రయత్నము చేయగా; రమ్య=శ్రేష్ఠమై; కృపా అమృతము=దేవుని దయ యనెడు అమృతము; ఎల్లన్=అంతయును; ముద్దయై=ఒక్కటుండయై; మనః అభ్రమునందు=మనస్సు అను ఆకాశమునందు; అమరెన్=ఉండెను; మృగాంకుడు=చంద్రుడు; (మృగ=లేడి; అంకుడు=గుర్తుగలవాడు;) తేజమూర్తియై=తేజస్స్వరూపుడై; భాసిలెన్=వెలిగెను.

కం॥ నీరధులు పొంగె నంభః పూరంబులు చంద్రకాంతములఁ బ్రవహించెన్
గేరెఁ జకోరమ్ములు రతిఁ గైరవములు విజ్జృంభించెఁ గౌముది వెలసెన్. 55

తే॥ పండువెన్నెల లీరీతిఁ బిండి చల్లినట్లు విలసిల్ల నా రాత్రి యచటఁ దోభ్య
నందనుఁడు నన్మనస్కుఁ డానంద మగ్నుఁ డధివసించుటయునుఁ దెల్లనయ్యెఁ దూర్పు. 56

పంచచామరము.

అగణ్యపుణ్యశీల సద్గుణాలవాల మానసా
నిగర్వయుక్త భక్తచిత్త నీరజప్రభాకరా
జగత్ప్రభో యపార పాపసంచయాంబు దానిలా
దిగంతఖ్యాతి వంద్యమాన దివ్యపాద పంకజా. 57

గద్యము॥ ఇది శ్రీమత్ జేసునాథ సద్గురు ప్రసాదలబ్ధాష్టవిధ కవిత్వ ప్రవీణ వినయ ధురీణ భారద్వాజగోత్ర పింగళి నాగయామాత్య పుత్త్రి యెల్లనార్య ప్రణీతంబైన సర్వేశ్వర మహాత్త్వంబను మహా ప్రబంధంబునందుఁ దోభ్యకుమారుండు పితృనియోగంబున గబేలు నగరంబునకుం బోవ నుద్యోగించుటయుఁ, దత్సహాయార్థంబు సర్వేశ్వరుండు ప్రమథుం బుత్తెంచుటయు, నతండు తోభ్యనిం గాంచుటయుఁ దదుభయోచిత సంభాషణంబును, నన్నమాంబికయుం బుత్త్రవియోగ శోకభరంబు రెట్టింపం గుమారు నతని కొప్పించుటయు, నన్మనస్కుఁ డక్కుమారుం దోడ్కొని చనుటయు, వనవర్ణనంబును మహానదీదర్శనంబును దద్వర్ణనంబును దజ్జలమధ్యంబున నొక్క మీనంబు తోభ్యకుమారునిం దొడరుటయుఁ, దదీయస్పర్శమాత్రంబున నది మృతిఁ బొందుటయు, నతండు దానియం దౌషధద్వయంబుఁ గాంచుటయు నన్మనస్కునివలనం దద్వినియోగంబు వినుటయుఁ బ్రభాతం బగుటయు నన్నది తృతీయాశ్వాసము. 58

తా॥ దేవుడు భక్తులైన యోగుల హృదయములలోని అజ్ఞానమను చీకటిని తొలగించి దయ యను అమృతపు ముద్దను ఆ భక్తుల హృదయములనెడు ఆకాశములో ప్రవేశ పెట్టినట్లు చంద్రుడు వెలుగుచుండునని తాత్పర్యము.

55. నీరధులు=సముద్రములు; పొంగెన్=ఉబ్బినవి; చంద్రకాంతములన్=చంద్రకాంతములను చలువ రాళ్లలోనుండి; అంభః పూరము=నీటిధారలు; ప్రవహించెన్=వెడలెను; చకోరములు కేరెన్=వెన్నెల పులుగులు సంతోషించెను; కైరవములు=కలువలు; రతిన్ విజృంభించెన్=ఆసక్తితో గర్వించెను; కౌముది వెలసెన్=వెన్నెల ఎక్కువయయ్యెను.

56. పిండి చల్లినట్లు పండు వెన్నెలలు ఈ రీతిని విలసిల్లగా; ఆ రాత్రివేళ నచట తోభ్యునికొడుకును సన్మనస్కుడును ఆనందమగ్నుల్=పొంగి; అధివసించుటయును=నివసింపగా తూర్పు తెల్లనయ్యెన్=వేగుజామైనది. (తెల్లవారినది.)

57. అగణ్య పుణ్యశీల=లెక్కపెట్టుటకు (తలంచుటకు) వీలులేని పుణ్యస్వభావము గలవాడా; సద్గుణ ఆలవాల మానసా=మంచి గుణములకు పునాదివంటి మనస్సు గలవాడా; నిగర్వయుక్త భక్త చిత్త నీరజ ప్రభాకరా=గర్వములేని భక్తుల హృదయ పద్మములకు సూర్యుడా; జగత్ప్రభో=లోకముయొక్క ప్రభువా, అపార పాపసంచయ అంబుద అనిలా=విస్తార పాపసమూహమను మేఘములకు వాయువువంటివాడా (వాయువు యెట్లు మేఘములను పారదోలునో ఆలాగున నీవు పాపములను చెదరగొట్టెదవు); దిగంత ఖ్యాతి=లోకమంతటిలో కీర్తి పొందినవాడా; వంద్యమాన దివ్యపాద పంకజా=నమస్కరింపబడదగిన దివ్యమైన పాదపద్మములు గలవాడా.

# చతుర్థాశ్వాసము.

క॥ శ్రీమదఖిలాండ నాయక - కామాద్యరి వర్గతిమిర కమలాప్త ముని
స్తోమారాధితచరణ య - ఘామయ మహనీయవైద్య ఘన సర్వేశా. 1

తే॥ అవధరింపుము తదనంతరాభివృత్త - మనఘచరితులు సర్వేశ్వరాంఘ్రి కమల
భక్తినిష్ఠాగరిష్ఠు లాసక్తిఁ దనర - విన్నవించెద నెలమి సవిస్తరముగ. 2

చ॥ పరిణయవార్త లెల్ల విని ప్రాక్తరుణీమణి తన్మహోత్సవం
బరుదుగఁ జూడఁబోవ నరుణాంబరధాతువు లుల్లసిల్లఁగాఁ
దిరముగ ఫాలభాగమునఁ దీర్చిన కుంకుమ చుక్కబొట్టునా
నరుణ గభస్తిబింబ ముదయాద్రిపయిం బొడసూపె వేడుకన్. 3

సీ॥ అంత నచ్చటఁ జని యా సన్మనస్కుఁడ - ర్చకుని వెంబడిఁ గొని నా పురమున
కరిగి రాగ్వేలు మందిరము ప్రవేశించి - యుండంగఁ దద్భూవరుండు గాంచి
చర్చింప మద్బాల సఖుఁడగు తోభ్యని - వలెనె గన్పట్టు నిబ్బాలకుండు
కనుఁగొంటె యని నిజాంగనకు రహస్యము - దెలిపి వారల డాయఁ బిలిచి మీర

తే॥ లెవ్వ రెందుండి వచ్చితి రిటకు మిమ్ముఁ - బంచి రెవ్వరు తెలియంగఁ బల్కుఁడనినఁ
బ్రమథుఁ డిట్లని పల్కె సంభ్రమము దనరఁ - జిఱుతనగ వాననంబునఁ జెంగలింప. 4

క॥ చరియింపఁగ నొక యూరిని - నరుదారఁగ మాకు శిష్యుఁడై యిబ్బాలుం
డరుదెంచెను మా వెంబడిఁ - గరుణించితి మితనిఁ గీర్తికవితునిఁగాఁగన్. 5

---

1. శ్రీమత్ అఖిల అండ నాయక=శోభాయుక్తమైన సమస్త బ్రహ్మాండమునకు ప్రభువా;. కామ ఆది అరివర్గ తిమిర కమలాప్త=కామము మొదలగు అరిషడ్వర్గము (అంతశ్శత్రువులు) అను చీకటికి సూర్యునివంటి వాడా; ముని స్తోమ ఆరాధిత చరణ=ముని సమూహముచే సేవింపబడు పాదములు గలవాడా; అఘ ఆమయ మహనీయ వైద్య=పాపమనెడు రోగమునకు పెద్ద వైద్యుడా;

2. ద్వితీయాశ్వాసము రెండవ వచనము చూడుము.

3. పరిణయవార్తలు=పెండ్లి సంగతులు ఎల్ల విని; ప్రాక్ తరుణీమణి=తూర్పుదిక్కనెడు స్త్రీ; తత్ మహోత్సవంబు=ఆ పెండ్లియొక్క వేడుక; అరుదుగన్=ఆశ్చర్యముగ చూడబోవన్; అరుణ అంబర ధాతువులు=ఎఱ్ఱని ఆకాశమను వస్త్రముయొక్క కాంతులు; ఉల్లసిల్లగా=ప్రకాశింపగా; ఫాలభాగమునన్=నొసటియందు; తీర్చిన =పెట్టుకొనిన; కుంకుమచుక్కబొట్టు నాన్=అనునట్లు; అరుణ గభస్తి బింబము=ఎఱ్ఱని కిరణములు గల (సూర్యుని) బింబము; ఉదయాద్రిపయిన్=తూరుపు కొండమీద (ఉదయపర్వతముమీద) పొడసూపెన్=కనబడెను.

4. అర్చకుని=తోభ్యకుమారుని (చిన్నవానిని) వెంబడిన్ కొని=వెంటబెట్టుకొని; రాగెనూరు=రాగ్వేలుడు నివసించు పట్టణమునకు; తత్ భూవరుండు=ఆ గొప్పవాడు; చర్చింపగన్=ఆలోచింపగా; ఇబ్బాలకుండు=ఈ చిన్నవాడు; మత్ బాలసఖుడు=నా చిన్నతనములోని స్నేహితుడైన తోభ్యనివలెనె కనబడుచున్నాడు; కనుగొంటె=చూచితివా అని; నిజ అంగనకు=తన భార్యకు; రహస్యమున్=ఉన్నస్థితిని ఇతరులకు దెలియకుండునట్లు తెలిపి; వారలన్ డాయ పిలిచి=ప్రమథుని బాలుని దగ్గఱకు రమ్మని పిలిచి; సంభ్రమము తనరన్=తొందరపాటు ఒప్పునట్లు; చిఱుతనగవు ఆననంబునన్ చెంగలింపన్=చిఱునవ్వు ముఖమునందు నటించుచుండగా.

5. చరింపగన్=తిరుగుచుండగా; ఒక్కయూరిలో అరుదారగన్=అబ్బురముగ; ఇబ్బాలుండు=ఈ పిల్లవాడు; మాకు శిష్యుడై మా వెంబడిని అరుదెంచెను=వచ్చెను; ఇతనిన్=ఈ బాలుని; కీర్తికవితునిగాగన్=మంచి కీర్తిని పొందువానినిగా; కరుణించితిమి=మేము వీనికి పేరు కలుగునట్లు అనుగ్రహించినాము.

ఉ॥ నావుడు భక్తిపూర్వక మనంబున నంజలిచేసి నేఁడుగా
పావన మయ్యె మద్గృహము భాగ్యము చేకుఱె మిమ్ముఁ గాంచుటన్
దేవరవార లీకరణిఁ ద్రిమ్మర నెచ్చటనైన శాంతిమ
ద్భావునిఁ దోభ్యనాము నొక భక్తునిఁ జూచితిరే మునీశ్వరా. 6

క॥ అనుటయుఁ బారిషదుం డి-ట్లనుఁ జూచితి మతని ఘనుని నా ధన్యునకుం
దనయుం డీతఁడె కాఁడే-కనుఁగొను మల్లుఁడగు నీకు గరుణ దలిర్పన్ 7

క॥ అని తనుఁ గనుసన్న యొన-ర్చిన దిగ్గున లేచి మ్రొక్కఁ బ్రియమలరారం
గని గ్రుచ్చి కౌఁగిలించుచు-మనుజేశ్వరుఁ డధిక మోదమగ్నుం డగుచున్. 8

ఆ॥ నా యనుంగు సఖుని నందను నేఁ గంటి-నతనిఁ గన్నయట్ల యక్షియుగము
చల్లనయ్యె మిగుల సంతోష మొదవె నె-మ్మదికి నేఁడు నాకు సుదిన మయ్యె. 9

క॥ కుశలమె నీ జనకునకును-గుశలమె తల్లికిని బంధుకోటికి నెల్లం
గుశలమె సన్మిత్రులకును-గుశలమె తత్పౌరజనులకును గుశలంబే. 10

చ॥ అని పరిణామ మారయుచు నాఁకలి గొంటిరి భోజనోత్తరం
బున మఱి కొన్ని యాడఁదగు ముచ్చట లాడుద మన్న భుక్తిపై
మన సొకయింత లేదిపుడు మామక చిత్తము నీ తనూజపై
గొనకొని నిల్చి యన్న యది కోరిక దీర్పక యొండు దోఁచునే. 11

క॥ అని పలికిన బాలునిపై-ననుకంపయు మున్ను గన్న హానియు మదిలోఁ
బెనఁగొన నేమియుఁ దోఁపక-యనుమానింపఁగ మునీంద్రుఁ డాతనితోడన్. 12

---

6. నావుడు=అనగా; భక్తిపూర్వక మనంబున=భక్తితోగూడిన మనస్సుతో; అంజలిచేసి=రెండు చేతులు జోడించుకొని; మద్గృహము నేడుగా పావనమయ్యెన్=నా ఇల్లు నేడే పవిత్రమైనది; మిమ్ము కాంచుటన్=చూచుటచేత; భాగ్యము చేకుఱెన్=నాకు ఐశ్వర్యము పట్టినది (దొరకినది); ఈకరణిన్=ఈ విధముగా; దేవరవారు =తమరు; త్రిమ్మరన్=తిరుగుచుండునపుడు; శాంతిమత్ భావుని=మిక్కిలి శాంతస్వభావముగల; తోభ్యనాముని =తోభ్యుడను పేరుగలవాడను ఒక భక్తుని ఓ మునీశ్వరా చూచితిరా.

7. అనుటయున్=ఇట్లు రాగ్వేలుడు చెప్పినప్పుడు; పారిషదుండు ఇట్లనున్=ప్రమథుడు చెప్పుచున్నాడు; అతనిని ఘనుని చూచితిమి; ఆ ధన్యునకున్=పుణ్యాత్మునకు ఇతడు (ఈ బాలుడు) తనయుండు కాడే; కరుణ దలిర్పన్=దయ పుట్టునట్లు చూడుము, నీకు ఇతడు అల్లుడు కాగలడు.

8. అని తన్ను గనుసన్న యొనర్చినన్=కంటితో సంజ్ఞ చేయగా; దిగ్గునన్=వేగముగ లేచి; మ్రొక్కన్= తోభ్యకుమారుడు నమస్కరింపగా; (ప్రమథుడు తోభ్యకుమారునికి సంజ్ఞ చేయగా రాగ్వేలునికి మ్రొక్కెను) ప్రియము అలరారన్=ప్రేమ ఎక్కువగునట్లు; కని గ్రుచ్చి కౌగిలించుకొని; అధిక మోదమగ్నుడగుచున్=మిక్కిలి సంతోషములో మునుగుచు; మనుజేశ్వరుడు=ఆ గొప్పవాడు (రాగ్వేలుడు) చెప్పెను.

9. నా యనుంగు సఖుని నందను=నా ప్రియ స్నేహితునియొక్క కుమారుని; ఏన్ కంటిని=నేను చూడగ; అతనిన్=తండ్రిని; కన్నయట్ల=చూచినట్లుగానే; అక్షియుగము=రెండు కన్నులు; చల్లనయ్యెన్=చల్లపడినవి; సంతోషము మిగులన్ ఒదవెన్=కలిగెను; నేడు నాకు సుదినము అయ్యె=మంచి దినమైనది.

10. కుశలమె=కుశలముగా నున్నారా; సన్మిత్రులకు=నా నిక్కమైన స్నేహితులకు.

11. పరిణామమారయుచు=బాలుని ముఖవిలాసము మొదలగు రూపము చూచుచు; మీరు ఆకలిగా నున్నారు; భోజన ఉత్తరంబున=భోజనము చేసినతర్వాత; ఆడతగు ముచ్చటలు=చెప్పవలసిన సంతోషవాక్యములను చెప్పుదుము; అనగా బాలుడు చెప్పినదేమనగా: భోజనముమీద నాకు మనస్సు కొంచెమైనను లేదు; మామక= నా చిత్తము నీ కూతురుమీద; గొనగొని=పూనికతో నిల్చియున్నది; ఒండు తోచునే=నాకు రెండవది తోపదు.

ఉ॥ మన్నన నియ్యకొమ్మితనిమాట విచారము సేయనేల నీ
కన్నియ నిమ్ము దీనికి వికల్పము గల్గదు మున్నుపోలె నా
పన్నశరణ్యుఁ డీశ్వరుఁడు భారకుఁడై కడ తేర్పఁ బూనినాఁ
డన్నిఖిలాధినాయకుని యాజ్ఞకు భంగము గల్గనేర్చునే. 13

క॥ అడిగినయెడ నర్పించుట - కడు ముఖ్యము జయము నేఁటికంటె ముహూర్తం
బొడఁగూడునె శోభన మీ - యెడఁ జేయు మటన్న విని మహీశ్వరుఁ డనియెన్. 14

క॥ నీ దివ్య కృపాకలన - న్నా దేహము చల్లనయ్యె నమ్మఁగ వచ్చున్
మీ దీవనల నిపుడు నీ - వాదరమున నాదు మాట నాలింపుఁ డొగిన్. 15

మత్తకోకిల॥ ఏడుమాఱులతోడ నిల్పితి మింతి పెండ్లి ప్రసంగముల్
పాడి గాదిఁక భర్తఁ గోరుట పాపహేతు వటంచు నా
యాఁడుబిడ్డ మనస్కరింపమి యాత్మలోన నెఱింగి మీ
తోడ నేమిఁక నందుఁ దారకుఁ దోఁచినట్లు నొనర్చెదన్. 16

సీ॥ అనవుడు రాగ్వేలుఁ - డతియనురాగము - నం దోభ్యని కరము నంది దనదు
ముద్దుసుత కరమం దొద్దికతో నిడి - దంపతులగు మీరు ధాత్రియందు
నీ బంధనంబు సర్వేశ్వర సంకల్పి - తంబని మది నమ్మి తేఱుగని సుఖ
భాగ్యము నాయురారోగ్యముఁ దనరఁ - గఁ బరస్పరానురాగంబు గల్గి

తే॥ పుత్ర పౌత్ర గణంబులఁ బొల్పుమీర - బొంది బంధు మిత్ర జను లానందమగ్న
లనఁగ వాంఛితార్థములెల్ల నమరఁ బొంది - సమ్మతంబుతోడ మనుఁడు సౌఖ్యమందు. 17

12. అనుకంపము=దయ; మున్ను కన్న హాని=ఇంతకుపూర్వము పొందిన కీడును(=ఏడుగురు భర్తలు చని పోయినది) మనస్సులో: పెనగొన=చుట్టుకొనగా;

13. ఇతని మాట మన్నన ఇయ్యకొనుము=ఈ బాలుని కోరికను మర్యాదగా సమ్మతింపుము; దీనికి వికల్పము మున్నుపోలె=మునుపటిరీతిని ఈ పెండ్లికి అడ్డు కల్గదు; ఆపన్న శరణ్యుడు=దీనులకు రక్షకుడు; భారకుడై=ఈ పని తనపై పెట్టుకొని; కడ తేర్ప=నెఱవేర్చుటకు పూనినాడు; ఆ నిఖిల అధినాయకుని=ఆ సర్వేశ్వరునియొక్క సెలవును; భంగము=ఆటంకము కలుగ చేయవచ్చునా?

14. అడిగినయెడన్=కోరినయెడల (కోరిన వానికి); అర్పించుట=కన్య నిచ్చుట; కడున్ ముఖ్యము=మిక్కిలి మంచిది; నేటికంటెన్=ఈ నాటికి మించిన; ముహూర్తము=పెండ్లిలగ్నము; ఒడగూడునె=దొరకునా; జయము=నీకు మేలు; ఈయెడన్=ఈ సమయములో; శోభనము=శుభకార్యము చేయుము; అటన్నన్=అనగా;

15. నీ దివ్య కృపాకలనన్=మీ యొక్క శ్రేష్ఠమైన దయ కలుగుటచేత; నా దేహము=నా శరీరము; చల్లనయ్యెన్=చల్లగానైనది; మీ దీవనలు నమ్మగవచ్చును; నామాట ఆదరమున=దయతో; ఆలింపుడు=వినుము.

16. ఏడుమాఱులతోడన్=ఏడుసారులు ప్రయత్నములు చేసి (అవి కొనసాగక); ఆడుబిడ్డ=నా కూతురు; ఇంకన్=ఇకమీద (ఎనిమిదవసారి); భర్తన్ కోరుట=పెనిమిటిని వరించుట; పాపహేతువు=పాపమునకు కారణము అని (నా కూతురు) మనస్కరింపమిన్=ఇష్టపడక పోవుటచేత; పెండ్లి ప్రసంగముల్=పెండ్లి మాటలు నిల్పితిమి=మానివైచితిమి; తారకు దోచినట్లు ఒనర్చెదను=నీకు తోచినట్లుగా చేసెదను.

17. అతి అనురాగమున=మిక్కిలి ప్రేమతో; తోభ్యని చేతిని అంది=పట్టుకొని; ఒద్దికతో ఇడి=పదిలముగా పెట్టి; ధాత్రియందు ఈ బంధనము సర్వేశ్వర సంకల్పితము అని=ఈ వివాహము దేవునివలన కల్పింపబడినదని; ఇద్దఱు మదిలో నమ్మి; తనర=అతిశయింపగా; పరస్పరాను రాగంబు=ఒండొరులపై ప్రేమ కలిగి; గణంబుల=సమూహముల పొంది; ఆనందమగ్నులనగ=సంతోషములో మునిగినవారలే యని స్నేహితులు చెప్పగా; వాంఛితార్థములెల్ల=కోరిన సంపదలన్నియు పొంది మనుడు=జీవింపుడు.

క॥ అనియు వధూవరుల నతం-డనేక వచనములతోడ నతిథియు వీక్షిం
ప నధిక ముదమున దీపిం-చెనంత విందారగింపఁ జేరిరి వారల్. 18

క॥ తన యర్ధాంగిని గని వెం-టనే వధూవరులకై పడక గృహమొక దా
నిని సంసిద్ధ పఱుపుమన-విని యా పడతి యొనగూర్చి ప్రీతిగ నట్టులన్. 19

తే॥ ముద్దుగూతును గదసి సమ్మోదమలరఁ-గా మసలక గొంపోవఁగా మోమునందుఁ
దొరఁగఁ గన్నీరు గలిగిన దుర్దశలను-దలఁచి విలపింపఁ గడఁగెను బొలతి మిగుల. 20

తే॥ దుర్దశల పెల్లునకును నెంతొ దురపిల్లు
పుత్రిక నుపలాలింపఁగఁ బూని ప్రీతి
జనని కౌగలించియు బాష్పజలముఁ దుడిచి
యాపదలు దొలఁగును నేడ్పు మానుమింక. 21

తే॥ ఆర్తియేల దేవునియందు నమ్మకంబుఁ-బొసగఁ నుంచవమ్మ నిన్ను బ్రోచునింక
మున్ను ననుభవించిన దుఃఖమునకుమారు-నీకు నాఁడు స్వామి సుఖము నిత్తుననగ. 22

తే॥ కొంత యూఱటఁ బొందెను గోమలాంగి-యుల్లసమలరగా నా వరునికి వేచి
యున్న రాగ్వేలుఁడును పంక్తినుండి లేచి-యల్లుని కరమునఁ గొనుచు నరుగుచుండ. 23

క॥ చికిబికి తల వెంట్రుకలును-గొకిబికి దేహమును బిల్లిగ్రుడ్డులు నిడుపు
న్మొకమును మిడికోఱలతో-నికిలించుచుఁ దత్పిశాచ మెదుటం దోఁచెన్. 24

క॥ తోఁచినయంతనె తనయెడ-దాఁచిన యా గుండెఁ దిగిచి తడయక వహ్నిన్
వైచినఁ దద్ధూమముచే-నా చండి గ్రహమ్ము కడు భయమ్మునఁ బాఱెన్. 25

తే॥ తోభ్యుఁడా తొయ్యలిని గాంచి తొలుత మనము
ధర్మవిధుల ననుసరించి దైవధ్యాన

---

**18.** వధూవరులు=దంపతులను; అతిథియు వీక్షింప=సన్మనస్కుఁడు చూడగా; విందారగింప=విందును భుజించుటకు చేరుకొనిరి.

**19.** తన అర్ధాంగిని=తన భార్యను; వెంటనే వధూవరులకై=తోడనే దంపతులకు; పడక గృహము ఒక దానిని=పరుండుటకు ఒక ఇంటిని సిద్ధము చేయుమని చెప్పగా.

**20.** తల్లి ప్రియమైన కూతురును; మసలక=ఆలస్యము చేయక; అక్కడికి తీసికొని పోగ; మోమునందు దొరగ కన్నీరు=ముఖమునందు కంటి నీరు పొర్లి పారగా; కలిగిన దుర్దశలను తలచి=పూర్వపు కష్టములను తలపోసికొని; పొలతి విలపింప గడగెను=స్త్రీ ఏడ్వసాగెను.

**21.** దుర్దశల పెల్లునకు=కష్టముల అతిశయమునకు; దురపిల్లు పుత్రిక=దుఃఖించెడు కుమార్తెను; ఉపలాలింపగ పూని=ఓదార్చుటకు యత్నము చేసి.

**23.** నా వరునికి వేచియున్న=ఆ పెండ్లి కుమారుని కనిపెట్టి యుండిన రాగ్వేలుడు.

**24.** చికిబికి తలవెంట్రుకలను=అపహాస్యమును బుట్టించు తలవెంట్రుకలును; కొకిబికి దేహమును=మిట్టపల్లముగల శరీరమును; పిల్లిగ్రుడ్డులు=తెల్లని కనుగ్రుడ్లును; నిడుపున్ మొకమును=కోలముఖమును; మిడికోఱలతో=మిట్ట (మీదికి లేచిన) దంతములును; (వీనితో) నికిలించుచు=పండ్లికిలించుకొనుచున్ తత్ పిశాచము; ఎదుటన్ తోచెన్=ముందు కనబడినది.

**25.** తోచిన యంతనె=కనబడిన తోడనె; తన యెడన్=తన దగ్గఱ (తోభ్యకుమారుడు); దాచిన నా (చేపయొక్క) గుండె; దిగిచి=తీసి; తడయక వహ్నిన్ వైచినన్=త్వరగా నిప్పులో వేయగా; తద్ధూమముచే=దానిపొగచే; ఆ చండిగ్రహమ్ము=ఆ దుష్టభూతము.

మందు మూఁడు రాత్రులు భక్తి యలరఁ గడపి
దంపతుల రీతిఁ బ్రవర్తించెద మిఁక వెనుక. 26

ఉ॥ నావుడు లేమ సంతసిలి నా మది నిశ్చయమైన రీతి నీ
భావము నొందె నౌ నిదియ పద్ధతి యజ్ఞులరీతి నీ యెడం
గేవల మూఢతం నిలువఁ గీడది యొప్పదు భక్తి యుక్తిమై
దేవుని వాసరత్రయమతిస్థితిఁ గొల్చుట మేలు చూడఁగన్. 27

క॥ అని నాతి పల్కినంతనె - వినయమున నిరువురు నిలచి ప్రేమాతిశయం
బునఁ దనరెడు దైవంబును - మనమునఁ దలఁచి కడు భక్తి మహిమం బొప్పన్. 28

క॥ ఘనుఁడా నదీనదములును - గనఁదగు మండల గణంబునందుం గల పా
వన రూపంబులు నీచే - తనములు నీ మహిమఁ దెల్పునవి నిక్కముగా. 29

క॥ ఆదామును సృజియించియు - మోదమునఁ జెలఁగ నతనికి ముదిత నొకతెనిన్
మేదిని నొసంగితివట మ - హా దయ దీపింప నాఁడు నానందమునన్. 30

తే॥ మేమిరువురము ధరణిలో మేల్మిఁ జెలఁగి ధర్మచరితముతో జీవితంబు నడప
నీయనుగ్రహము నొసంగు నిర్మలాత్మ - యనుచుఁ బలుపలు విధముల భజనసల్ప. 31

వ॥ నొండొరులు గలయం బ్రార్థించుకొని హృదయకమలంబు దదేకనిష్ఠాపరత్వంబున
సర్వేశ్వరు నారాధించుచుం బ్రపంచంబు మఱచి యుండునంత. 32

ఉ॥ వాకిటి పొంతఁ బొంచి వినువారికిఁ జప్పుడు దోఁపకుండినన్
వేకువ లేచి యా విభుఁడు వేగముగాఁ జని విహ్వలాత్ముఁడై

---

26. తొయ్యలిని గాంచి=తన భార్యను చూచి; తొలుత ధర్మవిధుల=ముందు ధర్మ చట్టములను ఆచరించి; దైవధ్యానమున=దైవసేవయందు; దంపతులరీతి=భార్యభర్తలవలె తరువాత నడచుదుము.

27. నావుడున్=ఇట్లు తొభ్యుడు చెప్పగా; లేమ=సతి; నా మదిలో నిశ్చయమైనరీతియే నీ భావమున ఒందెన్=నీ మనస్సును పొందినది(పుట్టినది); ఔన్=సరియే; ఇదియ పద్ధతి=ఇదియే (దేవుని భజియించుటయే) మంచి మార్గము; అజ్ఞులరీతిన్=తెలివిలేనివారవలె; ఈయెడన్ కేవలమూఢతన్ నిలువ కీడు=ఇప్పుడు మిక్కిలి యజ్ఞానముతోడ ఉండుట తప్పు అగును; అది సరికాదు; వాసరత్రయము=మూడునాళ్లు; అతిస్థితిన్=స్థిరముగా దేవుని కొల్చుట మేలు. (తా॥ నేను తలచినట్లే నీవును దలచితివి. కాబట్టి మనము మూడు దినములు దేవుని భజన చేసెదము.)

28. ప్రేమాతిశయమున తనరెడు దైవంబును=ప్రేమయొక్క అతిశయమువలన ఒప్పెడు దేవుని; భక్తి మహిమ ఒప్పన్=మహా భక్తియొక్క మహిమ ప్రకాశించునట్లుగా (ఈ దిగువ విధముగా వేడుకొనిరి.)

29. నదీనదములు=నదులును సముద్రములును; కనదగు మండల గణంబు=చూడగల మండలములయొక్క సమూహము; అందుగల పావన రూపములు=అందులో నుండు మంచి వస్తువులు; నీ చేతనములు=నీవలన ప్రాణము ఇయ్యబడినవి; అవి నిజముగా నీ గొప్పతనము తెలియచేయును.

30. అతండు మోదమున చెలగ=అతడు సంతోషముతో బ్రతుకుటకు; నాడు=ఆ దినము; మహా దయ దీపింప=నీ గొప్ప దయ ప్రకాశించునట్లుగా ఆయనకు ఒక స్త్రీని ఇచ్చితివి.

31 మేల్మిన్ చెలగి=సుఖమునందు వర్థిల్లి; ధర్మచరితముతో=మంచి చరితముతో బ్రతుకును సాగింపుటకు నీ అనుగ్రహము ఒసగుము, నిర్మల చరితముగలవాడ;

32. ఒండొరులు=వారిరువురు నొకరితో నొకరు; కలయం బ్రార్థించుకొని=కూడ వేడుకొని; హృదయకమలం=హృదయపద్మములో; తత్ ఏక నిష్ఠాపరత్వంబునన్=ఆ దేవునియందు ముఖ్యమైన నియమము గల ఆసక్తితో సర్వేశ్వరున్ ఆరాధించుచున్; ప్రపంచంబు మఱచి=దేవునిదప్ప తక్కిన లోకమును మఱచిపోయి;

హా కడతేరె నెయ్యుఁ డని యార్తి వహించి సమాధిఁ ద్రవ్వఁగాఁ
తేకువ నంపెఁ గొందఱ నతి త్వర నంతటఁ నింతిఁ జూడఁగన్, 33

తే॥ మగువ వేకువ నయ్యె నికను మౌనముగ గవాక్షముం దీసి విగతజీవంబునఁ బడి
యున్నవాఁడేమొ యల్లుఁడు కన్నులారఁ - గనియు రమ్మని రాగ్వేలుఁ డనఁగ నింతి 34

తే॥ దంపతుల మందిరంబును ద్వారఁ జేరి - గుప్తముగఁ జొచ్చి గని వచ్చి గుబ్బురనఁగ
భర్తఁ జూచి యల్లుఁడు జీవవంతుఁ డగుచు - సుఖముగా నిద్ర నిద్రిలుచున్నవాఁడె. 35

తే॥ అని కులాంగన యెఱిఁగింప నవనివిభుఁడు - ఘనతరానంద మగ్నుఁడై కన్నుఁగవను
గ్రక్కుగ్రక్కున హర్షాశ్రుకణములొలుకఁ - నతులు సల్పెను సర్వేశుమతినిఁ దలఁచి. 36

ఆ॥ పరఁగ నా తపంబు ఫలియించె నేఁడు నే - ఘనుఁడనైతి బంధుజనులలోన
హర్ష మొదవె మదికి ననుచు వేగమె తత్స - మాధి పూడిపించె మనుజవిభుఁడు. 37

ఆ॥ అంత నతనిఁ బిలువ నంపి కౌఁగిటఁ జేర్చి - నిలువుము కన్నె నిచ్చిఁ గల ధనంబు
నందు వెచ్చమునకు నర్ధంబొసంగెదఁ - గొనుము కొదవపడినఁ గొంకవలదు. 38

ఆ॥ దాచిపెట్టినట్టి ప్రాచీన ధన మెల్ల - నీ వశంబె చేతు నిక్కముగను
ధనము లేదటంచుఁ దలఁపకు బిడియంబు - వలవ దనుచుఁ జిత్త మలరఁ జేసి. 39

33. వాకిటిపొంతన్=గుమ్మముప్రక్కను; పొంచి=మాటుగానుండి; వినువారికి=వారేమి చెప్పుకొనుచున్నారో యేమి చేయుచున్నారో యని వినబోయిన వారికి; తోపకుండినన్=ఏమియు వినబడక పోవుటచేత; వేకువన్=తెల్లవారువేళ రాగ్వేలుడు లేచి; విహ్వలాత్ముడై=విచారగ్రస్త హృదయముతో; హా=అయ్యో; నెయ్యుడు=నా స్నేహితుడు; కడతేరెన్=భూతముచేత జంపబడినాడు అని; ఆర్తి వహించి=దుఃఖపడి; సమాధి త్రవ్వుటకు; తేకువన్=ధైర్యముగా (ఇక బ్రదుకడనుకొని) కొందఱన్; అతిత్వరన్=మిక్కిలి తొందరగా అంపెను అంతట; ఇంతిని=తన భార్యను చూచి చెప్పినదేమనగా.

34. మగువ=స్త్రీ; వేకువయ్యెన్=వేకువ అయ్యెను; మౌనముగా గవాక్షము తీసి=శబ్దము లేక తలుపు తీసి; అల్లుడు విగత జీవంబున పడి యున్న వాడేమో=అల్లుడు విడిచిన జీవముతో నున్న వాడేమో; చూచి తిరిగి రమ్మని రాగ్వేలుడు అనగా; అంత వాని భార్య.

35. దంపతుల మందిరము=వధూవరులుండు గృహము; గుబ్బురనగ=గుండె అదరగా; నిద్రిలుచున్నవాడె=నిద్రించుచున్నాడు.

36. అని కులాంగన=తన భార్య; ఎఱిగింపన్=తెలుపగా; అవని విభుడు=ఆ గొప్పవాడు; ఘనతర ఆనంద మగ్నుడై=ఎక్కువైన సంతోషములో మునిగి; గ్రక్కుగ్రక్కునన్=అతి తొందరగా; కన్నుగవను=రెండు నేత్రములనుండి; హర్ష అశ్రుకణములు=సంతోషముచే పుట్టెడు కన్నీటి బిందువులు (ఆనందబాష్పములు); ఒలుకన్=కాఱుచుండగా;

37. పరగన్=ప్రసిద్ధముగా; ఫలియించెన్=పండినది; నేడు నేను బంధుజనులలో ఘనుడనైతిన్=గొప్పవాడనైనాడను; హర్షము ఒదవెన్=సంతోషము కలిగినది; అనుచున్ వేగమె తత్సమాధిన్=త్రవ్వించిన పల్లమును; పూడిపించె=మూయించె; మనుజవిభుడు=ఆ ప్రభువు.

38. అతని పిలువనంపి=పిలిపించి కౌగిట జేర్చి; నిలువుము కన్నెన్=నా కూతును ఇచ్చి; వెచ్చమునకున్=నీకు సెలవు చేసికొనుటకు; కల ధనంబునందున్=నాకున్న సొమ్ములోనుండి; అర్ధంబు=సగము; ఒసగెదన్=ఇచ్చుచున్నాను; కొనుము=పుచ్చుకొనుము; కొదవపడినన్=నీకు ధనము చాలకపోయినయెడల; కొంకవలదు=సందేహపడకుండుము (మరల ధనము అడుగుము).

39. ప్రాచీన ధనమెల్ల=పూర్వమునుండి వచ్చుచున్న ప్రాతసొమ్ము; నీవశంబె చేతున్=నీకు నిచ్చెదను; బిడియంబు వలదు=అడుగుటకు సిగ్గుపడవలదు.

తురగవల్గనరగడ॥ పరఁగు మంత్రివరులఁ బిలువఁ బంచి పరిణయంబు లేఖ
లరసి యెచట నెచటఁ గలుగు నాప్తబంధుమిత్రనికర
ములను బాలవృద్ధసహితముగను దరలి రమ్మటంచు
వలనుమీఱ సాటిరాజవరుల నెల్ల సపరివార
ముగను గదలి రమ్మటంచు ముదము దనరఁ జుట్టుఁ గలుగు
నగరముల వసించు ప్రజల నయమెలర్ప వంటకట్టె
యలుఁ దృణంబు దధిపయోఘృతాధికములు దెమ్మటంచు
నెలమి వ్రాయఁ దగినవారి కెల్ల వ్రాసి పనుపుఁ డనుచు
నక్కలాకు లత్తరును జవాది గంధసార మగరుఁ
జొక్కమైన గందవొడియు సుమరజమును గప్పురమును
మృగమదమునుఁ గుంకుమయు హరిద్రమును గచోరములును
దగ మనోహర ప్రసూనదామములును బంచదార
మధువు గుడము జున్ను వెన్న నేతియు నిక్షుఖండములును
మధుర ఫలవితానములును మంచి చొక్కసన్నఁబ్రాలు
రత్నమయవిభూషణము రాంకవాంబరములు దిండ్లు
నూత్న హేమసూత్రయుతవినోదవస్త్రభారములును
విక్రయించి ధనము లొసఁగి వేగఁ దెచ్చి కొట్లయం ద
వక్రసరణి నింపు మనుచు వైభవంబు దనరునట్లు
వేఁపురం బలంకరించి వివిధ వస్తుపూర్ణములుగ
నాపణములు వాడవాడలం దమర్చియుండుఁ డనుచు
నృత్యగీతవాద్యవిధుల నెఱపుఁ డనుచు లగ్నమునకు

40. పరగు మంత్రివరుల=ప్రసిద్ధికెక్కిన మంత్రులలో శ్రేష్ఠులను పిలిచి; పరిణయంబు లేఖల అరసి=పెండ్లికి రమ్మని వ్రాయు శుభలేఖలు కనుగొని; ఎచట నెచట=ఎక్కడ నెక్కడనో (దూరదేశమందుకూడ) కలుగు; ఆప్త బంధు మిత్రనికరములను=దగ్గరిచుట్టములు స్నేహితులు వీరి సమూహమును; బాల వృద్ధ సహితముగ=చిన్నపిల్లలు ముసలివాగలతోగూడ; తరలి=ప్రయాణమై రమ్మని (వ్రాసి); వలను మీర=అనుకూలమగునీతిని; సాటిరాజవరుల=తనతో సమానులైన ధన్యులందరిను; సపరివారముగ=వారివారి బంధువులు సేవకులు మొదలగు వారితో; కదలి=బైలుదేరి రమ్మని (వ్రాసి); ముదము తనర=సంతోషము పుట్టునట్లు; జుట్టు గలుగు నగరముల=చుట్టుప్రక్కలనుండు పట్టణములలో వసించు జనులను; వంటకట్టెయలు తృణము దధి పయః ఘృత అధికములు=వంటచెఱకు గడ్డి పెరుగు పాలు నేయి మొదలగువానిని తెండు అని; పనుపుడు=పంపవలసినది అని వ్రాసి; జవాది=జవ్వాజిపిల్లినుండి వెడలు పరిమళద్రవ్యము; అగరు=ఒక విధమైన గంధము; గందవొడి=బుక్కాముపొడి; సుమరజము=పువ్వులలోనుండు రజము; మృగమదము=కస్తూరి; హరిద్రము=పసుపు; కచోరములును=ఒక విధమైన పరిమళము; ప్రసూన దామములు=పువ్వుల మాలలు; మధువు=తేనె; గుడము=బెల్లము; నిక్షుఖండములు=చెఱకుగడల; ఫలవితానములు=తీయని పండ్లు; చొక్కసన్నబ్రాలు=ఈ పేరుగల సన్నబియ్యము; రాంకవ అంబరములు=గోనుపు బట్టలు (సాధారణ వస్త్రములు); నూత్న హేమ సూత్ర యుత వినోద వస్త్ర భారములు=క్రొత్తబంగారు దారములతో గూర్పబడిన చిత్రమైన బట్టల మూటలను; విక్రయించి=కొని; కొట్లయందు అవక్రసరణి నింపుము=గదులలో పొదుపుగా నిండించుమని; వే=వేగముగా; వివిధ వస్తు పూర్ణములుగ; ఆపణములను=అనేక విధములైన వస్తువులతో నిండిన అంగడులను; వాడ వాడలందు=ప్రతి వీధిలోను అమర్చియుండు అనుచు; నృత్యగీత వాద్య విధుల=నాట్యములు సంగీతము దుందుభులు; విధుల నెఱపుడు=పైవానియొక్క యేర్పాటు

సత్య మెడము లేదె యెల్లి సావకాశ మొక్క దినమ
మనుచుఁ బెండ్లియత్నమునకు నవనివిభుఁడు రభసమలర
ధనముకొట్లు గడిసి వేగఁ దాళములు వదల్చె నపుడు. 40

సీ॥ ప్రమథునిఁ గాంచి తోభ్యకుమారుఁ డనియె మీ - విమల కృపాకటాక్షమునఁ గాదె
శుభ మొనఁగూడె నిచ్చో రాగెనూరి గ - బేలుని ధనము దేఁ బోలుటెట్లు
లనిన నమ్మానియు విని పెండ్లి కతనిఁ దో - కొనివత్తు నేఁ జని ధనముతోడ
ననుచు నాతని వీటి కరిగి సమస్తముఁ - దెలిపి మీరరు దేరవలయు ననుట.

తే॥ కనిన సంతోషమంది యే ధన మొసంగ - వలయుఁ బత్రంబుఁ దెచ్చితే నచ్చునప్పు
డనినఁ గల దన నది గొని యర్థ మొసఁగి - పెండ్లి కేతెంచె నెలమి గబేలుఁ డపుడు. 41

వ॥ అంత నవ్వసుంధరాధీశ్వరుని పనుపున నప్పట్టణంబు చుట్టునుంగల వివిధమార్గంబుల వెంబడి ననేక కరితురంగస్యందనభటనికరంబులు గొలువం బఱతెంచు సామంతరాజలోకంబును, జతురంతయానంబుల ధర్మపత్నీసహితంబుగ శిశుబాలవృద్ధులతోడం బరివారసమేతంబుగను నేతెంచు సుహృదాప్తబంధువర్గంబును, వైయాకరణతార్కిక మీమాంసక విద్వత్కవిగాయక వందిమాగధసందోహంబును, బుత్రికానాటక తంత్రావధానులును, జాతివార్తలు వలికెడు బహువిధ వేషధారులును మొదలుగాఁ గల యనేక విద్యావంతులుం గుములు గూడి దట్టంబై నెట్టుకొని నేల యీనిన చం

ప్రకారము జరిగింపుడు అనుచు; లగ్నమునకు సత్యముగా ఎడము లేదు=పెండ్లిముహూర్తమునకు ఆలస్యము లేదు; ఎల్లి ఒక్క దివసము సావకాశము=రేపు ఒక్క దినము వ్యవధి యున్నది (రేపుగాక యెల్లుండియే పెండ్లి); పెండ్లి యత్నమునకు=వివాహ కార్యమునకు ఆ ప్రభువు; రభసమలర=వేగముగా; ధనము కొట్లు గడిసి=ధనము దాచిన గదులయొద్దకు సమీపించి; అపుడు తాళములు వదల్చె=తీసివైచెను.

**41.** కృపాకటాక్షమున=మీ దయతో కూడిన చూపుచేతనే గదా; శుభము ఒనగూడె=నాకు పెండ్లి అయినది; ఇచ్చో=ఇప్పుడు రాగెనూరిలో నుండు గబేలునియొద్ద నున్న ధనము; ఎట్లు తే పోలుట=ఎట్లు తెచ్చుటకు సాధ్యమగును; ఆ మాని=ప్రమథుడు; అతని=గబేలుని; వీటికి=అతని పురమునకు పోయి; పత్రము తెచ్చితే=నేను వ్రాసి యిచ్చిన కాగితము తెచ్చినావా: నీవు వచ్చినప్పుడు అని గబేలుడు అనగా, సన్మనస్కుడు గలదని చెప్పగా నాతడు అర్థము=ధనము ఇచ్చి;

**42.** ఆ వసుంధరాధీశ్వరుని పనుపున=ఆ ధన్యుని సెలవుప్రకారము; (1) అనేక కరి తురగ స్యందన భట నికరంబులు=ఏనుగులు గుఱ్ఱములు రథములు సేన వీనియొక్క సమూహము; కొలువ ఎఱతెంచు సామంతరాజలోకమును=తనతో రాగా వచ్చుచున్న తనకు లోబడిన చిన్నచిన్న అధిపతులను; (2) చతురంతయానంబుల ధర్మపత్నీసహితంబుగ శిశు బాల వృద్ధులతోడ పరివార సమేతంబుగ=పల్లకీలలో భార్యలతో కూడుకొని చంటిబిడ్డలు బాలురు ముసలివాండ్రతోగూడ దాసదాసీజనముతో; ఏతెంచు సుహృత్ ఆప్త బంధువర్గంబు=వచ్చుచున్న స్నేహితులు తెలిసినవారు చుట్టములు; (3) వైయాకరణ తార్కిక మీమాంసక విద్వత్ కవి గాయక వంది మాగధ సందోహము=వ్యాకరణశాస్త్రము చదివినవారలు తర్కశాస్త్రము చదివినవారలు మీమాంసశాస్త్రము చదివిన వారలు విద్వాంసులు కవులు సంగీతవిద్వాంసులు బట్టులు స్తోత్రములు చేయువారు ఈ సమూహము; పుత్రికా నాటక తంత్ర అవధానులును=తోలు మొదలగువానితో జేయబడిన బొమ్మలు (పుత్రికలు) వీనిచేత నాటకమాడించ నేర్పు గలిగిన నాటకులును; జాతివార్తలు=అనేక జాతులవారి భాషలు పలికెడునట్టి; బహు విధ వేషధారులును=అనేక వేషములు వేయ నేర్చినవారును (బ్రాహ్మణజాతి మాటలాడ నేర్చిన బ్రాహ్మణవేషము వేయవలెను; తురకజాతి మాటలాడవలసిన తురక వేషము వేయవలెను, బిచ్చగానివలె మాటాడ దలచిన బిచ్చగానివలె వేషము వేయవలెను; ఇట్లు ఆ యా జాతిమాటలు పలుకునపుడు ఆ యా జాతివేషములు వేయువారు అనగా వే

దంబునం బురంబు ప్రవేశించినం గనుంగొని ప్రమోదభరితాంతరంగుఁడై రాగ్వేలుండు నెవ్వరెవ్వరి కనుకూలంబు లెట్టెట్టు లయ్యె నట్టులు వెలిగుడారంబులునుం దగు విడిమట్లునుం గుదిరిచి భోజనాదికంబు లొనఁగూర్చి. 42

ఉత్సాహ॥ తోరణాలు పచ్చతాలతో నమర్చి గంధక
స్తూరికాగరు ప్రసిద్ధ శుద్ధ వస్తువాసనల్
భేరికామృదంగదుందుభిస్వనంబు లంతటన్
గౌరవంబుతోఁ జెలంగఁ గన్య నిచ్చె దానమున్. 43

వ॥ ఇట్లు కన్యాదానంబు గావించి యెల్లవారల ననేక విధ భక్ష్యభోజ్యాదికంబులఁ దృప్తులంగా నొనర్చి, నిఖిలభూతసంతుష్టికరంబుగా సంతర్పణం బాచరించి, బంధుమిత్రాది జనంబుల నభిమతాహారవస్త్రాభరణవీటికాదానంబులం దనిపి, నానావిధ యాచక బృందంబుల నన్నవస్త్రాభరణాదుల బహూకరించి, యల్లునిం గతిపయ దినంబులు నిలిపి, సబహుమానంబుగా తృణకాష్ఠజలసమృద్ధంబులై వెలయు ననేక గ్రామంబులును, నీలాచలసన్నిభంబులైన గంధసింధురంబులును, గంధవాహసమాన వేగంబులైన తురంగంబులును, సూతవాహకాయుధసమేతంబులై యొప్పు రథంబులును, నిరతిశయపరాక్రమంబున బిక్కటిల్లు పదాతియూథంబును దాసదాసీజనంబులుం, బాఁడి మొదవులు, నవరత్నఖచితంబులైన యాభరణంబులుఁ, జీనిచీనాంబరంబులును,

---

స్యగాంధ్రుఁడు); మొదలుగాగల అనేక విద్యావంతులు=పలువిధ విద్యలు నేర్చినవారు; గుములు గూడి=గుంపులు గుంపులుగా గూడుకొని; దట్టంబై నెట్టుకొని=పురంబు నిండ క్రిక్కిరిసి; నేల యీనిన చందంబునన్=ఒకవేళ వీరి నందఱిని భూమియే యీనుచున్నదా (ఎక్కడనుండియైన వచ్చుచున్నారా లేక ఎక్కడికక్కడ భూమిలోనుండి బైలుదేరుచున్నారా) అనునట్లు పురంబు ప్రవేశించినన్ కనుంగొని; ప్రమోద భరిత అంతరంగుడై=మిక్కిలి సంతోషముచేత నిండిన మనస్సుగలవాడై రాగ్వేలుండు; ఎవ్వరెవ్వరికి ఎట్టులెట్టులు అనుకూలంబులు అయ్యెన్=ఎవరికి ఏచోట నివసించుటకు అనుకూలముగా నుండునో; అట్టులు=ఆ ప్రకారము; వెలిగుడారంబులును=తెల్లని డేరాలును; తగు విడిమట్లును=నివసించుటకు దగిన యిండ్లును కుదిరించి; భోజనాదికంబులు=వారికి గావలసిన అన్నము మొదలైనవి; ఒనగూర్చి=పెట్టించి.

43. తోరణాలు పచ్చతాలతో నమర్చి=గరుడపచ్చలతో తోరణములు కట్టించి; గంధ కస్తూరిక అగరు ప్రసిద్ధ శుద్ధ వస్తు వాసనల్=మంచి గంధము కస్తూరి చాలా మంచి పరిమళవస్తువుల వాసనలును; భేరిక మృదంగ దుందుభి స్వనంబులు=వాద్యధ్వనులును; అంతట గౌరవంబుతో చెలగ=అన్నిచోట్ల గొప్పతనముతో ఒప్పగా

44. అనేక విధ భక్ష్య భోజ్య ఆదికంబులన్=పలు తెఱగులైన పిండివంటలతో భోజనము మొదలైనవానిచే; నిఖిల భూత సంతుష్టికరంబుగా=అన్ని ప్రాణులు తృప్తిపొందునట్లు; సంతర్పణము ఆచరించి=సంతర్పణ చేసి (అనగా అన్నదానము చేసి); అభిమత ఆహార వస్త్ర ఆభరణ వీటికా దానంబులన్=వారు వారు కోరుకొనినట్లు భోజనము వస్త్రము నగలు తాంబూలము మొదలైనవానిచేత; తనిపి=సంతోషపెట్టి; నానా విధ యాచక బృందంబుల=అనేక విధములగు యాచకుల సమూహము; బహూకరించి=బహుమానము చేసి; కతిపయ=కొన్ని దినములు; తృణ కాష్ఠ జల సమృద్ధంబులైన=గడ్డి కట్టెలు నీరు వీనితో పూర్ణమై వెలయు పెక్కు ఊళ్లును; నీల అచల సన్నిభంబులైన గంధసింధురముల=నల్లని కొండలవలె నున్న ఏనుగులను; గంధవాహ సమాన వేగంబులైన తురంగంబులును=గాలితో సరిపోవు వేగము గలిగిన గుఱ్ఱములును; సూత వాహక ఆయుధ సమేతంబులై ఒప్పు రథంబులును=తోలువాడు గుఱ్ఱములు కత్తులు బాణములు మొదలైనవానితో కూడిన తేరులును; నిరతిశయ పరాక్రమంబున పిక్కటిల్లు పదాతియూథంబును=గర్వములేని సహాసముతో కూడి బలిసిన కాలుబలమును; పాడి మొదవులును=పాలిచ్చు ఆవులును; నవరత్న ఖచితంబులైన యాభరణంబులు=వజ్రము మొదలైన తొమ్మిది రత్నములు

మౌక్తికచ్ఛత్రంబులును, దూఁగుటుయ్యేల, లాందోళికలును హంసతూలికాతల్పంబులును, బరిమళద్రవ్యంబులును దాళవృంతంబులును మొదలుగా ననేక ద్రవ్యంబు లరణంబుగా నొసంగి, కూతు నాలోకించి నీవు పతివ్రతలలోనం బేరు గలిగి సమయోచిత సపర్యావిధానంబుల భర్తకుం బ్రియంబు పాటించుచు సత్తనూముల ననుగుణంబుగాఁ బ్రవర్తించునది యని బుద్ధి గఱపి తరుణీరత్నంబులఁ గొందఱఁ గూడం జనఁజేసి మఱియునుఁ మంత్రివర్గంబుల వెంబడి నియోగించి ప్రయాణంబు సిద్ధంబుచేసి తద్వధూవరులు మ్రొక్క నక్కునం జేర్చి యాశీర్వదించుచుఁ బంచమహావాద్యఘోషంబు లాకసం బంటి ఘూర్ణిల్లఁ జతురంగబల సమేతంబుగాఁ బంపకంబు చేసిన గదలి యా రాత్రి క్రోశమాత్రదూరంబున నొక్క పురంబునం బ్రవేశించి యుండి రంత నక్కడ. 44

సీ॥ తనయుఁడు నర్థియై ముని వెంట నరిగి పె-క్కు దినంబు లయ్యెను గుశలవార్త
వినఁబడదయ్యె నే వెంవున నేగిరో-గహనమార్గంబున బహుళసత్త్వ
చోరభయంబుల సుద్దు లెట్టివో గదే-లుచు పట్టణమునకుఁ జనిరో లేదొ
యతఁడు కన్యకి వారి కర్థ మిచ్చెనో లేదొ-యిచ్చిన నది గొని వచ్చునప్పుడు
తే॥ నడుమఁ గుంఠిత మెట్టిదో కడు శరీర-సంకటము లెట్టివో రాక జాగు చేసి
రేమొకో యని సంతాప మినుమడింప-నన్నమాంబిక మదిలోన నడలునపుడు. 45

ఆ॥ జాలిఁ బొంది భర్త సరగున ధైర్యంబు-పూని భార్యతోడ మాను మబల
యంగలార్పులేల నా ముని వెంటనే-యేగినట్టి సుతుని కేమి కొదవ. 46

పొదిగిన భూషణములును; చీని చీనాంబరములు=సన్నని చీనాదేశపు పట్టుబట్టలును; మౌక్తిక ఛత్రంబులును=ముత్యాల గొడుగులును; తూఁగు=ఊఁగెడు ఉయ్యేలలు; ఆందోళికలు=పల్లకీలు; హంస తూలికాతల్పంబులు=హంసలనెడు పిట్టల రెక్కల మెత్తని వెండ్రుకలు అనెడు దూదితో చేయబడిన పరుపులును; తాళవృంతంబులు=విసనకఱ్ఱలును; అరణంబుగా=అల్లునికి ఇచ్చెడు బహుమానము; పతివ్రతలలోన=పెనిమిటివిూద భక్తిగల స్త్రీలలో; సమయ ఉచిత సపర్యావిధానంబుల=ఏ సమయమునకు ఏది తగునో ఆ విధమైన సేవచేత; భర్తకు ప్రేమ పాటించుచు=కనపరచుచు; అనుగుణంబుగా ప్రవర్తించునది=తగినట్లు సంచరింపవలయును; తరుణీరత్నంబుల గొందఱు=కొంతమంది మంచి స్త్రీలను; మంత్రివర్గముల వెంబడి నియోగించి=బట్టుల సమూహము వారివెంట పోవలెనని కట్టడ చేసి; తద్వధూవరులు మ్రొక్క=పెండ్లికొడుకును పెండ్లికూతురును తనకు నమస్కారము చేయగా; అక్కున చేర్చి=కౌగలించుకొని; పంచ మహా వాద్య ఘోషంబులు=అనేక విధములైన గొప్ప వాద్యముల చప్పుడు; ఆకసంబు అంటి ఘూర్ణిల్ల=ఆకాశము తాకి ఎక్కగా; చతురంగ బలసమేతంబుగా=నాలుగు (ఏనుగులు గుఱ్ఱములు రథములు కాల్బలము) అంగములతో కూడుకొనగా; పంపివేయగా; ఆ రాత్రి=ఆ కదలిన రాత్రి; క్రోశమాత్ర దూరంబున=ఒక కోసు దూరములో నున్న ఒక పురము ప్రవేశించిరి.

45. అర్థియై=కోరికతో; కుశలవార్త=వారు క్షేమముగా నున్నారనిన సంగతి వినబడలేదు; ఏవెంవునన్=ఏ తీరున వెళ్లినారో; గహనమార్గంబున=అడవి త్రోవలో; బహుళ సత్త్వ చోర భయంబులు=విస్తారమైన మృగములు దొంగలవలని భయము కలదు, సుద్దులు ఎట్టివో=వార్తలేమి యుండునో; (జంతువులు దొంగలు ఏమి చేసెనో) కుంఠిత మెట్టిదో=కష్టము ఏమి యడ్డు వచ్చినదో; శరీర సంకటములు=వారి దేహములకు ఏమైన రోగములు కలిగినవేమో; రాక జాగుచేసిరి=వచ్చుటకు ఆలస్యము చేసినారో; సంతాప మినుమడింప=దుఃఖము ఎక్కువకాగా; అడలునపుడు=భయపడుచుండగా.

46. జాలి పొంది=కనికరము పుట్టి; అబల=ఓ యాడుదాన; మానుము=దుఃఖము మానుము; ఆ ముని వెంటనే=ఆ పుణ్యాత్ముని వెంటనే వెళ్లిన సుతునికి ఏ లోపమును లేదు.

ఉ॥ సంతస మొప్ప నందనుఁడు సయ్యన వచ్చును మేలు నొందు నీ
వంత దొరంగు మంచు సతి వల్లభుఁ డీ గతి నూఱడింపఁగా
నింతయు సన్మనస్కుఁడు గ్రహించుచుఁ బెండ్లికుమారుఁ జేరి యొ
క్కింతరహస్యగోష్ఠి గల దీ విటు రమ్మని వేడ్కనిట్లనున్. 47

ఉ॥ కుందుచు నున్నవారు నినుఁ గొబ్బునఁ జూడమి నెమ్మనంబులో
నం దలిదండ్రు లెంతయును నమ్మిరి కన్నను నిల్చు టొప్పదీ
యిందఱితోడఁ గూడి మన మీగతి జాగునఁ బోవరాదు ము
న్ముందుగఁ బోయి వారిఁ గడు మోదముఁ బొందఁగఁ జేయు టొప్పగున్. 48

చ॥ అదియునుఁ గాక నీ జనకు నంధత కష్టముఁ గాంచి యిజ్జనుల్
పడ గెద నట్లు గాక యవిలంబగతిం జని తండ్రి నూత్నక్కు లిం
పొదవఁగఁ జేసి లేమి కడ లొందఁగఁ జేసి ఘనత్వవైఖరిం
బొదలుట మేలు నీ విపుడు పొందిన యౌషధనిష్కసంపదన్. 49

క॥ అని పలికిన విని మనమున - ఘనకౌతుక మొదవ నిదియె కార్యం బని త
జ్జనులను మెల్లన రండని - మునివరుఁడును దానుఁ జనిరి ముందుగఁ గడఁకన్. 50

తే॥ అట్టియెడ మార్గపరిసరమందు నున్న - యొక సమున్నత పర్వతంబు నవలీల
గా నధిష్ఠించి సుతుఁ దల్లి కనఁగనుండ - దవ్వునం దృష్టిపథమునఁ దగిలె నతఁడు. 51

47. సంతస మొప్ప=సంతోషించుచు నీ కొడుకు త్వరగా వచ్చును; నీ వంత దొరగుము=నీ దుఃఖము విడిచి వేయుము: అని భర్త ఈ రీతిగా ఓదార్చగా; సన్మనస్కుఁడు ఇంతయు గ్రహించుచు=ఇట్లు తల్లిదండ్రులు దుఃఖించుట తెలిసికొని; ఒక్కింత రహస్యగోష్ఠి గలదు=ఎవ్వరికి తెలియని రీతిగా చెప్పవలసిన సమాచారము ఉన్నది;

48 తలిదండ్రులు నినున్ గొబ్బునన్ చూడమిన్=త్వరగా నిన్ను చూడక పోవుటచేత; నెమ్మనంబులోన్=మనస్సులో; కుందుచున్ ఉన్నవారు=విచారపడుచున్నారు; నను ఇకన్ నమ్మిరి=నన్నే ఇకమీద నమ్మికొని (నేను తీసికొని వెళ్లినదానికి భయము లేదని నమ్మికొని యుండిరి.) నిల్చుట ఒప్పదు=మనము ఆలస్యము చేయుట కూడదు; ఈగతిన్=ఈ రీతిని; జాగునన్=ఆలస్యముగా; పోవరాదు=పోగూడదు; (భార్యతోను సేవకులతోను నెమ్మదిగా వెళ్లగూడదు.) మున్ముందుగ=మనము వీరికంటె ముందే వెళ్లి; వారిన్=మీ తలిదండ్రులను; మోదము పొందగ జేయుట ఒప్పగును=సంతోషపడినవారినిగా జేయుట తగును.

49. అదియునుగాక=వారిని సంతోష పెట్టుటయే కాకుండ; నీ జనకుని అంధతన్=నీ తండ్రియొక్క గ్రుడ్డితనమును: ఇజ్జనుల్=వీరందఱును కాంచి; పడగెదరు=అయ్యో యీ కన్య మామగారు గ్రుడ్డివాడే యని వ్యర్థముగా పలుకగలరు; అట్లుగాక=కాబట్టి; అవిలంబగతిన్=ఆలస్యము లేకుండ రీతిని వేగముగా చని; తండ్రి నూత్నక్కులు=నీ తండ్రి కన్నుల చూపులు; ఇంపు ఒదవగన్ చేసి=బాగుపడునట్లు చేసి; లేమి=దారిద్ర్యమును; కడలు ఒందగన్ చేసి=దూరముగా తొలగిపోవునట్లు చేసి; వచ్చినవారలు చూచి (అయ్యో వీండ్రింత బీదవాండ్రే యనుకొనకుండ) ఘనత్వ వైఖరిన్=పెద్ద యైశ్వర్యము గలవారి మనునట్లు; పొదలుట=నటించుట (గొప్పవారమై యుండుట) మేలు; (తండ్రి కన్నులెట్లు వచ్చునందునా దరిద్ర మెట్లు పోవునందువా) నీవు ఇపుడు పొందిన=నీ యొద్దను జేరిన; ఔషధ నిష్కసంపదన్=కన్నులకు మందుగా నుండు పిచ్చుచేతను గబేలుడును నీ మామగారిచ్చిన నిష్కముల (నాణెములు) ధనముచేతను; (నీవు త్వరగా వెళ్లి యీ పిచ్చు కన్నులకు బెట్టి తండ్రికి చూపు గలుగ జేసి నీ యొద్దనున్న ధనముతో గొప్పతనము చూర్పుము.)

50. ఘనకౌతుకము ఒదవన్=గొప్ప సంతోషము కలుగగా; ఇదియె కార్యంబు=ఇదియే తప్పక చేయవలసిన పని అని; తత్ జనులను=తన పెండ్లికూతురుతో వచ్చువారిని; కడకన్=మిక్కిలి పూనికతో;

51 అట్టియెడ=ఆ సమయమందు; మార్గ పరిసరమందు=దారి ప్రక్కన; సమున్నత=ఒక ఎత్తయిన కొండ

తే॥ కంటఁ బడినంత సన్నమ్మకడు ముదమున - పర్వతము డిగి పరుగిడి ప్రాణనాథు
నికి సతునిరాక నెఱిఁగింప నెలమిఁ జెంది - యాతఁడు నిట్టూర్పు నిగిడించె వెతలుబాయ 52

తే॥ సన్మనస్కుఁడు తోభ్యుని సంజ్ఞచేసి - యయ్య గేహప్రవేశంబు చేయంగ నీవు
పిచ్చుగకరమునఁ దీసియుఁ బిత్రుని నేత్ర - ములకు సంటపలయు దృష్టిఁబొంద నతఁడు. 53

తే॥ అనిన వల్లె యనుచు నిల్లు డాయుచుండ - వంగి జనకుండు తనయు నాలింగనంబు
సేయ దానునికరమునఁ తోయనఁగొని - యెదురుగఁ జనియె నానందమినుమడింప. 54

తే॥ ఆత్మజుఁడు సన్మనస్కుని యాజ్ఞఁ దల్లి - దండ్రులకు మ్రొక్క వారి లిద్దఱును గదిసి
వలనుపడఁ గౌఁగిటను జేర్చి వదలరైరి - పుత్రవాత్సల్యమున కెంత భూరిబలము. 55

క॥ మేనుబ్బఁగ నమ యితరము - గానక ధరఁ బడ్డ పైఁడిఁ గన్నట్లుగఁ దా
నానంద బాష్ప జలముల - చే నందను జలకమార్చి చిత్తం బలరన్. 56

సీ॥ ఒక్కింత సేపునఁ గొయ్యన వదలి గ - ణాధీశ్వరునకు సాష్టాంగ మెఱఁగి
లేచిన మీ తండ్రి లోచనంబుల కౌష - ధముఁ బెట్టు మనవుఁడు తనయుఁ డప్పు
డమ్మందు కన్నుల నలవరించిన విశ్వ - మెల్ల తండ్రికిఁ దేటతెల్లమయ్యె
సంతటఁ గడలేని యానందవార్ధిలోఁ - దేలుచుఁ బదముల వ్రాలుచు ముని

తే॥ వర్య భవదీయ సత్కృపావశతఁ గాదె - యంధత దొలంగె ధన్యుఁడనైతి నింక
నీ ఋణంబెట్లు తీర్చుకో నేర్చువాఁడ - నని సపత్నీకుఁ డై తోభ్యుఁ డతనిఁ బొగడె. 57

ను; అవలీల=సులభము గా; అధిష్ఠించి=ఆశ్రయించి; కనగనుండ=కుమారుని చూచుటకై ఉండగా; దవ్వున=దూరమున; అతడు దృష్టిపథమున=కనబడెను.

52. వెతలుబాయ=కష్టములు తొలగినట్లు; నిట్టూర్పు నిగిడించె=దీర్ఘముగా శ్వాసించెను.

53. గేహము=ఇల్లు ప్రవేశింపగా; కరమున=చేతిలో తీసి; దృష్టిపొంద=అతడు చూపుపొందునట్లుగా.

54. వల్లె=మంచిది యనుచు; డాయుచుండ=ఇల్లుచేరగా; తండ్రి వంగి=వ్రాలి కుమారుని కౌగిలించుటను; దానుని కరము=చేయి; ఊతో=ఆధారమో యన గా; కొని=పట్టుకొని; ఆనంద మినుమడింప=సంతోషము రెండురెట్లు కాగా.

55. యాజ్ఞన్=సన్మనస్కుని సెలవుమీద కొడుకు తల్లిదండ్రులకు మ్రొక్కగా; వారలిద్దఱును=తల్లిదండ్రులిద్దఱును; వలనుపడగన్ గట్టిగా కౌగలించుకొని; వదలరైరి=కౌగిలి విడువక యుండిరి. పుత్రవాత్సల్యమునకు=పుత్రునిమీది దయకు; ఎంత భూరిబలమొ=ఎంత గొప్ప బలమున్నదో గదా.

56. మేను ఉబ్బగ=శరీరము ఉప్పొంగగా; అమ=తల్లి; ఇతరము గానక=ఇతరమైన యే వస్తువును గమనింపక; ధరన్ పడ్డ=భూమిమీద పడిన; పైడిన్ కన్నట్లు=బంగారము చూచిన రీతిగా (అబ్బురముగా జూచుచు) ఆనందబాష్పజలములన్=సంతోషముచే కన్నులనుండి వెడలు నీటితో; నందనున్=కొడుకును జలకము; ఆర్చి=స్నానము ఆడించి; చిత్తంబు అలరన్=ఆనంద హృదయములతో.

57. ఒక్కింత సేపునకు=కొంచెము సేపునకు; ఒయ్యనన్ వదలి=మెల్లగా కౌగలింతలు వదలిపెట్టి; తల్లి గణాధీశ్వరునకు=సన్మనస్కునకు; సాష్టాంగము ఎఱగి=మ్రొక్కి; లేచినన్=లేవగానే, (ఆ సన్మనస్కుడు) మీ తండ్రి లోచనములకు=కన్నులకు ఔషధము పెట్టు మని చెప్పగా; కుమారుడు అప్పుడు ఆ మందు కన్నులన్ అలవరించిన=పూయగానే; అంతటన్ తోభ్యునకు విశ్వమెల్లన్ తేట తెల్లమయ్యెన్=ప్రపంచమంతయు స్పష్టముగా నగపడినది; కడలేని=ఒడ్డులేని; ఆనందవార్ధిలోన్=సంతోష సముద్రములో; తేలుచున్=తేలియాడుచును; పదములన్ వ్రాలి=పాదములమీద బడి; మునివర్య=ఓ ముని శ్రేష్ఠుడా; భవదీయ సత్ కృపావశతన్=మీ యొక్క మంచి కరుణ వలనగద; అంధత తొలంగెన్=గ్రుడ్డితనము పోయినది; ధన్యుడను=కృతార్థుడను అయితిని; నీ ఋణము=నీ యప్పు ఎట్లు తీర్చుకొనగలవాడను అని తోభ్యుడు; సపత్నీకుడై=పత్నితో గూడుకొనినవాడై.

తే॥ భోజనాదులు గావించి పోయి వచ్చి - నట్టి తెఱఁగెల్ల వివరింపుఁ డనిన సన్మ
నస్కుఁ డట్లనె చేసి యానంద మొదవఁ - బూస గ్రుచ్చిన చందానఁ బొసఁగఁ జెప్పి. 58

ఆ॥ పెండ్లికొమరుఁ జూచి పిమ్మటఁ జనుదెంచు - ప్రజలకెల్ల నేత్రపర్వముగను
మందిరములు శోభ నొందించి శోభస్క - రముగ గూర్పవలదె రభస మలర. 59

ఉ॥ నావుడుఁ దత్కుమారుఁడు మనంబున నెంతయు సంతసంబునన్
వావిరి వెంటఁ దాము గొనివచ్చిన ద్రవ్యము వెచ్చపెట్టి భృ
త్యావళిఁ గూర్చి మందిరము లన్నియు బాగొనరించి వాని నా
నావిధభోగ్యవస్తుకలనంబులుగా నొనరించి వేడుకన్. 60

క॥ ద్వారముల నెల్లఁ బచ్చల - తోరణములు గూర్చి పటహ దుందుభి విలస
ద్భేరీ మృదంగ రవములు - బోరున మ్రోయించి రెలమిఁ బురిలో నంతన్. 61

చ॥ అటఁ జను పెండ్లికూఁతు రొగి నాఱగునాఁడు ప్రవేశమయ్యె వి
స్ఫుట బహు వాద్య ఘోషములు సొల్పెసఁగం జతురంగ యుక్తమై
కుటిల వినీలకుంతలలు గొల్వ ననేక పదార్థ వస్త్రసం
పుట మణి భూషణావళులఁ భూరి విభూతి చెలంగ నింటికిన్. 62

చ॥ అనువుగ నిట్లు వచ్చి తన యత్తకు మామకు మ్రొక్కి వారి దీ
వనలకుఁ జాల నుబ్బుచును వారికి మున్ గృహకృత్యముల్ మనం

58. భోజనాదులు కావించి=ముందుగా స్నానము భోజనము మొదలైనవి చేసి (పిమ్మట); పోయి వచ్చిన తెఱఁగు=మీరు వెళ్లి వచ్చిన సంగతి ఎల్ల వివరింపుడు అని చెప్పగా; సన్మనస్కుఁడు అట్లనె భోజనాదులు చేసి; పూస గ్రుచ్చిన చందాన=దారములో ఒక్క పూసయైనను విడువకుండ హారము గ్రుచ్చినట్లు (జరిగినది ఏమియు మఱవకుండ చెప్పుట) ఆనందము ఒదవన్=సంతోషము పుట్టునట్లు చెప్పి;

59. పిమ్మటన్ చనుదెంచు ప్రజలకెల్ల=వచ్చెడు పరివారమున కెల్ల; నేత్రపర్వముగను=కన్నుల పండువుగా; మందిరములు=తమ యిండ్లు; శోభను ఒందించి=శృంగారించి; రభసము అలరన్=తొందరగా; శోభస్కరము=శుభసూచకములుగ (శోభ కలుగునట్లు) కూర్పవలదె=చేయింపవలదా.

60. నావుడున్=అనగా; వావిరిన్=అతివిస్తారముగ; తమతో దెచ్చిన విస్తార ధనము; వెచ్చపెట్టి=ఖర్చుపెట్టి; భృతి ఆవళి కూర్చి=పనివాండ్ర సమూహము పోగుచేసి; వానిన్=ఆ యిండ్లను; నానా విధ భోగ్యవస్తు కలనంబులు గాన్=అనేక విధములైన అనుభవింపవలసిన వస్తువులతో నిండినవానినిగా; వేడుకన్ ఒనరించి=సంతోషముతో చేసి (వంట యింటిలో నేయే వస్తువులుండవలెనో, పడకటింటిలో నేయే వస్తువులు సామగ్రి యుండవలెనో, కచ్చేరి చావడిలో నేయే సామానులుండవలెనో కనుగొని వానివాని నా యా యిండ్లలో జేర్పించి.)

61. ద్వారముల నెల్లన్=అన్ని గుమ్మములకు; పటహదుందుభి విలసత్ భేరి మృదంగ రవములు=తప్పులు గండుభేరులు, పెద్ద భేరులు, మద్దెలలు వీనియొక్క ధ్వని, బోరునన్=బాగుగ; ఎలమిన్=శుభప్రదముగ; మ్రోయించిరి=వాయించినట్లు చేసిరి.

62. ఆ చోట ప్రయాణము చేయుచున్న కన్య[illegible]; ఒగిన్=వరుసగా; ఆఱవదినమున చతురంగ యుక్తమై=ఏనుగులు, గుఱ్ఱములు, రథములు, కాల్బంట్లతోగూడ; విస్ఫుట వాద్యఘోషములు=బాగుగ అనేక వాద్యముల ధ్వనులు; సొల్పెసంగన్=ఒప్పుచుండగా; కుటిల వినీల కుంతలలు=వంపులు తిరిగిన నల్లని ముంగురులుగల స్త్రీలు; కొల్వగన్=తనతో సేవించి రాగా; అనేక పదార్థ వస్త్ర సంపుట మణి భూషణ ఆవళులన్=అనేకమైన వస్తువులు బట్టలు పెట్టెలు రత్నభూషణముల సమూహముతో; భూరి విభూతిన్=గొప్ప యైశ్వర్యముతో; చెలంగన్=ఇంటికి ప్రవేశము అయ్యెన్.

63. అనువుగ=చక్కగా (వినయముగ) వచ్చి; ఉబ్బుచున్=పొంగుచు; మున్=ఇంతకు ముందే; గృహకృ

బున వివరించినట్లు మును మున్నుగఁ గ్రొత్త యొకింత లేక హె
చ్చిన భయభక్తులం బనులు సేయఁగఁ జొచ్చె జనాళి మెచ్చఁగన్. 63

క॥ పొగడిమి నిఖిల జగంబులుఁ - గోడలి సుగుణాతిశయముఁ గొనియాడంగా
వేడుకమైఁ దోభ్యుఁడు తన - చేడియయును దాను సుతుని చిత్తం బలరన్. 64

ఉ॥ అయ్యెడఁ బౌరవర్గములు నర్థిజనావళి బంధుకోటులన్
వియ్యము కాంతవెంబడిని వేడుకఁ బంపిన యట్టివారలం
జయ్యన నన్న వస్త్ర విలసన్మణి భూషణ వాహనాదులన్
నెయ్యము మీఱఁగాఁ దనిపి నేర్పునఁ బంపి ప్రశాంతచిత్తులై. 65

వ॥ తదనంతరంబా తండ్రియుం గుమారునితో నాలోచించి సన్మునిసన్నిధిం జేరి సాష్టాంగ దండప్రణామంబు లాచరించి, మహాత్మా యుష్మత్ప్రభావంబునం గదా మాకు నగ్గబేలునివలని ధనాగమంబును, దనూభవుని వివాహంబును, మదీయ నేత్రదోష విమోచనంబును, నిమ్మహా విభవంబునుం జేకూరె. అట్లుఁ గాదేని యంధుండనై యతిశయ దారిద్ర్యంబునం జిక్కువడి యున్న నావలన నేమి కాఁగలదు; భవదీయ కృపాలబ్ధిం గృతార్థుండనైన నాకు మీ ఋణంబు దీర్చుట కింతకు నుపాయంబులేమి శరీరార్థ ప్రాణంబులు మొదలుగా గలుగు సర్వస్వం

త్యము=ఇంటిలో జేయవలసిన పనులు (ఎవ్వరో) వివరించి చెప్పినట్లుగానే; క్రొత్త యొకింత లేక=వచ్చినది క్రొత్తయే పని యెట్లు చేయవలెనో యొక్కరు చెప్పక మునుపే; జనాళి మెచ్చగన్=లోకులు మెచ్చుకొనునట్లు; హెచ్చిన భయభక్తులన్=మిక్కిలియైన భయముతో (పెద్దవా రేమందురో యని) భక్తి=వారికేమి లోపము గాకుండ శ్రద్ధతో; పనులు చేయుగన్ చొచ్చెన్=మొదలు పెట్టెను.

64. కోడలి సుగుణాతిశయము=తన కోడలియొక్క మంచి గుణములలోని మేలును; నిఖిల జగముల్ పొగడిమిన్=సమస్త జనులు బాగుగా కొనియాడంగాన్; తోభ్యుడు వేడుకమైన్=వేడుకగా; తానును తన చేడియయును=తన భార్యయును; సుతుని చిత్తంబు అలరన్=కుమారునికి సంతోషము పుట్టునట్లు.

65. అయ్యెడన్=అక్కడ; పౌర వర్గములన్=పట్టణములో నున్న జనులను; అర్థి జనావళిన్=బిచ్చగాండ్రను; బంధుకోటులన్=చుట్టములను; వియ్యము=వియ్యాలవారు (అనగా రాఘవేలుని బంధువులు) కాంత వెంబడిని వేడుకన్=పెండ్లికూతురుతో వినోదమునకై పంపిన యట్టి వారలను; అన్న వస్త్ర విల సన్మణి భూషణ వాహనాదులన్=అన్నము బట్టలు రత్నముల నగలు పల్లకీలు గుఱ్ఱములు మొ॥ వానిచేత; నెయ్యము మీఱగన్=మిక్కిలి స్నేహముతో; తనిపి=సంతోషపెట్టి; నేర్పునన్=నేరుపుతో; పంపి=ఎవ్వరి యింద్లకు వారిని పంపించి; ప్రశాంత చిత్తుడై=ఏమియు తొందరలేక నెమ్మది పడిన హృదయముతో.

66. తదనంతరంబు=వారిని పంపివేసిన పిమ్మట; దండప్రణామంబులు ఆచరించి=దండ నమస్కారము చేసి; యుష్మత్ ప్రభావంబునంగదా=తమయొక్క మహిమవలననే; అగబేలునివలని=గబేలుని యొద్దనుండి; ధనాగమంబు=ధనము వచ్చి చేరుటయు; తనూభవుని=కుమారుని వివాహంబును; మదీయ నేత్ర దోష విమోచనంబును=నా కన్నుల గ్రుడ్డితనము పోవుటయు; ఈ మహా విభవంబును=ఇంతటి గొప్ప ఐశ్వర్యమును కలిగినది; అట్లు కాదేని=మీ మహిమయే లేకపోయినయెడ (మీరు మాకు దొరకనియెడల) అంధుండనై=గ్రుడ్డివాడనై; అతిశయ దారిద్ర్యంబునన్=మిక్కిలి బీదతనములో; చిక్కుపడి యున్న నా వలన ఏమి కాగలదు=ఏమియు చేయలేను. (అంత దూరము నేను పోగలనా, ధనము తేకలుగుదునా, పిశాచిని సంహరింపగలనా) భవదీయ కృపాలబ్ధిన్=తమ దయ దొరకుటచేత; కృతార్థుండన్=నా కోరికలన్నియు నెఱవేరినవాడను అయితిని; మీ ఋణము తీర్చుటకు ఉపాయంబు లేమి=లేకపోవుటచేత; శరీర అర్థ ప్రాణంబులు=నా శరీరము ధనము ప్రాణములను మొదలుగా కలుగు; సర్వస్వంబును=అంత సొత్తును; యుష్మత్ అధీనము=మీ అధీనము చేసితిని

బును యుష్మదధీనంబు చేసితి, వీనిలో నర్థంబైన యది గ్రహించి కటాక్షించి
రక్షింపవే యని వేడిన సన్మహాభావుండు మందలించిన దెట్టిదనిన. 66

సీ॥ అప్పులార మహిని బ్రభువుల వర్త్మంబుఁ - గనుపఱపమి లెస్సగాని సర్వ
నాయకుఁ డొనరించు న్యాయకార్యంబుల - నోరులకుఁ దెలుపుట యుత్తమంబు
గాఁగ శ్రీదేవుని యగణిత కరుణఁ - బ్రకటితము గావింపఁ గడఁగవలదె
తనరఁగా నిక్షేపధనములు మించును జప తప ధర్మాదు లాచరణము
తే॥ బీదలకు భిక్షమిచ్చుట యెక్కువ యగుఁ - దలఁప ధర్మకృత్యము మోక్షద్వారమగును
నదియుఁ బాతకములఁ బోనడంచి మఱియు - రక్షణంబిడు నిత్యమరణమునుండి. 67

వ॥ యాచక బృందంబుల నన్నపానంబులం దనిపి విగత జీవకళేబరంబుల భూస్థలిం జేర్చి, క్లేశంబునం బొగులునెడ సర్వేశ్వర ధ్యానంబు సల్పి నీ సద్గుణ ప్రభావంబుచే లోకమచ్చెరువొందఁ జేయంగ నీ చరితంబు సారెసారెకు సర్వదయామయుండగు సర్వేశ్వరునికి నేనె నివేదించి యున్నవాఁడ, నీ నిశ్చలభావంబవలోకింప జగధీశుం డిచ్ఛం గొని పెక్కు యిక్కట్టులం బరీక్షించె నందున నీవు కృతార్థుండ వగుటం జేసి నీ యగణిత యిక్కట్టులం దుదముట్టింప ననుజ్ఞాతుండనై భూమండలంబున కేతెంచి భూతపీడిత సారమ్మ వేదన నివారింపను భవన్నేత్రదోష విమోచనంబుఁ గావింప నిందుఁ జరియించుచుందు. 68

తే॥ పరమె నాకు నునికిపట్టు గురుని భజన - నాదు నిజవృత్తి యిఁక నీకు మేది మేలు
సల్ప నరిగినాఁడ ననఘ చరితగాని - మఱియొక పని బూనియు నేను మసలరాదు. 69

తే॥ నిరతము నిఖిలేశుని భజియించు సత్తు
సన్మనస్కులలో నేనె స్వామిఁ గదసి

(మీ కిచ్ఛితిని:) ఆ మహాభావుండు=ఆ సన్మనస్కుడు.

67. ప్రభువుల వర్త్మంబు=రాజులయొక్క త్రోవను; గనుపఱపమి లెస్స=బహిరంగపఱపక యుండుట మంచిది; గాని సర్వనాయకుఁడు జరిపించు న్యాయకార్యంబు=దేవుడు చేయు యథార్థమైన పనులను తెలియ చేయుట శ్రేష్ఠమైనది; అగణిత దయ=లెక్కించుటకు వీలులేని దయను; ప్రకటితము కావింప కడఁగవలదె=బహిరంగపఱచుటకు ప్రయత్నము చేయవలెను; నిక్షేప ధనముల=పూడ్చబడిన ధనములను; ఎక్కువ యగును=ఘనమగును; పోనడంచి=తొలగించి; రక్షణంబిడు=రక్షించును.

68. యాచక బృందంబుల=భిక్షకుల సమూహమును; తనిపి=అన్నముతో తృప్తిపఱచి; విగత జీవకళేబరంబుల=విడిచిన ప్రాణములుగల దేహములను (పీనుగులను); భూస్థలిం చేర్చి=పూడ్చిపెట్టి; క్లేశంబునం బొగులు నెడ=దుఃఖముతో క్రుందు సమయమున; నీ సద్గుణ ప్రభావంబు=నీ యొక్క మంచి గుణముల ఖ్యాతి; లోకమచ్చెరువొందఁ జేయఁగా=జనులు ఆశ్చర్యపడునట్లు చేయగా; నీ చరితంబు=నీ విషయము; నివేదించి=తెలియచేసి యున్నవాడను; నీ నిశ్చల భావంబు అవలోకింప=నీ కదలని మనస్సును పరీక్షింప; జగధీశుం డిచ్ఛం గొని=దేవుడు ఇష్టపడి; పెక్కు ఇక్కట్టులం బరీక్షించె=అనేక కష్టములతో నిన్ను పరీక్షించెను; అందున నీవు కృతార్థుండవగుటం జేసి=నీవు జయించినందున; తుదముట్టింప=తొలగించుటకు; అనుజ్ఞాతుండనై=ఆజ్ఞాపింపబడినవాడనై; భూతపీడిత=దయ్యముచేత బాధింపబడు సారమ్మయొక్క; వేదన నివారింపను=కష్టమును తొలగింపను; భవన్నేత్ర దోష విమోచనంబు=నీ కన్నుల జబ్బును తొలగింపను.

69. పరమె నాకు ఉనికిపట్టు=మోక్షమే నా నివాసస్థలము; గురుని భజన నాదు నిజవృత్తి=సర్వేశ్వరుని సేవించుటయే నా సొంత పని; ఇక నీకు మేది మేలు సల్పను=నీకు భువిలో మేలు చేయుటకై వచ్చియున్నాడను; మఱియొక పని బూనియు=వేరొక పనిమీద; నేను మసలరాదు=నేను తిరుగకూడదు.

ప్రథమ స్థానంబుఁ గొనియుండుఁ బరమునందు
నాదు నామంబు రఫయేలె యనఘచరిత. 70

తే॥ గగనచరులకు ధరయందుఁగల మణిధన - ములవలన లాభమించుక గలదె తోభ్య,
యా సిరియు నాకుపేక్షణీయంబు నీవె - కనకమాణిక్యములతోడ మనుము లెస్స. 71

వ॥ అనిన గంభీరాద్భుతయుక్తమగు వారి వాక్యము లాలించి తోభ్యులు భయభ్రాంతచిత్తులై కంప మొంది సన్మనస్కునకు దండప్రణామంబు లాచరింప, భక్తాగ్రసరులార మీ భయంబునకుం గారణం బెయ్యదియు లేదుగాన నిర్భయంబున మనుచు మీర లనవరతము నిత్య సత్య స్వరూపుండును నిరాకార నిర్జరుఁడును సర్వేశ్వర ధ్యానంబునం జెలంగుచు వారి యపారకృపారసంబు నెల్ల జనంబులకు నెఱింగింపుఁడని పలికి రఫయేలుం డదృశ్యుండయ్యె. 72

ఆ॥ అంతఁ దండ్రి కొమరు లాశ్చర్యమగ్నులై - జాముమీఁద నచట సాగిలపడి
భక్తిఁ దెల్పి నిట్లు పరమనాయకునికి - స్తోత్రములు సలిపిరి చోద్యమలర. 73

తే॥ నిశ్చల మహిమంబున నెప్డు నెగడెడు నిఖి
లేశ్వరా మీ ప్రభావంబు శాశ్వతమగు
రాజ్యమున నలరారఁ బరాక్ర మొప్ప
నక్రమ చరితులకు శాసన మొసఁగుదువు. 74

తే॥ మఱియు వాపోవ వారి కపార కరుణ - రక్షణ మిడ నేతెంతువు రక్షకుండ
మీ యవారిత శౌర్యంబు నే నరుండు - ధిక్కరింపఁజాలు నవనిఁ దెంపు జేసి. 75

తే॥ ఇజ్రయేలీయ జనులార విశ్రుతచరి - తుని విభవమును నెఱుఁగ నవని జనతతి
యరువుగాఁ జాటఁగవలదె యనుదినంబు - వినుతి సేయవలదె కీర్తి వెలయ పుడమి. 76

---

70. నిరతము=ఎల్లప్పుడు, స్వామిఁ గదసి=దేవుని సమీపించి; ప్రథమస్థానంబు=మొదటి స్థలమును; కొనియుండు=పొందియుండును; అనఘచరిత=పాపము లేనివాడా.

71 గగనచరులకు=దూతలకు; ధరయందుగల మణిధనములవలన=భూమిలోగల మణులు మొదలగు ఐశ్వర్యములవలన లాభము ఇంచుక గలదె; ఆ సిరియు=ఆ భాగ్యము; నాకు ఉపేక్షణీయము=నేను కోరదగనిది; నీవు కనకమాణిక్యములతోడ=బంగారు మాణిక్యములతో; మనుము లెస్స=బాగుగా బ్రదుకుము.

72. అనిన గంభీరాద్భుత యుక్తమగు=అనంగ గాంభీర్యముతోను అద్భుతముతోను గూడుకొనిన వారి వాక్యములు విని; భయభ్రాంత చిత్తులై=తోభ్యులు భయముతో నింపబడిన చిత్తములు గలవారై; కంపమొంది=వణకి; దండప్రణామంబు లాచరింప=దేవదూతను నమస్కరింపగా; భక్తాగ్రసరులారా=భక్తులలో శ్రేష్ఠులారా, మీ భయంబునకుం కారణంబు ఎయ్యదియు లేదు=మీరు భయపడుటకు హేతువు ఏమియును లేదు; నిర్భయంబున మనుచు=భయము లేకుండ జీవింపుచు, నిరాకార=ఆకారము లేనివాడును, నిర్జరుడును=ప్రాయము లేనివాడును అగు; చెలంగుచు=వర్ధిల్లుచు;

73. ఆశ్చర్యమగ్నులై=ఆశ్చర్యములో మునిగినవారై; జాముమీద=ఒక జాము సేపు సాష్టాంగపడి.

74. నిశ్చల మహిమంబున=స్థిరమైన గొప్పతనములో; శాశ్వతమగు=నశింపని రాజ్యములో (మోక్షములో) అలరార=ప్రకాశింపగా; అక్రమ చరితులకు=దుష్టులకు; శాసనము=శిక్ష.

75. వాపోవ=దుఃఖింపగ; అపార కరుణ=మేరలేని దయతో; ఏతెంతువు=రక్షించుటకు వచ్చెదవు; అవారిత=అడ్డగింపరాని; ధిక్కరింపజాలు=ఎదిరింపగలడు.

76. విశ్రుత చరితుని=పూజింప తగిన చరితముగలవాని; విభవము నెఱుగ=గొప్పతనము తెలిసికొనుటకై; జనతతి=జనుల సమూహము; అరువుగా=బాగుగా, చాటవలదె=ప్రకటింపవలదా.

తే॥ అరయఁగా ఘన దేవతల్ పలువురు గల
రని నరుఁడు గొల్వఁ దలఁచిన వినుఁడు వాఁడు
చంచలము నొంది కొంగలు సంచరించు
మడుగువోలెఁ గలంగఁగబడి చెడుఁగద. 77

తే॥ తలఁప దైవంబొకఁడె గొల్వ నతఁ డపార
మహిమ నొనఁగూర్చును దురాపపాపగణము
నెడఁగలుగఁగఁ బోనాడి యహీనముక్తి
పదవి నరతతి నిరతము ముదమునొంద. 78

తే॥ అతిబలులు సర్వకార్యనిర్వాహకులగు
వారె మీ రరిగి యచట నచటఁ బామ
రుల వెదకుచు నెఱిఁగిన విమలచరితముఁ
గఱపుఁడు చెడని భాగ్యముఁ గనఁగ వారు. 79

తే॥ అనియుఁ దోభ్యుండు వారికి వినయ మొప్పఁ
బలికి జగదీశుఁ గొల్వఁగ భక్తిమీరఁ
జుట్టునున్న వారెల్లరుఁ జోద్యమొంది
మ్రొక్కు లిడిరి స్వామికి నెంతొ మిక్కుటముగ. 80

తే॥ నూటరెండేండ్లు విలసదనూనవైభ
వోన్నతి సుఖించి తోభ్యుఁడు నన్నమాంబ
యును బరంధామమున కేగి రొగిఁ దనూజుఁ
డపుడు వారల కంత్యేష్టి యాచరించి. 81

సీ॥ ధైర్యంబు వదలక తండ్రి చెప్పిన బుద్ధు-లన్నియు మదిలోన ననువుపఱిచి
సత్యమేమఱక నిశ్చల భక్తి యుక్తిమై-నాదిమ దైవంబు నాశ్రయించి
మఱియుఁ బురోహితామాత్యసుహృద్బంధు-పరివార జనములఁ బ్రజల నరసి
పాలించుచుండి తత్పట్టణం బొక కొన్ని-యబ్దంబులకు ఖిలం బగుట దివ్య

77. గొల్వ తలచిన=నరుడు పూజింప తలచినచో; కొంగలు సంచరించు మడుగువోలె=కొంగలుండు కొలనువలె; నాడు కలగగపడి=కలతపారి; చెడుగద=చెడిపోవును గదా.

78. దురాపపాపగణము=అనుభవింపగాని పాపముల సమూహము; ఎడ కలుగగ పోనాడి=దూరముగా తఱిమివేసి; యహీన ముక్తిపదవి=నశింపని మోక్షము.

79. అతిబలులు=మిక్కిలి బలముగలవారా (అనగా దైవవిషయములందు పట్టుదలగలవారని అభిప్రాయము); సర్వకార్య నిర్వాహకులు=అన్ని కార్యములను సాధింప కలిగినవారా;=(ఇశ్రయేలులారా) పామరులన్=తెలివిలేనివారిని; కఱపుడు=నేర్పుడి; చెడని భాగ్యము కనగా వారు=వారును మోక్షభాగ్యము కనునట్టుగా.

80. మిక్కుటముగా=అధికముగా.

81. విలసత్ అనూన వైభవ ఉన్నతిన్=ప్రకటమైన తక్కువకాని సుఖములయొక్క అతిశయమున సుఖించి; తోభ్యుడును అన్నమాంబయును; పరంధామమునకు=శ్రేష్ఠమైన అన్నిటికంటె మిన్నయైన తావునకు (మోక్షస్థానమునకు) వెళ్లిరి; ఒగిన్ తనూజుడు=క్రమముగా వాని కుమారుడు; అంత్య ఇష్టి ఆచరించి=కడపట చేయవలసిన క్రియలు (చచ్చినవారికి జేయవలసిన కర్మలు) చేసి.

తే॥ దృష్టి నెంతయు నూహించి తేజమలర - మామ గ్రామ ప్రవేశమై మహిమ వైభ
వోన్నతి ననేక వర్షంబు లుండి పిదప - హితయుతముగాఁగ నొందె సర్వేశుపదము. 82

క॥ శ్రీకమనీయగుణాకర - భీకర సంతాప రోగ భేషజ విలస
త్ప్రాకట చారిత్ర మహా-యాకార జననలయముల కతిమూలంబా. 83

గద్యము॥ ఇది శ్రీమత్ జేసునాథ సద్గురు ప్రసాదలబ్ధాప్త విధ కవిత్వప్రవీణ వినయధురీణ భారద్వాజగోత్ర పింగళి నాగయామాత్యపుత్ర యెల్లనార్య ప్రణీతంబైన సర్వేశ్వర మహాత్త్వంబను మహా ప్రబంధంబునందు సన్మనస్కుండు తోభ్యకుమారునిం [illegible]ని చని రాగ్వేలునిం గనుంగొనుటయు, నతండు తన సఖుండైన తోభ్యకుమారునింగాఁ దెలిసి యతని కుశలం బరయుటయుఁ బరిణయ ప్రసంగంబునం బూర్వభయం[illegible] నల్లుని కుశలంబు దెలిసినమీఁదంగాని తత్పరిణయంబు సేయనని పరీక్షించుటయుఁ దత్సమయసంజాతంబగు భూతంబువలన నబ్బాలుని విజయంబును, వివాహము సేయుటయు, గబేలుండు వివాహంబున కేతెంచుటయుఁ గుమారునిం దలంచి దుఃఖించు నిజాంగన నవలోకించి తోభ్యుం డనునయించుటయుఁ, దత్కుమారుం డప్పు డా సన్మనస్క సహితంబుగా నేతెంచి తల్లిదండ్రుల యుల్లంబులు పల్లవింపఁ జేయుటయు, నౌషధ మహాత్త్వంబునఁ దండ్రికి దృష్టి యొసంగి గృహంబులును బురంబు నలంకరింపంజేసి ధన కనక వస్తువాహన సమృద్ధంబు గావించి మహైశ్వర్యసంపన్నుండై యుండుటయుఁ, బెండ్లికూఁతురారవ దినంబునం బ్రవేశించుటయుఁ దన్మహోత్సవంబును సన్మనస్కుండు యచ్చటం గదలి సర్వేశ్వరు సన్నిధానంబున కరగుటయుఁ దోభ్యుఁ డేతద్వృత్తాంతం బఖిలంబును నెఱింగించుటయు, ననేకాబ్దంబు లిహసౌఖ్యంబు లనుభవించి పత్నీసహితంబుగా సర్వేశ్వరుం జేరుటయుఁ దదనంతరంబు తత్కుమారుండు [illegible] సుఖంబు లనుభవించి పిమ్మట సర్వేశ్వరు సన్నిధానంబున కరుగుట[illegible] సర్వంబును జతుర్థాశ్వాసము.



సంపూర్ణము.

82. ధైర్యంబు వదలక=తల్లిదండ్రులు లేరని దుఃఖపడి ధైర్యమును విడిచిపెట్టక; అనువుపఱిచి=నిల్పుకొని సత్యము ఏమఱక=మఱవక; నిశ్చల భక్తి యుక్తిమై=చలింపని దైవభక్తితోగూడి యుండుటచేత; ఆదిమ దైవంబుఁ=మొట్టమొదటి దేవుడైన సర్వేశ్వరుని; పురోహిత అమాత్య సుహృత్ బంధు పరివారజనముల ప్రజల=గురువులను మంత్రులను స్నేహితులను చుట్టములను సేవకులను జనులను; అరసి=ఎవ్వరికేమి లోపము లేకుండ చూచి; ఒక కొన్ని యబ్దంబులకు=ఇంక కొన్ని సంవత్సరములకు; ఖిలంబు=నాశనము అయిపోవునని; దివ్య దృష్టిఁ=దివ్యజ్ఞానముచేత; ఎంతయుఁ ఊహించి=బాగుగా తెలిసికొని; తేజమలరఁ=ప్రతాపవంతుడై; మహిమ వైభవ ఉన్నతిఁ=గొప్ప ప్రభుత్వముయొక్క అతిశయమున ఉండి; హిత యుతముగఁ=తనకు రావలసిన వారి యందఱితో; సర్వేశు పదముఁ=సర్వేశ్వరుడున్న మోక్షపదమును చేరెను.

83. శ్రీకమనీయ గుణ ఆకర=శుభకర సుందరమైన సుగుణములకు ఆకారమా; భీకర సంతాప రోగ భేషజ=భీతిని పుట్టించు దుఃఖముల నెడు రోగములను గుదుర్చుటకు వైద్యుడా; విలసత్ ప్రాకట=ప్రకాశించుచున్న స్పష్టమైన చరిత్రము గలవాడా; మహా యాకార=గొప్ప రూపములయొక్క; జనన లయములకు=పుట్టించుటకును నశింపజేయుటకును; అతిమూలంబా=మిక్కిలి కారణమైనవాడా.